# నేను మా పళ్ల డాక్టరును అడిగా - కేవలం ఫోర్‌హాన్స్ ఎందుకు?

"ఎందుకంటే మీ చిగుళ్లు గట్టిగా వుంటే
పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి..."

మరి కేవలం ఫోర్‌హాన్స్ మాత్రమే చిగుళ్లను
గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గి వున్నది.

ఫోర్‌హాన్స్‌లోని ఈ ప్రత్యేక అస్ట్రింజంట్ అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడైన డా. ఆర్.జె. ఫోర్‌హాన్ ద్వారా చేర్చబడిన ఒక విశిష్ట పదార్థము. ఇది నిజంగా చిగుళ్లను గట్టి పరుస్తుంది. దీనితో మీ పళ్లకు దృఢమైన ఆధారం లభించి అవి దీర్ఘకాలం నిలుస్తాయి.



ప్రత్యేకమైన అస్ట్రింజంట్ ఎలా పనిచేస్తుందో చూడండి:

1. ఇది నేరుగా చిగుళ్ల మీద పనిచేసి వాటిని బిగుతు చేస్తుంది.
2. వాటిని బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టునిస్తుంది.
3. అందుచేత పళ్లకు దృఢమైన ఆధారం మరియు దీర్ఘ ఆయుస్సు లభిస్తాయి.



ఇక మీద నాకెపుడూ మరే టూత్‌పేస్టు వద్దు. ఫోర్‌హాన్స్ మాత్రమే కావాలి.




ఫోర్‌హాన్స్ - ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్‌పేస్టు.

# ఇప్పుడు... గోద్రెజ్ రూపొందించిందొక కొత్త సబ్బు.
# ఇది మీ అంత శ్రద్ధగా మీ చర్మాన్ని కాపాడుతుంది.




## Godrej నిమిన్

### శుద్ధమైన వేపనూనె యొక్క సహజ సద్గుణాలు కలిగినది.

నీమ్, మర్గోసా అన్న పేర్లతో పిలువబడే వేపచెట్టు, చర్మ సంబంధ సమస్యలకై
మానవజాతికి ప్రకృతి ప్రసాదించిన వరాలలో ఒకటి. వేపనూనెను క్రమం తప్పకుండా వాడితే,
అది మీ చర్మం నునుపుగా, తేటగా ఉండడానికి తోడ్పడుతుంది.

గోద్రెజ్, శుద్ధమైన వేపనూనెను చేర్చి రూపొందించిన సబ్బు, నిమిన్ — మీ చర్మ
సమస్యలను కడిగి పారవేసే లగ్జరీ టాయిలెట్ సోపు. ఈ గోద్రెజ్ నిమిన్ మరింతకాలం మన్నుతుంది.
ఎందుకంటే ఇది ఇతర కొన్ని మర్గోసా సబ్బులవలె మెత్తబడిపోదు.

**మీ చర్మ సమస్యలను కడిగి పారవెయ్యండి...**
**మీ చర్మానికి శుభ్రమైన, ఆరోగ్యవంతమైన నిగనిగ ఇవ్వండి.**

CHAITRA-BG 226 TEL

## మధ్యతరగతి

30–3–84 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో డా॥ జయదుబాషీగారి లేఖ చదివాను. స్వరాజ్యం వచ్చాక మధ్యతరగతివారే ఎక్కువ బాగుపడ్డారని వారు వ్రాశారు. అసలు ఈయన దృష్టిలో మధ్యతరగతివారంటే ఎవరూ? సాలుకు40,000 వేలు తెచ్చుకోనే స్వీపరు ఈయనదృష్టిలో మధ్య తరగతి అనుకుంటే న్యాయంగా ఉండదు. ఆయన చెప్పే పల్లెటూరులోని బడిపంతులే మధ్యతరగతి వాడు. మధ్యతరగతివారు కట్టే పన్నులు ఇళ్ళ పన్ను, నీళ్ళ పన్ను, వృత్తిపన్ను, అరవికరం వున్న భూమిశిస్తు ఇవన్నీ మధ్యతరగతి వారిమీదపడే పన్నులు. మధ్యతరగతి ప్రజలు పడే బాధలు పల్లెటూళ్ళకు వచ్చిచూస్తే తెలుస్తుంది.

మధ్యతరగతివారు అంటే నా దృష్టిలో టీచర్లు, గుమస్తాలు, నాలుగైదు ఎకరాలు భూమివున్న రైతులు, నెలకు ఆదాయం 15 వందలకు లోపు వున్నవారని. వారి తరపున శ్రీ ఫల్కీవాలా మాట్లాడి వారి అభివృద్ధికి కృషిచేస్తే మంచిదేనని నా వుద్దేశ్యం. అంత గొప్పవాడు గాంధీమహాత్ముడు ప్రధానిమంత్రి పదవి ఆశించలేదే! మరి శ్రీ ఫల్కీవాలా రాజకీయాల్లోకి రాకుండా మధ్యతరగతి వారికోసం పాటుపడితే నష్టం ఏమిటి? ఎవరైన పుస్తకం రాస్తే అందులో విధిగా నెహ్రూ, ఇందిరాగాంధీ గార్ల పేర్లు వుండాలని ఏమైనా నిబంధన వుందా?

కె. వెంకట నారాయణరావు, ధవళేశ్వరం.

## జంతు హింస

సాధారణంగా జీవహింస నెవ్వరూ హర్షించరు! అయితే 2–3–84 సంచికలో 'పరిశోధనల పేరిట జంతు హింస' వ్యాసం మెచ్చుకోదగ్గ స్థాయిలో లేదు. వాక్సిన్ ముందుగా పరీక్ష చేయించుకోడానికి రమ్మంటే ఈ వ్యాసకర్తే కాదు – ఎవ్వరూ ముందుకురారు. మరి ప్రజల ఆహారవసరాల నిమిత్తము వినియోగిస్తున్న వేలాది జీవాలగురించి రచయిత అభిప్రాయాన్నికూడా తెలియపరిస్తే బావుంటుంది.






జంతుహింస పేరిట పోలియో, కలరావంటి రోగాలకు మానవజాతి తుడిచిపెట్టుకు పోవాలన్నది రచయిత ఉద్దేశ్యమా? పి. హెచ్. డి. సంపాదించడానికి ఖర్చయిన నత్తలగురించి బాధ పడేముందు – ఇన్నాళ్ళుగా చరిత్రలో యజ్ఞ యాగాదులపేరిట బలిపశువులు – మతాలు మహత్యాలపేరిట జంతు బలులు, నర బలులు గురించి ఒక్కక్షణం ఆలోచిస్తే ఆ పి. హెచ్. డి. కి అర్థముంటుంది.

చక్రధర్, శ్రీధర్, అంబాజీపేట.

## డా॥ అక్కినేనికి శుభాకాంక్షలు!

1983 సంవత్సరము ఆంధ్ర సచిత్ర వార పత్రిక ఫిలిం బ్యాలెట్ పోటీలో గెలుపొందిన విజేతలందరికి మా శుభాకాంక్షలు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఫిలిం బ్యాలెట్ పోటీ ప్రారంభించినప్పటినుండి 13 సార్లు ఉత్తమ నటుడిగా ఎన్నికైన మా అభిమాన నటులు ఎవర్‌గ్రీన్ హీరో డా॥ అక్కినేనిగారికి మా శుభాకాంక్షలు. 1959, 60, 61, 64, 69, 70, 71, 72, 73, 74, 77, 81, 83 సంవత్సరాలలో డా॥ అక్కినేని ఉత్తమ నటుడిగా ఎన్నికైనారు.

ఈ ఫిలిం బ్యాలెట్ పోటీలో 13 సార్లు ఉత్తమ నటుడిగా గెలుపొందడం విశేషంగా చెప్పవచ్చు.

పి. రవీందర్‌రెడ్డి,
డా॥ అక్కినేని అభిమాన సంఘం,
ఆలియాబాద్.



## "సన్మానం"

ఈ దశాబ్దంలో మంచి కథల్లో ఒకటిగా చెప్పుకోవలసిన కథ 'సన్మానం'. ఉత్తమశ్రేణి కథకు నిర్వచనం ఈ కథలో పుష్కలంగా లభిస్తుంది. కథలో 'పరిశుభ్రత' ఉంది. బంగారానికి తావిలాగ వాస్తవికతకు శిల్పం తోడైంది. శ్రీ మధురాంతకం రాజారాంగారి హృదయం ఈ కథలో ప్రత్యక్షమయింది. ముఖ్యంగా ఆ ముగింపు చూడండి ఎంత బాగుందో. సంవత్సరాలబాటు దాచుకోవలసిన కథ. మరో విశేషం – కథ కోసం వేసిన చిత్రం కూడా బాగుంది.

శంకరభాను, బొంబాయి.

* * *

13–4–84 తేదీ కల ఉగాది ప్రత్యేక సంచికలోని సన్మానం కథ చాలా బాగున్నది. రచయితకి కృతజ్ఞతలు. కథలో దృశ్యాలు కళ్ళకు కట్టినట్లుంది. మమ్మల్ని ఆకట్టుకొన్నాయి. శనగన నరసింహస్వామి, ములుమూడి లక్ష్మీనరసింహం, బులుసు వెంకటేశ్వర్లుగార్ల కవితలు బాగున్నాయి. యర్రగుంట్ల వరలక్ష్మీదేవిగారి అర్థంలేని బ్రతుకు వ్యర్థం. ఇక ముద్రణ గూర్చి చెప్పడానికి నాకు వయసు చాలదు. నేను బుద్దెరిగినప్పటినుండి అందమైన ఆంధ్ర సచిత్ర వార పత్రికనే చూస్తున్నాను.

బండారు వేదానందం, కడప.

## కుదింపు

వారణాసి ప్రసాదరావుగారు వ్రాసిన 'ఆశాకిరణం' కథలో: (1) జనతా ఎక్స్‌ప్రెస్‌లో ఫస్టుక్లాసు కంపార్టుమెంటు ప్రవేశపెట్టినారు. (2) మన ఆంధ్రప్రదేశ్‌ను టెక్సాస్‌కు మరీ దగ్గర చేసినారు, 12000 మైళ్ళ దూరాన్ని 2000 మైళ్ళకు కుదించటముతో.

నా. శి. శాస్త్రి, బొంబాయి.

## చక్కటి కథ

ఈ వారం (27–4–84) ప్రచురించబడిన కథల్లో "గుండెగొంతుకలోన" చాల మంచి కథ. జోగారావుగారు చాలాకాలం తర్వాత కన్పించి కన్పించగనే "చక్కటి కథ"ను అందించినందుకు మనసారా అభినందనలు తెలియచేస్తున్నాను.

యం. ఉమామహేశ్వరరావు, విశాఖపట్టణం.

## ఈ రాగానికదే తాళం

13–4–84 ఉగాది ప్రత్యేక సంచిక నటి దేవిశ్రీగారి ముఖచిత్రంలో ముస్తాబై దర్శనమిచ్చింది.

చక్కిలం విజయలక్ష్మిగారి కలం నుండి దూసుకొచ్చిన "ఈ రాగానికదే తాళం" లయబద్ధంగా ప్రతి సంచికలో ఓ రకం తాళంవేస్తూ ముందుకొస్తూ పాఠకుల్ని ముగ్ధుల్ని చేస్తోంది.

పి. భగవంతరెడ్డి, ఇతరులు,
పెంచుకలపాడు. ★

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని**

**వాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

***శివలెంక శంభుప్రసాద్,***

**సంపాదకుడు :**

[1938–1972]

శుక్రవారం : 18–5–'84

శ్రీ రక్తాక్షినామ సం. వైశాఖ బ. చవితి

**సంపుటము 76 : సంచిక 36**

సంపాదకుడు :

***శివలెంక రాధాకృష్ణ***

విడి ప్రతి వెల రు. 1-80

ఆరు మాసాల చందా రు. 46-80

పోస్టులో ఏడాదిచందా రు. 101-40

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం. విజయవాడ-520 003.

## విషయానుక్రమణిక



## లోకం పోకడ — ఊమెన్









# సీసా స్వాతంత్ర్యం - కాంగ్రెసు వాళ్లూ




బొంబాయి వచ్చిన [illegible]ను గంటల లోపలే మీరు ఎవరో ఇద్దరు ఏదో బేరం చెయ్యటం వింటారు. ఒకరి బావగారి రిఫ్రిజిరేటరు అమ్మకానికి ఉండవచ్చు లేదా ఒక స్మగ్ల్‌డ్ వీడియో కాసెట్ రికార్డర్ అమ్మకానికి రావచ్చు లేదా లారీ నిండా మామిడిపళ్లు అమ్మకానికి సిద్ధంగా ఉండవచ్చు [పోలీసు వాళ్ల వద్ద నుంచి విడిపించుకుంటే] బొంబాయి ఒక నగరం అనటంకన్నా ఒక పెద్ద బజారు అనటం బాగా ఉంటుంది. బజారులో అన్నిటికీ వెల కడతారు కదా! ఈ బొంబాయిలో తాతావారు ఉక్కు, ట్రక్కులూ అమ్ముతారు; బిర్లావారు వస్త్రాలూ, కారులూ అమ్ముతారు; మహేంద్రా వారు జీపులు అమ్ముతారు; లీవర్ బ్రదర్స్ వారు సబ్బూ, వనస్పతీ అమ్ముతారు; అంతూలే సిమెంటూ అమ్ముతారు; అజిత్ కేర్కార్‌గారు లాడ్జింగు అమ్ముతారు; రాజకపూర్ గారు కలలని అమ్ముతారు, వీరందరికీ మించిన ఎడ్వర్టయిసింగ్ కంపెనీ వారు 'కీర్తి'ని అమ్మిపెడతారు, చివరికి అందరూ తమని తామే అమ్ముకుంటారనుకోండి— అది వేరే సంగతి, అమ్ముడు పోయేవారికి ఆ సంగతి తెలీదు.

బజారు అంటే బేరమే కదా! బొంబాయి నిండా బేరాలే. ఎంత పెద్ద బేరం చేస్తే అంత పెద్దవారన్నమాట— మీరు కాని, ఇంకెవరయినా కాని.

అజిత్ కేర్కార్ 5—చుక్కల నక్షత్రాల వ్యాపారం చేస్తారు. మహమ్మద్ అలీ రోడ్‌లో ఒక చిన్న హోటల్ యజమాని గదులని గంటకి ఇంత అని అద్దెకి ఇస్తాడు. వీళ్ల ఇద్దరి మధ్యనా తేడా ఏమిటి? వాళ్ళ రేట్లు మాత్రమేకదా? ఈ పెద్ద బేరాల బస్తీలో ఏదయినా జరగవచ్చు. ఒకరోజు మహమ్మద్ అలీ రోడ్ హోటల్ యజమానే కేర్కార్ (హోటల్) సామ్రాజ్యాన్ని దోచేస్తాడేమో! ఈ విధంగా చూస్తే దేశంలో బొంబాయికన్నా "ప్రజాస్వామ్యపు నగరం" లేదు. ఎలాగంటే, ఇక్కడ అందరికీ వెల అంటూ కట్టవచ్చు. ఈ విధంగా అందరూ సమానమే.

ఇలాంటి నగరంలో అంతూలే కాని రావ్‌రావ్ ఆదిక్ కాని అవతరించటంలో ఆశ్చర్యం ఏమిటి? అంతూలే వ్యాపారం "అధికారం". ధనం అన్నది ఒకరకం అధికారం. రెండో పెద్దమనిషి కూడా అధికారం—వ్యాపారమే చేస్తాడు కాని ఆయనకి దూరదృష్టి లేదు. ఆయన చూపుకి పరిమితి అతి దగ్గరలో ఉన్న సీసా లేదా చీర. ఇద్దరూ శ్రీమతి గాంధీ అనుచరులే. [ఆమె ఇప్పుడు వాళ్లని వదిలించుకోవటానికి ప్రయత్నిస్తున్నారేమో తెలీదు!] అంతూలే సిమెంటు బేరం మీద జారిపడేదాకా ఆమె అనుగ్రహం పొందిన అనుచరుడే. రావ్‌రావ్ ఆదిక్ సయితం వసంత్ దాదా పాటిల్ నెత్తి మీద కాంగ్రెసు అధిష్ఠాన వర్గం (అంటే శ్రీమతి గాంధి) చేత రుద్దబడిన వ్యక్తి కాకపోతే ఇంకెవరు? [శ్రీమతి గాంధీ లేకపోతే కాంగ్రెసు అధిష్ఠాన వర్గం స్థాయి చాలా నీచంగా ఉంటుంది.]

రాజకీయవాదులు లైసెన్సులు అమ్మవచ్చు కాని ఆదిక్ లాంటి మనిషి సారా సీసాను కొనుక్కోకూడదా ఏమిటి? ఆయన పార్టీకి చెందినవాళ్లు ఎందరో ఆయన చేసిన పనులే చేస్తారు. వారికి ఏ ఇబ్బందీ రాలేదు కాని ఈయనకి ఇన్ని కష్టాలు వచ్చాయి, ఎందుకో! హానోవర్‌లో కాని రోమ్‌లో కాని ఆదిక్ చేసిన పనులు ఎందరు కాంగ్రెసు వాళ్లు చెయ్యలేదు? నెహ్రూ కాలం నుంచీ ఇలాంటివి జరుగుతూనే ఉన్నాయికదా?

కాంగ్రెస్(ఇందిర)రాజకీయవాదులు ముందు తమ రాజకీయ పలుకుబడిని వాడుకుని డబ్బులు చేసుకుంటారు. డబ్బు వచ్చిన తరువాత స్థలం, ఇల్లూ, విదేశీయాత్రలూ, ఆడవారూ, మద్యమూ, సంగీతమూ, వీటన్నిటినీ కొనుక్కుంటారు. ఈ ప్రశ్నలు ఆదిక్ తమ పార్టీ సమావేశాలలో వెయ్యకుండా ఉంటారా? నాకు అంత బాగా తెలీదు కాని కాంగ్రెసు (ఇందిర) రాజ్యాంగంలో రాజకీయాధికారాన్ని ధనంగా మార్చాలన్న అధికరణం ఉన్నా ఆశ్చర్యంలేదు. అసలు కాంగ్రెసు (ఇందిర)కి రాజ్యాంగం అంటూ ఉందా? ఉందనే అనుకోండి— కాని ఆదిక్‌కి ఇదొక పెద్ద అడ్డుకాలేదు. నెహ్రూ కాలానికీ ఇప్పటికీ కొన్ని మార్పులు వచ్చాయి. ఆ మార్పులకి అనుగుణంగానే ఆదిక్ నడుచుకుంటారు.

బొంబాయిలో మద్యాన్నీ, మదవతులనీ బాగా వాడి వ్యాపారం చేస్తూ ఉంటారు. బొంబాయి "ఎమ్మెల్యే" హాస్టల్‌ని ఒక



వ్యభిచార గృహంగా మార్చేశారన్న వార్త ఒక వానిని ఈమధ్యనే చదివాను. రాజ్యసభ ఎన్నికలలో కొందరిని అదుపులో ఉంచాలంటే ఇదే మార్గం అని నమ్మేవాళ్లు ఉన్నారు.

మహారాష్ట్ర రాజ్యసభ ఎన్నికలకి పర్యవేక్షణ మనిషి కేంద్ర వాణిజ్య శాఖమంత్రి. ఈయనది ఉత్తర్‌ప్రదేశ్. కాని వ్యాపారం శాఖమంత్రి కదా? అందుచేత బొంబాయికి పంపించారు. ఆదిక్ ఇంత చిన్న యదార్థాన్ని గ్రహించలేకపోయారు పాపం !

కాంగ్రెసు వాళ్లకి నీతిలేదని కొందరు అంటారు. అలాంటి వాళ్లకి "నీతి" అనే మాటకి అర్థంతెలీదు. కొని అమ్మే బేరాలకీ నీతికీ సంబంధం ఏమిటి ? రాజకీయపు బేరాలు పవిత్ర పదార్థాలా ఏమిటి ? హిందుస్తాన్ లీవర్ కంపెనీ వారు సబ్బు అమ్ముకుని లాభం చేసుకుంటారు. అమ్మేప్పుడు "1956 కంపెనీ నీతి చట్టం ప్రకారం అన్ని బేరాలూ నీతిగానే కొనసాగుతున్నాయి." అంటూ ఒక సర్టిఫికేటు తయారు చేయించుకుని పంచుతారా ?

అత్యవసర పరిస్థితి కాలంలో జె. ఆర్: డి. తాతా న్యూయార్క్ టయిమ్స్ విలేఖరితో "ఎమర్జెన్సీ మంచిదే" అన్నారుట. "ఉత్పత్తి బాగా ఉంది, అందరూ (అంటే యూనియన్‌లు) తమ విధుఃని బాగా నిర్వహించుకుంటున్నారు." ఇలాగ అన్నప్పుడు ఆయన నీతిని గురించి కలవరం పడ్డారా ? ఆయన చెప్పిన మాటల అర్థం ఏమిటంటే— తామూ, తమ కంపెనీలూ మంచి లాభాలు చేసుకుంటున్నాయి. అంతేచాలు. స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, వ్యక్తి స్వాతంత్ర్యాలూ ఏమయిపోతే ఎవరికి కావాలి ? వ్యాపారుల లాభాలకి అడ్డు రానంతసేపూ ఈ మాటలు బాగానే ఉంటాయి. అదే విధంగా రాజకీయ వాదుల లాభాలకి ప్రజాస్వామ్యం అడ్డురాకూడదు. పెద్ద బేరాల దేశంలో లాభాలే ముఖ్యమయినవి. ఏది అమ్ముతారో, ఏది కొంటారో ముఖ్యం కాదు. ఎలాగ కొంటారో, ఎలాగ అమ్ముతారో అసలే ముఖ్యం కాదు. అన్నిటికన్నా ముఖ్యం "మన బేరం". దాన్ని ఎలాగయినా కుదుర్చుకోవాలి. అత్యవసర పరిస్థితిలో తాతాల బేరాలు చాలా "పెండింగ్"గా ఉండేవి.

మనదేశాన్ని నడిపే వాళ్ళు బేరగాళ్లు. అధికారంలో ఉన్నపార్టీ బేరగాళ్ల పార్టీ. వీళ్లకి తమ కాలం అయిపోతోందని తెలుసు. అందుకనే ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా బేరాలు ముగించుకోవటానికి ప్రయత్నిస్తారు. ఆదిక్ విమానం ఎక్కగానే "ఏది నా సీసా" అని అడిగారు. అది ఉచితంగా లభించే సీసా.

భారతదేశంలో కాంగ్రెసు వాళ్లు "సీసా స్వాతంత్ర్యం" జోలికి రాలేదు — కాని ఆదిక్ ఉదంతం తరువాత ఆ స్వాతంత్ర్యానికీ ముప్పు వచ్చేసింది. ★

# వ్యక్తిగతం



మహారాష్ట్ర ఉప ముఖ్యమంత్రి పదవి ఊడినా తాగుడు అలవాటు తప్పిపోయిందా? పశ్చిమజర్మనీ వెళ్లి వచ్చి ప్రసిద్ధులయిన శ్రీ రావ్ రావ్ ఆదిక్...



కమొడోర్ నాన్సీ హోపర్ ఆధునిక గణన యంత్రాలు (కంప్యూటర్‌లు) వాడే భాషని కనిపెట్టిన ఆధునికులలో మొదటివారు. ఈమె అమెరికా నౌకాదళం (నేవీ)లో ఆఫీసరు (కమొడోర్). ఇటీవలే అధ్యక్షుడు రీగన్ ఈమెకి సన్మానం చేశారు...



కాడెట్ కోల్‌బర్ట్ మాజీ హాలీవుడ్ సినిమా నటి సుమారు 50 ఏళ్ల కింద క్లియోపాత్రాగా వేసింది. ఇప్పుడు 78 ఏళ్ల వయసులో నాటకాలలో వేస్తోంది. ఈ బొమ్మ 78 ఏళ్లప్పుడు తీసిందే...



స్వామి సదాచారికి బొంబాయిలోని ప్రముఖ వ్యక్తులలో చాలమంది శిష్యులుగా ఉన్నారు. ఆయన నివాసంలో విడియో చిత్రాల ప్రదర్శన కూడా ఉన్నది. అంతేకాక ఆయన తామే స్వంతంగా ఒక చిత్రాన్ని నిర్మించబోతున్నట్లు చెప్పారుట. అందులో స్వామీజీ నాయక పాత్రని, తదితర పాత్రలని అమితాబ్, శత్రుఘ్నసిన్హా, రాజ్ బబ్బర్, స్మితాపాటిల్, హేమమాలిని, ధర్మేంద్రలు పోషిస్తారని కూడా ఆయన అన్నారట...

# వారఫలం

**18-5-1984 శుక్రవారం మొదలు — 24-5-1984 గురువారం వరకు**

♈ మేషం: మీది భారీ వ్యాపారమయితే, బాగా శ్రమించాలి. వారం ధనార్జనకు అనుకూలమే. పత్రికారంగాన గాని, రచనా విధానగాని మేలు జరిగి తీరుతుంది. స్త్రీలకు: శుభాశుభ మిశ్రమ ఫలదాయక వారం

♉ వృషభం: నూతనాంశాలు గ్రహిస్తారు. నూతన మిత్రుల సంబంధ సహకార సాహాయ్యములు లభ్యం కాగలవు. అధికారుల ఆదరణకు, ఆప్యాయతకు అవకాశం గలవారం. ఏవో విలువగల వస్తువులు సేకరించుటకు అవకాశమున్నది. స్త్రీలకు: వస్తు సేకరణకు, వృత్తిలో పెంపునకు అవకాశంగలవారం.

♊ మిథునం: ఒక్క ఆరోగ్య విధాన తప్ప తక్కిన అన్ని రంగాలలో మీకు అభివృద్ధి చెప్పవచ్చు. శుభకార్యానుకూలతకు లోపం లేదు. శ్రమిస్తే సర్వానుకూలత చేకూర నున్నది. స్త్రీలకు: ఉద్యోగమందు, ఆశించినవిధంగా 'ప్రమోషన్' లభించుటకు ఆక్షేపణలేదు. గ్రహానుకూలత గల వారమే. గ్రహించాలి.

♋ కర్కాటకం: స్థిరాస్తి పెంచుకొను ప్రయత్నాలున్నాయి. సాధ్యం కాని ఒకానొక విషయం మీకు అనుకూలంగా పరిణమించగలదు. వివాహ యోగ్యతకు వచ్చిన స్త్రీ పురుషాదులకు శుభం జరుగవచ్చు, యత్నించిన గృహ కార్యమందు అనుకూలత చేకూరుతుంది. స్త్రీలకు: నగల సేకరణకు, వస్త్ర సేకరణకు అనుకూలం.

♌ సింహం: అయిన వారితో గాని, మిత్ర వర్గంతో గాని మాట మాట పట్టింపులు రావచ్చు. సకాలానికి అందగలదన్న ధన విషయంలో కూడా జాప్యం జరుగవచ్చు. నిరాశతో వారమంతా జరిగిపోతుందేమో గమనించండి. రాజకీయంగా చాలమందికి అనుకూలత గలదు, ఉద్యోగ యత్నాలు సత్ఫలదాయకం. స్త్రీలకు: వారమంతా హడావుడి కార్యక్రమమే.

♍ కన్య: లాభించని, గౌరవరహితమైన పనులందు తలదూర్చటం ఏమంత క్షేమకరమైన కార్యం గాదు. బంధువులకు ఏదో విధంగా సహాయం చేయవలసిన అవసరమున్నది. గృహ విస్తరణ ప్రయత్నాలు ఒక మోస్తరుగా జరిగిపోతవి. స్త్రీలకు: వృత్తి ఉద్యోగాలందు పెంపు, గృహ కార్యభారం చెప్పదగిన ముఖ్యాంశాలు గ్రహించాలి.

♎ తుల: అనుకోని అనూహ్యమైన సంఘటనలు జరుగుతాయి. అనవసరంగా అపనిందలను భరించవలసివస్తుంది. మిత్ర వర్గంలో గాని, ప్రజాసమూహంలో గాని పేరు తెచ్చికొనే సంఘటనలు కూడా లేకపోవు. స్త్రీలకు: ధనలబ్ధికి అవకాశం.

♏ వృశ్చికం: చాలకాలంగా జరుగని వ్యవహారం ఏదయినా గృహ సంబంధమైనది ఉంటే, పరిష్కరింపబడగలదని విశ్వసించాలి. పదిమందిలో పేరు తెచ్చికోగల సంఘటన లుంటాయి. అధికంగా ఖర్చు చేయవలసిన పరిస్థితు లుంటాయి. స్త్రీలకు: దగ్గరి బంధువుల మూలంగా యిబ్బందులు రాగల అవకాశా లుంటాయి.

♐ ధనుస్సు: వృత్తిలో పెంపు కనిపించటం, ఉద్యోగ రీత్యా ఆదాయం కనిపించటం, బంధు సమూహంలో పేరు పెంపులు లభించటం చెప్పదగిన అంశాలు. అధికంగా ధనవ్యయం చేయవలసిన పరిస్థితులుంటాయి. స్త్రీలకు: నూతనాంశాలు గ్రహించటం, నూతన వస్తువులు సేకరించుకొనుటకు అవకాశాలుంటాయి.

♑ మకరం: పదిమందిలో పేరు ప్రతిష్ఠలు లభిస్తాయి. క్రయ విక్రయాదులందు అనుకూలత సాధించగలరు. ధనాభావం కనిపించదు. బంధువర్గీయులతో సంబంధ బాంధవ్యాలను గూర్చి చర్చలుంటాయి. కొందరకు విదేశ ప్రయాణాలు సంభవమయ్యే గ్రహస్థితి ఉన్నది, గ్రహించి శ్రమించండి. స్త్రీలకు: ఉద్యోగస్థులయితే పెంపు చెప్ప అనువైన వారం.

♒ కుంభం: నల్లని వస్తువులో, లోహాదుల సంబంధమైన వ్యాపారం చేసేలాగైతే లాభార్జన గలదు. స్త్రీల మూలంగా తగాదా తంటాలకు అవకాశమున్నది. ధనాదాయానికి ఆస్కారం గల వారం. శక్తికి మించిన పని నెత్తిన పెట్టుకోవలసి రావచ్చు. స్త్రీలకు: కళారంగాన ప్రసిద్ధి ఏర్పడుట నిశ్చయం

♓ మీనం: విశ్రాంతి తీసికొందామన్నా లభించదు. వృత్తియందు అధికారాదరణలభ్యం. ఈవారంలో స్తోత్రప్రియులో, మీ నుండి మేలు పొందగల వారో దగ్గరకు వస్తారు, గమనించి మెలగండి ఎందుకో ఉత్సాహం తగ్గినట్లు గ్రహించగలరు. స్త్రీలకు: ఆదాయం, బంధుప్రీతి, నూతన వస్త్ర సేకరణకు అవకాశం గల వారంగా గ్రహించి శ్రమించండి

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

## వాడాంమేం దిగుమతిచేసిన 6-12 కొసల్ని-మా టూత్ బ్రష్‌లోని ఆ కొసలు తాకిన ప్రతిసారీ మీ చిగుళ్ళకూ పళ్ళకూ యిక ఆరోగ్య చికిత్స

మాయాలు కొసలైతే, మీ చిగుళ్ళను గాయపరుస్తాయి. మీ పళ్ళ తాలూకు జీవిత కాలాన్ని తగ్గించేస్తాయి.
అందుకే మరి ఒజెట్ సూపర్ డీలక్స్ టూత్ బ్రష్‌ను తయారు చేసేందుకోసం కేవలం దిగుమతిచేసిన 6-12 కొసలనే వాడతాం.
అంటే, ప్రపంచమంతటా సున్నితమైన, నాణ్యతగల టూత్ బ్రష్‌లను తయారుచేసే వారు వాడే వాటినే వాడతాం మరి.

ఒజెట్ టూత్ బ్రష్ కొసలు తాకిన ప్రతిసారీ అవి మీ చిగుళ్ళను మర్దనచేసి, వాటిని ఆరోగ్యవంతంగా, దృఢంగా తీర్చిదిద్దుతాయి.
ఆరోగ్యవంతమైన చిగుళ్ళంటే, దృఢమైన గట్టిపళ్ళన్నమాట.
ఒజెట్ కేవలం టూత్ బ్రష్ మాత్రమేకాదు-అది మీ చిగుళ్ళూ, పళ్ళూ-వీటి ఆరోగ్య చికిత్స.

ఇది **వోల్టాస్** ఉత్పాదన.



ముట్టుకు చూడండిక. ఆ అనుభవం పొందండిక. నొక్కి చూడండిక. అలా వొదిలెయ్యండిక. చూడండిక. ఆ టూత్ బ్రష్ కొసలు యిక నెలల తరబడి ఎలా పనిచేస్తాయో ముచ్చటగా.

## ఒజెట్ సూపర్ డీలక్స్ పళ్ళకీ, చిగుళ్ళకీ పూర్తిగా పనికొచ్చే బ్రష్



# స్వప్నభంగం

సీరియల్

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

( గత సంచిక తరువాయి )

> **జరిగిన కథ—2 :** శ్రీనాథుడు సాహిత్య పిపాసి. ఆయన కవిత్వం అంటే భార్య తాయారుకు మొదట్లో సరదాగానే ఉండేది. కాని క్రమంగా విసుగు బయలుదేరింది. శ్రీనాథుడు, తాయారు కాలిబాటన తిరుపతి కొండ ఎక్కను ప్రారంభించారు. దారిలో అక్క వైదేహీ బావ లక్ష్మణమూర్తి కారులో కొండపైకి పోతూ వీరిని కలుస్తారు.

**చీ**కట్లు నలుమూలలా ముసిరాయి.

దూరాన తిరుమల దీపాలు మిణుకు మిణుకుమని కన్పిస్తున్నాయి.

"మంగా !"

"ఆఁ !"

"కొంచెం వేగంగా అడుగులు వేయాలి."

"నడవలేకపోతున్నానండీ."

"నిజమే ! కాని చీకటి పడింది చూడు — అంటే ఇప్పటికే సుమారు మూడున్నర గంటకు పైగా నడిచాము."

"..................."

"మంగా"

"ఏమిటి ?"

"స్వామివారి చుట్టూ దీపాలెన్ని వున్నా చుక్కల్లాంటి మిణుగురుల్లాంటి ఈ క్షణికమైన విద్యుత్కాంతితో ఆయన సంతృప్తి పడడు. భక్తపరాధీనుడైన శ్రీనివాసుడు మంగతాయారు రాకకోసం ఎదురు చూస్తుంటాడు — చంద్రుని కోసం సముద్రంలా—"

"స్వామీ క్రొత్తచులా సాగుతున్న ఈ తారు రోడ్డుపై మీరే సాక్షాత్తు శ్రీనివాసునిలా వున్నారు— నేను కేవలం మీ ఛాయలా నడుస్తున్నాను— చూడండి— ఎందుకొచ్చిన కవిత్వమిది— నడవలేక ఒకవైపు అవస్థపడుతుంటే."

"కవిత్వమంటే ఏమిటి ? అదేదో రాజసభల్లో రసికజనులు వినోదించే సాధనమనుకున్నావేమో— కాదు. అది నిత్యజీవితంలో అనుక్షణం అనుభవించదగ్గ అమృత రసాయనం. తెలియకుండానే ప్రతివాడూ వాడే ప్రతి పర్వరసోదయమైన వచన కావ్యం. ఈ మేడ లాకాశాన్నంటాయి, ఈ పొట్లకాయ చూడు బారెడు పొడుగున వుంది — వాడమ్మకడుపు బంగారం కానూ ఏం చేశాడయ్యా, వాడా వాడొక ధర్మరాజు, ఆ పిల్లచూడు గారె ముక్కలా వుంది— నీ బుగ్గలు గిల్లి బూరెలు వండుతాను— తాయారూ ఏమిటి ఇవన్నీ — ఈ ఉక్తివైచిత్రి మొత్తం కవిత్వం కాదూ— ఇదంతా కవిత్వమని తెలిసే స్త్రీలు సంభాషణల్లో వాడుతున్నారంటావా ?"

మంగతాయారు మనస్సు అన్యాసక్తమై వుంది —

"ఏమండీ"

"ఏమిటి ?"

"వైదేహి కొంచెం లావెక్కింది సుమా !"

"ఆఁ — మీ బావగారుకూడా చిన్న కుంభకర్ణునిలా వున్నాడు."

"ఎందుకండీ ఆయనంటే మీ కంత అసూయ ?"

"అది నేననవలసిన మాట — నిరంతరం వాళ్ళు నీ మనస్సుల్లో మెదులుతూ వుండటం వల్ల అసూయతో వాళ్ళ సంభాషణకే ఉపక్రమించావు. నాకెందుకసూయ— నాకేం ఆబిడ్స్‌లో బ్రాందీషాపు వుందా ? నాకూ లక్ష్మణమూర్తికీ అనాబ్‌షాహీలో పోటీ ఏమైనా వచ్చిందా ?? ఆయనది మద్య వ్యాపారం నాది హృద్యమైన పద్యవ్యవసాయం. పద్యానికి మద్యానికి 'మొదట్లో' పోలికేలేదు, తర్వాత ఉన్నట్లు కన్పడ్డా ఉపనిషత్తుల్లో 'ద' కథలాగా ఒకటి ఆత్మానందాన్నిస్తే రెండవది పాశవికానందాన్ని చవిచూపిస్తుంది — తాయారూ — ఎవడి అర్థం వాడిది— ఎవడి అనుభూతివాడిది — వాళ్ళగూర్చి మనం 'ఆ' జన్మ శత్రువులుగానూ భావించనక్కరలేదు 'ఆ'దర్శంగానూ స్వీకరించవద్దు — 'ఆ'కార సామ్యమున్నంత మాత్రాన రెండూ ఒకటికావు— ఇర్వురం 'ఒకటి'కావడం ఎలా సాధ్యం ?"

శ్రీనాథుడు శబ్దబ్రహ్మోపాసకుడు —

కాబట్టే అతని ప్రతిమాటా వ్యంగ్య వైభవంతో శోభిల్లుతూ వుంటుంది — ప్రతి పదానికీ వెనుక మరికొన్ని అర్థాలు వాటంతట అవే భాసిస్తూ వుంటాయి.

మొదట్లో పోలికలేకపోవడం, అర్థం, ఆకారసామ్యం, అన్న చమత్కారాలు మంగకు అర్థంకాలేదుకాని ఇర్వురం ఒకటికావడం ఎలా సాధ్యం అంటే ఇటు శ్రీనాథుడూ అటు లక్ష్మణుడూ ఒకటికాదని సూచించడం బోధపడింది. అంటే దేవునికీ జీవునికీ భ్రాతృత్వమే కాని ఐక్యంలేదని శ్రీనాథుడు సిద్ధాంత ప్రతిపాదన చేస్తున్నాడనికూడా మంగ తాయారుకు స్ఫురించింది.

అయితే ఆమె మనస్సు ఈ చమత్కారాలను ఆనందించే స్థితిలోలేదు.

రాత్రి ఏడున్నర ప్రాంతాలకు తిరుమలలోకి ప్రవేశించారు.

బస్సు దిగేచోటు తను వూరి మల్లయ్య తన కొడుకు వెంకటాద్రిని కూర్చోపెట్టాడు.

వెంకటాద్రి శ్రీనాథ దంపతులను తమ వెంట మల్లయ్య దిగిన ధర్మ సత్రం దగ్గరికి తీసుకుపోయాడు.

"ఆరుగురి పేర ఈ గది తీసుకున్నాను. మీరూ ఇందు వుండవచ్చు. నేనూ మా ఆవిడా, వెంకటాద్రీ ముగ్గురమే కదా ఇందులో వున్నది" అన్నాడు మల్లయ్య.

తాయారు శ్రీనాథుణ్ణి ఇవతలికి పిలిచి అడిగింది 'ఇక్కడ సౌకర్యాలన్నీ వుండవు— మా అక్కగారి కాటేజీకి పోదాము.'

శ్రీనాథుడు నవ్వి 'మనం ఇక్కడ మొక్కుకోసం స్వామి దర్శనం కోసం వచ్చాముకాని భోగాలకోసం రాలేదు— ఇక్కడే ఉందాము' అన్నాడు.

బంధువులకు దగ్గరగా వుండటం భర్తకెందుకో ఇష్టంలేదని తాయారు భావించింది.

ఆ బంధువులు తన బంధువులు— రక్తం పంచుకొని పుట్టినవారు—అందుకనే తాయారుకు చాలా బాధ కలిగింది— రాత్రి తెల్లవార్లూ కాళ్ళ నొప్పులు తీర్చుకున్నది—

మర్నాడు ఉదయమే లేచి కాలకృత్యాలు నిర్వహించుకొని స్నానంచేసి శుచియై తాయారు ఇవతలికి వచ్చేసరకి శ్రీనాథుడు కన్పడలేదు.

ఆయన ఏ తెల్లవారు జామునో లేచి శ్రీ పర్వతం పైనుండి మేఘాలను అందుకుంటూ వున్నాడని గ్రహించింది.

మల్లయ్యా, వెంకటాద్రీ, రత్తాలు ఉదయమే ఇడ్లీలు తిన్నారు.

ఇడ్లీ, ఉప్మా, పెరుగు,పాలు అన్నీ సత్రాలకే అమ్మకానికి వస్తాయి.

తాయారు మాత్రం పచ్చి మంచినీళ్ళు పుచ్చుకోలేదు.

సూర్యుని కిరణాలు బంగారు మలామును పర్వతం మొత్తం పూస్తుండగా శ్రీనాథుడు వచ్చాడు.

"స్వామివారి దగ్గర కూడా ఉషస్సును మరచిపోలేదే."

"తాయారూ శ్రీ పర్వతం మీద ఉషస్సు నీవై భాసించింది— స్వామివారు నాలో పవ్వళించి

వున్నారట— ప్రాభాత సమీరాలు వారికి మేలు కొలుపులు పాడాయట— రా త్వరగా విశ్వదర్శనం వేళ దాటుతున్నది.''

గదికి తాళంవేసి మల్లయ్య కుటుంబమూ శ్రీనాథ దంపతులూ దేవాలయాభి ముఖంగా పయనించారు.

ఇది నిత్యోత్సవం
వారోత్సవం
మాసోత్సవం
సంవత్సరోత్సవం—
ఇక్కడ ఋతువులతో ప్రమేయం లేదు —
ముహూర్తాలతో నిమిత్తం లేదు—
నిత్యకల్యాణం పచ్చతోరణం—

వేయి తిరణాల పెట్టుగా హడావుడి — అమ్మకాలు — రంగుల రంగుల లక్కపిడతల దుకాణాల నడుమ నుండి స్వామివారి బంగారు దేవాలయపు ప్రాంగణం చెంతకు చేరారు.

'వడ్డికాసులు, బంగారు కాళ్ళు, బంగారు చేతులు, వెండికాళ్ళు, వెండిచేతులు' అమ్ముతున్నా డొక బక్క పిల్లాడు. 'పద్మావతి శ్రీనివాస కల్యాణం — స్థల పురాణం, ఐదు రూపాయల గ్రంధం — రెండు రూపాయలు మాత్రమే' ఇంకొకడు వచ్చాడు. 'రూపాయన్నరకిస్తావా ?' మల్లయ్య బేరమాడాడు. రూపాయి అరవై పైసలకు బేరం కుదిరింది.

అది కొండవీటి చేంతాడులా చాలాపొడుగున వుంది.

''రా తాయారూ వెళ్లి నిలబడదాం.''

''ఎక్కడ ఈ క్యూలో మైలుదూరంలోనా నిలబడటం.''

''మరెక్కడ నిలబడదామనుకున్నావు ? ఎన్నికల్లోనా ?'' పరిహాసం చేశాడు.

''బాబూ— ఈ గేటు దగ్గర రెండు రూపాయలు చేతిలోపెడితే పక్కకు మార్గంగుండా వదులుతాడు మనల్ని'' శ్రీనాధుడు నవ్వాడు— కాని మల్లయ్యను కించపరచదలుచుకోలేదు —

''ఏమండీ— అలా చేద్దామా ?''

''పది నిముషాల ఆలస్యం కోసం పాపం కొనుక్కుంటామా స్వామివారి ప్రాంగణంలో'' మెల్లగా అన్నాడు భార్యతో—

''ఇందులో తప్పేముంది ?''

''ఎందరు భక్తులిలా క్యూలో అర్ధరాత్రి నుండే నిలబడివున్నారో తెలుసా ? వారందరినీ మోసగించి లంచమిచ్చి స్వామి దగ్గరికపోతే ఆయన ప్రసన్నుడవుతాడనుకున్నావా తాయారూ—''

మల్లయ్యావాళ్ళూ డబ్బిచ్చి లోపలికి వెళ్లారు—

శ్రీనాధుడు భార్యతో సహా పుష్కరిణి దగ్గరకు పోయి కొంచెం తీర్ధం నెత్తిని చల్లుకొని వచ్చి క్యూలో నిలబడ్డారు— దాదాపు పదిగంట లయ్యేసరికి క్యూ కొన్ని ఫర్లాంగులు మిగిలి పోయింది—

''స్వామీ కాళ్లు నెప్పులు పుడుతున్నాయి—



కాస్త కవిత్వంతో నా బాధ పోగొట్టండి— ఎలా వున్నదీ క్యూ ? చాంతాడులా వున్నదా ? హనుమంతుడి తోకలా వున్నదా ? చెప్పండి కొంచెం.''

''కలకండ నందుకోవడం కోసం వెళ్లే చీమల బారులా వున్నది తాయారూ—''

''దీపాన్ని అందుకోబోయే హారతికర్పూరంలా లేదూ—''

''లేదు—''

''అదేమిటండీ మీ కలకండకన్నా మంచి ఉపమానం చెప్పాను నేను— తన్ను తాను హారతి చేసుకునే భక్తుని హృదయం కర్పూరంలాంటిది— అందులో ఎంత స్వచ్ఛత, పరిమళమూ వుంటుందో గమనించండి.''

''పూలవాసన నారకుకూడా పట్టినట్లే నీకు కవిత్వం అబ్బినందుకు నేను పరమానందం పొందుతున్నాను. నిజమే, కాని తాయారూ నీ ఉపమానం చాలా లోపభూయిష్ఠమైనది — భక్తుడు హారతి కర్పూరం వలె స్థాణువు కాదు జడంకాదు. చీమ వలె నిరంతర వ్యాపకత్వం కల జీవి. చీమ వలె చిన్నవాడైనా నిరంతరం సంచలనం కల కుశాగ్రబుద్ధి. లౌకికమూర్తి. ఆ చీమ వెళ్లి కలకండను తాకినప్పుడింకేముంది ? బ్రహ్మానందమే — అయితే తాయారూ అంత బ్రహ్మానందంలో కూడా చీమ తన అస్తిత్వాన్ని

కోల్పోదు. ఇక్కడ అనుభవించేదొకటి, అనుభ వింపబడేదొకటి రెండూ వుంటాయి. హారతి కర్పూరం శూన్య వాదాన్ని ప్రతిపాదిస్తున్నది. తన్ను తాను మొత్తం నశింపజేసుకున్నప్పుడు అనుభవం ఎవరికి ? దేవుడికా ? ?''

తాయారు భయపడి పోయింది. అందంగా వుంటుందని ఓ ఉదాహరణ చెపితే దానిలో ద్వైతం విశిష్టాద్వైతాలు ప్రతిపాదించాడు భర్త. దీనికంటే నిశ్శబ్దంగా కోతులనూ, బటానీ బుట్టలనూచూస్తూ గడపడమే ఆమె ప్రాణానికి హాయిగా కనిపించింది.

దూరంగా స్వామి వారి ప్రాంగణం ముందు ఓ కారు ఆగింది — అందులో నుండి వైదేహీ లక్ష్మణమూర్తిదిగారు. వారు దిగడం మంగ తాయారు చూచింది.

క్యూలో వున్న వారినీ లక్ష్మణమూర్తి చూచినట్లే వున్నాడు... చూచాడని స్పష్టంగా చెప్పలేము.

కాని చూడనట్లే ముందుకు సాగిపోయాడు.

ఛాయలా వైదేహి ఆయన్ను అనుసరించింది.

''ఏమండీ''

''ఆఁ''

''అదుగో మా అక్కా బావగార్లు వెళ్తున్నా రండీ.''

''అవును వారేదో కల్యాణం లాంటిది చేయిస్తున్నట్లున్నారు.''

''ఇంకేంమరి పదండి వెళ్దామనంకూడా. కల్యాణానికి కుటుంబం మొత్తాన్నీ రానిస్తారు కదా.''

''కావొచ్చు తాయారూ కాని ప్రపత్తి యోగంలో స్వామిని ఇలా నిరాడంబరంగా శ్రమతో శ్రద్ధతో చూడటంలోనే నాకెక్కువ ఆనందం లభిస్తుంది.''

భర్త తన అక్కా బావల ఐశ్వర్యానికి అసూయపడుతున్నాడేమోనని ఊహించింది తాయారు.

తేలికగానే ఆ భావాన్ని చదివాడా శ్రీనాధుడు అన్నట్లు ''స్వామి కల్యాణాలూ బ్రహ్మోత్సవాలూ చేయించవలసిందే — అవన్నీ మంచివే. కాని తాయారూ నేను అర్ధార్థిని కాను జిజ్ఞాసువును— ఇక్కడ నా వైభవమూ ధన ప్రదర్శనా కావు లడ్డూలు — స్వామివారి వైభవం కావాలి — దాని నొక సామాన్యునిలా భక్తి భిక్షాన్ని కోరే యాచకునిలా నిలబడి అందుకోవాలి — అదీ నా తత్వం.''

కొంతసేపైన తర్వాత కల్యాణాలవల్ల ధర్మదర్శనం నిలుపు చేయబడిందని ప్రకటించారు.

తాయారు నిలువలేకపోయింది.

''పోయి కాఫీ తాగిరా — నేనిలాగే క్యూలోనే నిలబడివుంటాను.''

మంగతాయారు కాఫీ తాగివచ్చింది.

# స్వప్న భంగం

దర్శనం నిలుపుదలతో చాలామంది క్యూనుండి వెళ్లిపోయారు. అందువల్ల శ్రీనాధుడు ఎంతో ముందుకు వచ్చాడు.

కుష్ఠురోగులూ బిచ్చగాళ్లూ పోతున్నారు గుంపుగా.

''అయ్యా ఒక్క పైసా వెయ్యండి - బాబూ ధరమ తండ్రీ — ఒక్క పైసా దానం చేయండి — ఏడుకొండలవాడా.''

ప్రజలు అసహ్యించుకొంటున్నారు.

మృత్యువును చూచినట్లు దూరంగా తొలిగిపోయారు.

సర్వాంతర్యామి అయిన ఈశ్వరుణ్ణి ముష్టి వాళ్లలో చూడలేని భక్తులు స్థాణువు కోసం పరుగెత్తుతున్నారు.

''మానవులంతా ఒకటే — మనది భారత దేశం కాదు అనంతవిశ్వం'' అని ప్రపంచ పౌరసత్వాన్ని ప్రకటించుకునే రాజకీయ భక్తుడు కుచేలుణ్ణి కురూపినీ మాత్రం మానవులుగా గుర్తించలేకపోతున్నాడు.

శ్రీనాధుని హృదయం భగ్నమన్నది.

ఆ ఇంధనం నుండి శబ్దాలు రవ్వల్లా రాలాయి.

''నరసింహమూర్తి వైనాడు నీవోసామి
శత్రు ముష్కరులమూ సైన్యధాటికి ప్రతిగ
భంభిరమ్ముల పంపి పార్రదోలితివి కద !
భక్తులను రక్షించి ప్రతిన నిలిపితివి కద !
ఏమయ్యె ఆనాటి శక్తి ?
నేడు
ఎటకేగెనయ్య నీ మహిమ ?
రాక్షస హిరణ్యకశ్యపు చంపి అలనాడు
రక్షించి ప్రహ్లాదు నాహ్లాద పరచితివి
కడుపులోనే కాదు గోడలో భూమిలో
కనకమ్ము గుప్త పరచిన హిరణ్యాసురుల
కాల్పరాదేల నీ అగ్ని, ప్రభవించి
కూల్పరావేల స్తంభమున ??''

తాళ్లపాక వంశస్థుల రక్తం తనలో పారుతున్నదో ఏమో శ్రీనాధుడు స్వామికి ఆలా విన్నపాలు చేస్తున్నాడు.

ఎండతోబాటు అతని భావ తీవ్రత కూడా పెరిగింది.

''ఈ సమానత మిధ్య
ఇట దుష్కృత—అవధ్య— ??
రసశూన్యమైన మా
నవతయే సత్యమ్ము
కరిగి పారవదేల స్వామి ఆకాశ
గంగగా కరుణా(ం)తరంగ !!''

కల్యాణోత్సవాలు ముగిశాక లడ్డూలూ, అప్పాలూ, నెయ్యి కాల్వగట్టే కారుతున్న పొంగలి బుట్టలూ, దధ్యోజనమూ, చక్కెర పొంగలి భక్తులకు అందించారు అర్చకులు — లడ్డూల బుట్టలు కారులో కెక్కించుకొని తలుపులేసుకున్నాడు లక్ష్మణమూర్తి.

వైదేహి ఇటు చూచింది —

క్యూలో శ్రీనాధుడూ మంగతాయారూ—

''అరె — మీరు రాలేదేమిటి కాటేజీకి.''

శ్రీనాధుడు నవ్వాడు.

''తెలిసినవాళ్లు గుడికి దగ్గరలో దిగారు — నడకతో, కాళ్లు వాచి కాటేజీదాకా రాలేకపోయా నక్కయ్యా.''

లక్ష్మణమూర్తి శ్రీనాధుని చూచి పలకరింపుగా తలవూగించాడు.

వైదేహి కారులోనుండి లడ్డూలు తెచ్చి ఇద్దరికీ ఇచ్చింది.

ప్రసాదం తీసుకున్నారు.

''డబ్బులిస్తాము — అమ్మా ప్రసాదం అమ్ముతారా ?'' ఎవరో వైదేహిని అడుగుతున్నారు.

సాభిప్రాయంగా భర్తవైపు చూచింది వైదేహి.

లక్ష్మణమూర్తి వారితో బేరమాడుతున్నాడు.

'సాయంత్రమన్నా రండి కాటేజీకి' వైదేహి మళ్లీ అర్థించింది.

అలాగేనని తల వూపింది తాయారు.

వైదేహి కారెక్కింది.

కారు సాగిపోయింది.

ధర్మదర్శనాలు మళ్లీ ప్రారంభమైనాయి.

''ఏడు కొండల వాడా ! వెంకటరమణా ! గోవిందా గోవిందా !''

శ్రీనివాస దివ్య అవతార గాథావివరణాత్మక చిత్రాలతో స్తగితమైన కుడ్యాంతరం నుండి సుదీర్ఘమైన క్యూ ప్రవాహంలా సాగుతున్నది—

ఈశ్వరాభిముఖంగా పయనించే భక్తిరస ప్రవాహం మధ్య వికసించిన కమలాల్లాగా కొన్ని వందలమంది శ్రీనాథులు, తాయారులు— మల్లయ్యలు—

## తమ్ముడూ !

తమ్ముడూ ! నీవు కత్తివే !
కానీ ! ఒరయై నిన్ను రక్షించు
కుంటోంది సమాజం !
నీవు పిడుగువే !
కానీ తాను మేఘమై తన గుండెల్లో
దాచుకుంటోంది సమాజం !
అది లేక నీకు మనుగడలేదు.
అందుకే సమాజాన్ని అసహ్యించుకోకు.
చేతనైతే సంస్కరించు.

— గన్ను కృష్ణమూర్తి







కొన్ని తెల్ల కమలాలు— కొన్ని ఎర్రని కలువలు— మరికొన్ని నల్ల కలువపూలు—

"ఆపద్బాంధవా— అనాధరక్షకా— గోవిందా గోవిందా."

శ్రీనాధుడు స్వామివారి దివ్యమంగళవిగ్రహ సాన్నిధ్యానికి పత్నీ సమేతుడై చేరాడు—

తన అపాంగం ద్వారా విశ్వాన్ని శించితం చేస్తున్నసర్వశక్తి సమన్వితుడై నదయామూర్తి—

కల్యాణధాముడు—

శ్రీనివాస వరదుడు—

తాయారు భక్తి ప్రవాహంలో తలమునక లైంది— శ్రీనాధుని హృదయంలో స్వామి ప్రతి బింబిస్తున్నాడు— అద్దంలో, జ్యోతిలా—

"స్వామి నాకు సమస్త ఐశ్వర్యాలనూ ప్రసాదించు— సుపుత్ర ప్రాప్తిని కలిగించు— నా భర్తను అర్ధార్థిగా మార్చు— అర్థమంటే శబ్దార్థం కాదు— ధనం స్వామీ ధనం—"

"నడవండి— నడవండి' అర్చకులు పంక్తిని తొందరపెడుతున్నారు

శ్రీనాధునికి అమృతపానంలో ఎవరో చెయ్యి అడ్డంపెట్టినట్లనిపించింది— బయటకునడిచాడు నిశ్శబ్దంగా.

* * *

మంగతాయారు తీర్థయాత్ర సఫలమైందన్నట్లు ఆమెకు నెలతప్పింది— శ్రీనాధుడు సంతోషించాడు.

"మన ఇంట్లో ఓ చిన్న శశి ఉదయించబోతున్నది" అన్నది తాయారు.

"శశి కాదు శశం — ఓ కుందేలు పిల్ల పుడుతుంది. గునగునలాడుతూ" అన్నాడు శ్రీనాధుడు.

"ఇలా రండి"

"ఏమిటి" దగ్గరగా వెళ్లాడు.

"నాదో చిన్న కోరిక —"

"ఏమిటి ??"

"నాకు పుట్టేబిడ్డడిని జంతువుల పేర్లతో పక్షుల పేర్లతో పిలవడానికి వీలు లేదు —"

"తాయారూ సృష్టిలో అవే చాలా అందమైనవి కదా !"

"అంటేమానవుడు కాదా! సింహమెన్నడన్నా 'నరదీరా !' అని పిలుచుకుంటున్నదా ! ఆడ సింహాన్ని 'నారీమధ్యా' అని సంబోధిస్తున్నదా ! క్రూరమైన అడవి జంతువులనూ నాచు తినే మృగాలనూ కోళ్లనూ కొక్కిరాయిలనూ గొప్ప వాటిని చేసి వాటితో నదులనూ పోలుస్తూ ఇదేదో ఉత్తమజాతి కవిత్వమని భ్రమింప జేస్తారా? సిగ్గులేదండీ మీ కవులకు మానవుడి నిలా కించపరచడానికి."

"తాయారూ — చర్చవద్దు కాని సృష్టిలో ఒక్కో జీవజంతువుకు ఒక్కొక్క అందం వుంది. రేఖా మాత్రమైన ఆ ఒక్కొక్క సౌందర్యాన్ని మానవుడి ఒక్కొక్క అంగానికీ ఆపాదించడం మానవుడు సర్వోన్నతమైన వాడని నిరూపించడమే కవుల తాత్పర్యం."

"ఈ శాస్త్రాలూ అలంకారాలూ నాకు తెలియవు— నా బిడ్డడిని అసలు కవిని చేయడానికే వీలు లేదు— హాయిగా ఏ డాక్టరునో ఇంజనీరునో చేయాలి — వెర్రి మొర్రి కవిత్వాలతో చెట్లూ పుట్టలూ పట్టి తిరగకుండా యదార్థ లోకంలో బ్రతుకుతాడు — దోసెళ్లతో సంపాదించుకుంటాడు."

"తాయారూ! కవి ఘనతనుగురించేందుకు నీ జన్మ చాలదు — అర్థజీవనం శబ్దాన్ని దిగమింగుతుందనే భయంతో పేదవాడుగా జీవిస్తాడు దారిద్ర్యాన్ని కోరి వరిస్తాడు. కుక్కిమంచంలో సాలెగూళ్లమధ్య పడివుండి భావసౌధాలు నిర్మించి మానవాళికి కానుకగా సమర్పిస్తాడు — నా కొడుకు కవి కాగలిగితే అది పూర్వజన్మ పుణ్యఫలమనుకుంటాను"

తయారు కోపంగా వెళ్లిపోయింది.

అంతటితో ఆ సంభాషణ ముగిసింది.

తమ ఇంట్లోకి మూడోజీవి ప్రవేశిస్తుండగానే తాయారుకు ఆర్థికమైన భయం పట్టుకున్నది.

చాలీచాలని ఈ ఆదాయంతో సంసారం ఎలా చేయడం ??

తెలుగుదేశంలో కవిత్వానికి విలువ తక్కువ. మహాకవులకు గుర్తింపు శూన్యం — బ్రతికినవాళ్లను చచ్చేవరకూ తిట్టి చచ్చిన తర్వాత సన్మానాలూ వర్ధంతులూ చేస్తారు.

ఇదేం ఇంగ్లీషు దేశం కాదు పుస్తకాలమీద బ్రతకడానికీ కోట్లు సంపాదించడానికి —

అయినా తన భర్త కవి అని నమ్మక మేమిటి ? ?

"నీ ముఖం చంద్రునిలా వుంది — నీ గొంతు కోయిలలా వుంది" అంటూ వేల సంవత్సరాల పాత చింతకాయ పచ్చడినే మళ్లీ మళ్లీ ప్రయోగిస్తూ మనుషుల ప్రాణాలు తీయడం కవిత్వమా ? నన్నయకు రాజరాజు గుర్తింపు వుంది.

శ్రీనాధుడికి రెడ్డిరాజులు శరణుజొచ్చారు.

పెద్దన్నకు రాయలవారు దాసోహమన్నారు.

వెంకన్నను రఘునాధుడు ఇందిరా మందిరానికి పట్టాభిషేకం చేశాడు.

తన భర్త అలాంటి కవా ?

అయితే ఈ ముష్టి ఖాదీ శాలువలేమిటి?

ఒక్క రచనకూ బహుమతి ఎందుకు రాలేదు ?

ఒక్కచోట వెయ్యి నూట పదహార్లిచ్చి ఎందుకు ఏనుగు నెక్కించలేదు ??

తాయారు తన భర్త కవికాదనీ కేవలం ఒక రకమైన చపల చిత్తుడనీ నిశ్చయించుకున్నది.

అందుకే బంధువుల్లో ఎవరైనా 'మీ ఆయన కవిట కదా !' అన్నా 'మీవారి కవిత్వం నేను చదివాను చాలా బాగుంది.' అన్నా సిగ్గుపడటం మొదలు పెట్టింది.

తాయారుకు ఏడవ నెల వచ్చింది.

శ్రీనాధుని ప్రకృతి పూజలో కించిత్తయినా మార్పు రాలేదు.

పుట్టింటివారు శ్రీమంతానికి తీసుకు వెళ్లారు కూతురినీ, అల్లుడినీ.

శ్రీనాధుడు భార్య ముచ్చట తీర్చడం కోసం బయలుదేరాడు.

(ఇంకా వుంది)




**బడిలో** పిల్లలు తప్పనిసరిగా ప్రార్థన చెయ్యటం గురించి 1962లో అమెరికాలో కోర్టుద్వారా నిషేధించారు. బడిలో టీచర్లు పిల్లల్ని పనిగట్టుకుని ప్రార్థన చేయించ గూడదని దాని సారాంశం. అయితే, ఎవరయినా తమంతట తాము ప్రార్థన చేసుకోవటంలో తప్పు లేదన్నారు.

అప్పట్నించి అమెరికా సంయుక్త రాష్ట్రాలన్నీ బడిలో బలవంతంగా ప్రార్థన చేయిస్తున్నట్టు కాకుండా చేయటానికి మార్గాలు వెతుకుతునే వున్నాయి తరగతి గదిలో మౌనంగా ప్రార్థన చేసుకోవచ్చని అమెరికాలో పంతొమ్మిది రాష్ట్రాలు శాసనం చేశాయి. అయితే ఈ రకం శాసనం సవాలు చేసిన చోట వీగిపోయింది. ఈ విషయం మొన్నటి వరకు సుప్రీంకోర్టుదాకా రాలేదు.

బడిలో ప్రార్థన గురించి గత సంవత్సరాలలో కోర్టులకు వెళ్ళింది. నాలుగు సంవత్సరాల క్రితం ఓ కేసులో టెన్ కమాండ్‌మెంట్సు తరగతి గదుల్లో ప్రదర్శించటానికి కోర్టు వీలు లేదనింది–లౌకిక పాలనే రాజ్యాంగం యొక్క లక్ష్యం గాబట్టి.

'మతానికి సంబంధించిన విషయాల గురించి శాసించటం గానీ, నిషేధించటం గానీ కాంగ్రెస్ చేయరాదు' అని రాజ్యాంగంలో వుంది. దీన్ని అనుసరించి5–4 మెజారిటీతో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి వారెన్ బర్జర్ ఇట్లా తీర్పు చెప్పారు :

మతాన్ని గురించి చట్టం లౌకిక విధానం అమలుపరిచేదిగా వుండాలిగానీ, మతాన్ని రుద్దడం, వృద్ధి చెయ్యటంలాంటిది చెయ్యకూడదు.'

ఈ తీర్పు వలన చర్చి సంస్థలకు ఇబ్బంది కలుగవచ్చని కొందరి అభిప్రాయం. మౌనంగా ప్రార్థన చేసికోవచ్చని అన్నారు కాబట్టి, పెద్ద ఇబ్బంది వుండదని మరికొందరి అభిప్రాయం. పైగా ఈ మౌన ప్రార్థన వలన లౌకిక విధానం అనుసరించినట్టు అవుతుంది.

ప్రజలు స్వేచ్ఛగా బతకాలంటే, మతం–ప్రభుత్వం ఈ రెండు శక్తుల్ని విడదీసి వుంచాలని అమెరికన్ రిపబ్లికన్ రాజ్యాంగనేతలు అభిప్రాయ పడ్డారు. వీటి మధ్యవున్న సంబంధాల గురించి అప్పుడప్పుడు వాదనలు జరుగుతూనే వున్నాయి. అయితే ఈ మధ్య ఈ సుప్రీంకోర్టు తీర్పు వలన గత రెండు దశాబ్దాల కాలంలో రానటువంటి సంచలనం వచ్చింది.

అమెరికా అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్ బడిలో ప్రార్థన జరిగేటట్టుగా రాజ్యాంగసవరణ చెయ్యాలన్న ఆలోచనలో వున్నారట. ఒహాయో రిపబ్లికన్ వాది డెల్బర్టు లట్టా కోర్టు తీర్పు 'ఆస్తికత్వాన్ని ప్రోత్సహిస్తున్నదని' ఆవేదన వ్యక్తపరిచారట.

ఈ రాజ్యాంగసవరణ ప్రయత్నాలు రోనాల్డు రీగన్ పర్యవేక్షణలో జరుగుతున్నది. ఆయన కొలంబస్‌లో నేషనల్ అసోసియేషన్ ఎవాంజిలికల్స్ సభలో మాట్లాడుతూ 'మనకి ఈ భూమి నిచ్చి మనల్ని చల్లగా చూస్తున్న ఆ దేవుణ్ణి అమెరికన్ పాఠశాలల్లో విస్మరించటం తగదు' అన్నారట.

ఆస్తికులు పెద్ద ఎత్తున ఆందోళన జరపటానికి నిర్ణయించారు. వీలయితే రాజ్యాంగ సవరణ చెయ్యాలని కూడా పట్టు పడుతున్నారు. మార్చి నెలలో ఓ కొత్త 'ప్రార్థన' కావాలనే వాళ్ళంతా రాజ్యాంగ సవరణ చెయ్యాలని ప్రజా ప్రతినిధుల భవనం ఎదుట పెద్దగా ఆందోళన చేసారు. ఆ భవనంలోపల రాజ్యాంగ సవరణ జరగలేదుగానీ, 59 ప్రతినిధులు -- ఎక్కువగా రిపబ్లికన్ పార్టీ వారు — రాజ్యాంగ సవరణ చెయ్యాల్సిన అవసరం గురించి చెప్పారు. బడిలో ప్రార్థన తీసివేయటం శుభసూచకం కాదని




ఎక్కువమంది చెప్పారు. 'కొన్ని కోర్టుల తీర్పు వలన బడిలో ప్రార్థన చెయ్యటం కొన్నిచోట్ల గత ఇరవై సంవత్సరాలుగా అమలుచెయ్యటంలేదు. అసలు అప్పట్నించే ఆత్మహత్య చేసుకునే పిల్లల సంఖ్య పెరగటం మొదలయింది' అని వర్జీనియా రిపబ్లికన్ ప్రతినిధి ఫ్రాంక్‌వుల్ఫ్ చెప్పారు.

డెమోక్రటిక్ పార్టీవారు సభలో మాట్లాడకుండా కూర్చున్నారు – వ్యవహారం ఎట్లా ముగుస్తుందో చూద్దామని. 'దేవుడు అటు రిపబ్లికనూ కాదు, ఇటు డెమోక్రాటు కాదు. ప్రార్థన విషయంలో మీరు వ్యతిరేకం అంటే, కాదు మీరే వ్యతిరేకం అనుకోవటం రెండు పార్టీల వారికి మంచిదికాదు' టెక్సాస్ ప్రతినిధి అయిన జేవ్స్రిట్ అన్నారు.

అమెరికన్ కాంగ్రెస్‌లో రిపబ్లికన్ వారిదే పై చేయి. రాజ్యాంగ సవరణ జరగాలంటే, సభలో మూడింట రెండువంతుల మెజారిటీ వుండాలి. 'ఇట్లా రాజ్యాంగ సవరణ చెయ్యటం వలన కొంతమంది నాస్తిక పిల్లలు ఇబ్బందికి గురి కాగలరు' అన్నారు హూవార్డు బేకర్, మరో ప్రతినిధి. అందుకని ఆయన రాజ్యాంగ సవరణ పాఠం ఇట్లా వుండాలని సూచించారు.

'ఒంటరిగా గానీ, గుంపుగా గానీ, మనసులో గానీ, పైకి గానీ, ప్రభుత్వ పాఠశాలల్లో గానీ, ఇతర చోట్లగానీ ప్రార్థన చెయ్యటం నిషేధం లేదు. అమెరికన్ ప్రభుత్వంగానీ, దాని రాష్ట్రాలు గానీ ఎవరనీ ప్రార్థనలో పాల్గొనమని అడగటానికి వీలులేదు. అట్లాగే ప్రార్థన ఇట్లా వుండాలని నిర్దేశించటానికి కూడా వీల్లేదు'

మూడింట రెండు వంతుల మెజారిటీ రావటానికి ఆరుఓట్లు తక్కువ వచ్చేటట్టుగా వున్నాయని హోవార్డు బేకర్ అంచనా వేసారు. మిగతా వారిని ఒప్పించటానికి కొన్ని వారాలు పట్టవచ్చునని భావిస్తున్నారు.

ప్రార్థన చెయ్యని వాళ్ళని కొన్నిచోట్ల ఇబ్బందులకు, అవమానాలకి గురిచేసిన సంఘటనలు కూడా గతంలో జరిగాయి. అట్లాంటివి జరగకుండా వుండాలని పలువురి అభిప్రాయం. బడిలో ప్రార్థన వుండాలని గత సెప్టెంబర్ లెక్కల ప్రకారం 81 శాతం జనం కోరారు.

అమెరికా అధ్యక్షుడు రోనాల్డు రీగన్ బడిలో ప్రార్థన వుండాలని అంటారు. ఆయన రాబోయే ఎన్నికలను దృష్టిలో వుంచుకుని కూడా చెపుతూ వుండొచ్చునని కొంతమంది అభిప్రాయం.

చివరకు ఏమవుతుందో చూడాలి.

['టైమ్' ఆధారంగా]

— బాబు ★



జగపతి
ఆర్ట్ పిక్చర్స్

# ఎస్.పి. భయంకర్

నిర్మాత-దర్శకుడు వి.బి.రాజేంద్రప్రసాద్

మాటలు-పాటలు: ఆచార్య ఆత్రేయ సంగీతం: కె.వి.మహదేవన్ కెమెరా: నవకాంత్

అన్నపూర్ణ



# హరిశ్చంద్రుడు

హరిశ్చంద్రుడి వయస్సు పాతిక పంవత్సరాలు.

ఐదడుగుల ఎనిమిది అంగుళాలు ఎత్తు.

ముప్పైనాలుగు, ముప్పైఆరు అంగుళాల ఛాతీ.

పదవక్లాసు మంచి మార్కులతో పాస య్యాడు.

నల్లగా నిగనిగలాడుతూ బలంగా వుంటాడు.

ఇంకా పెళ్ళి కాలేదు!

అలా అని, ఇప్పుడతనేం ఇంటర్వ్యూకి వెళ్లడంలేదు. రెండేళ్లక్రితం హరిశ్చంద్రుడు పోలీస్ కానిస్టేబుల్ ఇంటర్వ్యూకి వెళ్లడం సెలెక్ట్ కావడం జరిగింది.

ఇప్పుడతను డ్యూటీలో వున్నాడు.

ఎక్కడోతెలుసా ? –

చీమలుదూరని చిట్టడివిలో, కాకులుదూరని కారడివిలో కాకపోయినా, అలా అనిపించేటువంటి ప్రాంతంలో డ్యూటీలో వున్నాడు.

* * *

ఎండ తీక్షణంగా వుంది.

ఎండ తీక్షణంగా వుండక చల్లగా వుంటుందా ?

వుంటుంది ! ఎప్పుడు–

ఇద్దరు ప్రేమికులు కలుసుకున్నప్పుడు.

సినిమాల్లో డ్యూయేట్ పాడుతున్నప్పుడు.

ఎండ– వెన్నెల్లా చల్లగా వుంటుంది.

కానీ, ఇక్కడ ఎండ చురుగ్గా వుంది !

రోడ్డు కేసిన తారు కరిగిపోతోంది.

వెచ్చటిగాలి–కాలుతున్న పెనంమీద చేతులు వేసినట్టుగా వుంది.

కనుచూపుమేరలో ఎక్కడా నరసంచారం లేదు.

అలాఅని, జంతు సంచారమూ లేదు! ఎండమావులు మాత్రం మిల మిలా మెరుస్తున్నాయి. రోడ్డు ప్రక్కన పెద్ద పెద్ద వృక్షాలు మాత్రం దర్పంగా నాట్యం చేస్తున్నాయి. ఏ గంటకో ఒక్కోబస్సు రయ్‌మంటూ దూసుకెడుతోంది.

అదిగో అటువంటి ప్రాంతంలో హరిశ్చంద్రుడు ఇప్పుడు డ్యూటీలో వున్నాడు.

హరిశ్చంద్రుడు ఎండకు నించోలేక ఓ చెట్టు నీడకొచ్చి కూర్చున్నాడు. ఆ చెట్టుకు చుట్టూ అరుగు కట్టివుంది. ఆ అరుగు కూడా వెచ్చగానే వుంది. ఐనా, అతను కూర్చున్నాడు.

ఆ చెట్టు దగ్గర నుంచి సుమారుగా రెండు మైళ్ళ దూరంలో ఓ పల్లె వుంది. ఆ పల్లె నానుకుని మరో బుల్లి పల్లె వుంది. ఆ పల్లెల నుంచి రోజుకు ఇద్దరో ముగ్గురో చెట్టు దగ్గర కొచ్చి, బస్సు కోసం చూస్తూ వుంటారు. ఎప్పటికో వచ్చిన బస్సెక్కి పట్నం వెళ్ళి వొస్తూ వుంటారు.

హరిశ్చంద్రుడుకి ఆకలిగా వుంది. తెల్లవారు జామున లేచి డ్యూటీకి రాబోతూ రెండిడ్లీ, ఒక దోశా, కాఫీ తీసుకున్నాడు. అంతే. మళ్ళీ టీ కూడా లేదు !

పోలీస్‌వ్యాన్‌లో తీసుకొచ్చి–ఇక్కడ దింపి– "చూడు హరిశ్చంద్రుడూ! ఇక్కడ నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి. చుట్టూ అడవి ప్రదేశం. ఏ సమయంలో, ఎక్కడ నుంచైనా సంఘ విద్రోహులు రావొచ్చు. అందుకనీ, హోం మినిస్టర్‌గారు అన్ని జాగ్రత్తలూ తీసుకో మన్నారు. మినిస్టర్‌గారు ఏ టైమ్‌లో ఇటుగా వెడతారో మనకు టైం సరిగ్గా తెలియదు. అంచేత, నువ్వు ప్రతిక్షణం చాలా చాలా జాగ్రత్తగా వుండాలి. తెలిసిందా?" అంటూ సబ్‌ఇన్‌స్పెక్టర్ హెచ్చరించాడు.

కూర్చున్న హరిచంద్రుడు లేచి చుట్టూ చూశాడు. అతనికి దూరంగా ఏదో చిన్నకారు రావడం కన్పించింది! గబగబా రోడ్డు మీదకొచ్చి వినయంగా నుంచున్నాడు.

ఆ కారు, అతన్నేం పట్టించుకోకుండా స్పీడుగా వెళ్లిపోయింది. హరిశ్చంద్రుడు నిరుత్సాహంగా వొచ్చి మళ్ళా చెట్టు క్రింద కూర్చున్నాడు.

ఆకలితోపాటు దాహంగా కూడా వుంది. మంచినీళ్ళు కూడా లేవు !

సబ్‌ఇన్‌స్పెక్టర్ వెళ్ళేటప్పుడు – "నీకు ఒంటిగంటకల్లా బస్సులో భోజనం పంపిస్తాం" అన్నాడు.

ఇంతవరకూ భోజనం రాలేదు !

హరిశ్చంద్రుడు టైం చూసుకున్నాడు. ఒంటిగంట దాటింది. ఇంకా ఏ బస్సూ రాలేదు.

ఎక్కడికైనా వెళ్ళి మంచినీళ్ళు తాగుదామనుకున్నాడు. ఒకవేళ, మంచినీళ్ళు తాగడానికి వెళ్ళిన సమయంలో మంత్రిగారి కారు వెడితే ?

ఆ ఊహకే అతను విపరీతంగా భయపడిపోయాడు.

ఇంతలో, ఏదో బస్సు రావడం అతనికి కనిపించింది. లేచివెళ్ళి బస్సు ఆపాడు. ఆపి, కండక్టర్‌ని భోజనం విషయం అడిగాడు.

"ఎవరూ ఇవ్వలేదని" చెప్పి కండక్టర్ విజిలూదాడు.

బస్సు వెళ్ళిపోయింది.

హరిశ్చంద్రుడికి ఎక్కడలేని నీరసం వొచ్చింది. కళ్ళు తిరుగుతున్నాయి. ఓపిక లేకపోవడంతో తడబడుతూ వొచ్చి చెట్టుకు ఆనుకుని కళ్ళు మూసుకున్నాడు.

ఆ ఎండలో సుడిగాలి తిరుగుతూ హరిశ్చంద్రుడు వొంటిమీద దుమ్ము పడింది. గాలి వేడిగా వీస్తూ చెంపల్ని చెళ్ళుమనిపిస్తోంది. కళ్ళు మండుతున్నాయి.

ఏదైనా బస్సు వస్తుందేమో. తనకింత ఆహారం తీసుకొస్తుందేమోనని కొండంత ఆశతో ఎదురు చూడసాగాడు.

బస్సు జాడే లేదు !

బస్సు జాడ లేకపోగా తనమీద తనకే అసహ్యం వేసింది. "ఛీ! ఛీ! ఎందుకీ బ్రతుకు?" అని తిట్టుకున్నాడు.

ఆ సమయంలో ఏదో బస్సు రావడం కనిపించింది.

"అదిగో బస్సు వస్తోంది. అమ్మయ్య" అనుకుంటూ తొందర తొందరగా రోడ్డుమీద కెళ్ళాడు.

కానీ, ఏం ప్రయోజనం ?

ఆ బస్సు ఆగలేదు !

హరిశ్చంద్రుడికి ఏం చెయ్యాలో తోచలేదు.

టైమ్ చూసుకున్నాడు. రెండు గంటలు దాటింది.

ఎండ తన ప్రతాపాన్ని మరింత చూపిస్తోంది.

ఆకలి దహించివేస్తోంది. కడుపులో ప్రేవులు మాడిపోతున్నాయి.

షోసొచ్చి పడిపోయేట్టువున్నాడు. చెమటతో వళ్ళంతా తడిసిపోయింది. పైగా, ఈ వేసవి కాలంలో వూపిరి సలపని కాకీబట్టలు !

ఇంతలో ఏదో జీపు వచ్చి హరిశ్చంద్రుడి ప్రక్కనాగింది.

ఆ జీపును చూడ్డంతోనే హరిశ్చంద్రుడు ఆకలిసంగతి మరచిపోయి వినయంగా నమస్కారం చేశాడు.

"ఏంవోయ్. జాగ్రత్త. ఇంకో గంటలో మంత్రిగారొస్తున్నారు." ఇన్‌స్పెక్టర్‌గారి కంఠం.

"చిత్తం అయ్యా !"

"మంత్రిగారొచ్చే సమయానికి ఏ బస్సునూ రానియ్యకు."

"అలాగేనయ్యా !"

జీపు స్టార్టయింది.

తనకింకా భోజనం రాలేదని, హరిశ్చంద్రుడు చెబుదామనుకున్నాడు.

చెబుదామనుకునేంతలో జీపు వెళ్ళిపోయింది!

ఇప్పుడు తనేం చెయ్యాలి ?

ఎవరైనా కనిపిస్తారేమోనని అటూ ఇటూ చూశాడు.

ఆ ఎండలో ఎవరు మాత్రం ఎందుకొస్తారక్కడికి ?

గొంతు ఎండిపోతోంది.

ఉమ్మితో నాలుక తడిచేసుకున్నాడు.

కడుపులో మంటలు పుడుతున్నాయి.

హరిశ్చంద్రుడు నెమ్మదిగా వచ్చి చెట్టు నీడలో కూర్చున్నాడు.

రెండు క్షణాలు కళ్ళు మూసుకున్నాడు.

కళ్ళు విపరీతంగా మండుతున్నాయి.

"ఒక్కపూట ఆకలికి తాళలేని ఓ మనిషీ! ఎందుకు నీకీ బ్రతుకు ?" అని కసితీరా తిట్టుకున్నాడు.

అంతకు ముందు వారం రోజులనుంచీ తన వంట్లో బావుండలేదు. ఆ వారంరోజులూ భోజనమే లేదు. నూట నాలుగూ,. నూటరెండు డిగ్రీల జ్వరంలో మంచంమీదనే వుండిపోయాడు.

ఎనిమిదోరోజు డ్యూటీలో జాయినయ్యాడు.

ఇదిగో, తొమ్మిదోరోజు ఇలా ఇక్కడ డ్యూటీ వేశారు !

హరిశ్చంద్రుడు టోపీతీసి, జేబురుమాలతో చెమట పట్టిన తల తుడుచుకున్నాడు. దాంతోనే ముఖం కూడా తుడుచుకున్నాడు.

ఒక్కో టోపీ పెట్టుకుని, సిగరెట్టు తాగుదామనుకుంటూ వుండగా ఏదో కారు హారన్ వినిపించింది.

హరిశ్చంద్రుడు దిగ్గునలేచి, పరిగెత్తినంత పనిచేసి రోడ్డుమీద నిలబడ్డాడు.

కారు వస్తోంది. ఆ కారు ఎండలో మెరిసిపోతోంది. రాచకన్య వుద్యానవనంలోకి పూల పల్లకీ ఎక్కివస్తున్నట్టుగా వస్తోంది ఆ కారు !

హరిశ్చంద్రుడు స్టడీగా నిలుచున్నాడు. కుడిచేతిని సెల్యూట్ పొజిషన్‌లోపెట్టి మరీ నిలుచున్నాడు.

ఆ కారు వచ్చేసింది.

ఆ కారులో వున్న పదహారేళ్ల పిల్ల హరిశ్చంద్రుడ్ని ఆ స్థితిలో చూడగానే జాలేసి కిసుక్కుననవ్వి, వెక్కిరించింది. అంతే. ఆ కారు వెళ్లిపోయింది !

ఆ చిన్నది చేసిన అల్లరికి, వెక్కిరించిన తీరుకి మరో సందర్భంలో ఐతే హరిశ్చంద్రుడు నవ్వేవాడే. కానీ, ఇప్పుడతనికి నవ్వురావడంలేదు.

ప్రొద్దుట నుంచీ ఎండలో మాడిపోతున్నాడు.

భోజనంలేదు, మంచినీళ్లు లేవు !

ఐనా, అతనికి ఆనందంగానే వుంది.

ఈ పోలీసు వుద్యోగమంటే అతనికెందుకో మహాఇష్టం. ఇందులో వుండి అన్యాయాలనూ, దోపిడీలనూ సులభంగా అరికట్టవచ్చు. అలాగే సులభంగా డబ్బూ సంపాదించవచ్చు !

ఐతే, తను డబ్బు సంపాదనకోసం ఈ పోలీసు వుద్యోగంలో చేరలేదు, ఒక లక్ష్యంకోసం, ఈ సమాజానికి ఇంత మంచి చేశామనే తృప్తికోసం తనీ వుద్యోగంలో చేరాడు. మరెందుచేతనో పోలీసులంటే ఈ ప్రజలకు చాలా చులకన. చులకనగా చూసే ఈ ప్రజలే ఏ సందర్భంలోనైనా పోలీసు స్టేషన్ ఆవరణలో అడుగు పెడితే చాలు విపరీతంగా భయపడిపోతారు !

బయట చిన్నచూపు

ఆవరణలో భయం !

చాలాబావుంది.

ఈ ఆలోచన రాగానే అతనికి నవ్వుకోవాలనిపించింది.

నవ్వుకోబోయాడు. నవ్వలేకపోయాడు.

ఛాతీలో నొప్పిగా, డొక్కలో మరీ నొప్పిగా, విపరీతమైన తలపోటుగా, కళ్లు బైర్లుకమ్ముతుండగా హరిశ్చంద్రుడు ఆ ఎండలో ఇక నిలుచోలేకపోయాడు.

ఐదడుగుల ఎనిమిది అంగుళాల ఎత్తుగల హరిశ్చంద్రుడు, ముప్పైనాలుగు, ముప్పైఆరు అంగుళాల ఛాతీగల హరిశ్చంద్రుడు, నిగనిగలాడుతూ బలంగా వుండే హరిశ్చంద్రుడు ఏ

## ఆందోళనకు చికిత్స !

మానసిక ఆందోళనలతోను, అనవసర భయాలతోను అసాధారణంగా ప్రవర్తించే విద్యార్థులను సక్రమ మార్గంలోకి తీసుకొని రావడానికి పశ్చిమ జర్మనీ మనస్తత్వ శాస్త్రవేత్తలు ఒక నూతన ప్రక్రియను రూపొందించారు. సాధారణంగా భయాందోళనవలన నరాల ఒత్తిడి అత్యధికంగా ఉంటుంది. నరాల ఒత్తిడిని సడలించడం ఈ ప్రక్రియలోని ముఖ్యాంశం. దీని కోసరి ఈ విద్యార్థులకి మల్ల యుద్ధంలో తర్ఫీదు ఇస్తున్నారు. దీనివలన వారిలో అధిక ఆవేశం తగ్గి వారి మానసిక స్థితి యధాస్థితికి చేరుకుంటుంది. ఎక్కువ కాలం శలవుల్లో గడిపిన తరువాత విద్యార్థులలో ఇటువంటి ఆందోళనలను గుర్తిస్తున్నారు. ఒకసారి ఈ విద్యార్థి తన ప్రవర్తనను మార్చుకుంటే సంపూర్ణ మానవుడిగా రూపొందగలడని అన్నారు.

# బుద్ధం శరణం గచ్ఛామి

— లతిక



కాంఢీ (శ్రీలంక)లోని బుద్ధదేవాలయం
(ఫొటో : తక్కోలు లక్ష్మి)

సూర్యోదయము మున్నె
కాంతి విరిసిన యట్లు
నీవు పుట్టకముందె
కరుణ విరబూసింది !

భోగాలలో పుట్టి
దుఃఖమూలము తరచి
సర్వజనులకు నీవు
నివృత్తి చూపితివి.

చతురార్య సత్యాలు,
అష్టాంగ మార్గమును
వీరు వారని లేక
ఎల్లరకు తెలిపితివి.

సర్వమానవ ప్రేమ
ఎల్ల జగతికి చాటి
ఘోర పాపుల కూడ
పునరుద్ధరించితివి !

నీ బోధలను మరచి
జగతి విలపిస్తోంది
సమర శీల జగత్తు
శాంతి కోల్పోయింది !

మరల నీవే పుట్టి
మమ్ము రక్షించాలి
పరివర్తనము తెలిపి
పరితాప మార్పాలి !

ప్రతిరోజు కావాలి
వైశాఖ పూర్ణిమలు !
ధర్మ శరణాగతుడు
కావాలి ప్రతి మనిషి

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

# హరిశ్చంద్రుడు

ఆ రోజు హరిశ్చంద్రుడు చాలా ఆనందంగా వున్నాడు. నిద్ర లేవడంతోనే అన్ని పనులూ చకచకా ముగించుకున్నాడు. కొత్తగా కుట్టించుకున్న 'కాకీ' బట్టలు తొడుక్కున్నాడు.

ఇవేళ అతని పుట్టిన రోజు

పుట్టిన రోజుల్ని చాలామంది చాలారకాలుగా చేసుకుంటారు.

అతని వృత్తే అతని జీవితం.

అందుకనే అతను 'కాకీ' బట్టలు కుట్టించుకుని ముచ్చట పడ్డాడు. టైమ్ చూసుకున్నాడు. ఎనిమిది గంటలు దాటింది. 'ఇంక డ్యూటీకి వెళ్ళాలి. టైమవుతోంది'అనుకున్నాడు.

అనుకున్నదేతడవుగా హరిశ్చంద్రుడు బయట కొచ్చిగదికి తాళం వెయ్యబోయాడు. ఇంతలో పోస్ట్‌మాన్ వొచ్చి, అతని చేతికో రిజిష్టర్ కవరిచ్చి సంతకం చేయించుకుని వెళ్ళిపోయాడు.

హరిశ్చంద్రుడు మళ్ళీ గది తాళం తీసి లోపలికొచ్చి ఆ కవరు చించి చదివాడు —

'ఫలానా రోజు, ఫలానా ప్రాంతంలో మంత్రిగారొస్తున్న సమయంలో విధి నిర్వహణలో నువ్వు అజాగ్రత్తగా వుండి, చెట్టుక్రింద నిద్రపోతున్నందుకుగాను నిన్ను సస్పెండ్ చేస్తున్నాం.'

ఆది చదవడంతోనే హరిశ్చంద్రుడు హతాశుడైపోయాడు. క్షణకాలం భయంతో కంపించిపోయాడు.

తన తప్పిదం ఏంలేదనీ, భోజనం లేకపోవడం వల్ల, ఆ ఎండలో నిలువలేక సోషొచ్చి పడిపోయానని... ఎవరికి చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియక ఆలోచనలో వుండిపోయాడు !

అప్రయత్నంగా హరిశ్చంద్రుడు కళ్ళల్లో నుంచి నీళ్ళు జారి గంజిపెట్టిన అతని కాకీబట్టల మీద నిలిచాయి.

కాకీ బట్టలమీద నిలచిన ఆ కన్నీళ్ళు ఇంకా ఇంకిపోలేదు !

అతనిమీద ఆపాదించబడిన 'అభియోగం' ఎప్పుడు ఏ రకంగా 'కాటు' వేస్తుందో హరిశ్చంద్రుడికే తెలియదు ! 

క్షణంలోనైనా సోషవచ్చి పడిపోవచ్చును. అందుకే గబగబావచ్చి చెట్టు నానుకుని కూర్చుని కళ్ళు మూసుకున్నాడు.

అప్పటికి సాయంత్రం ఆరు గంటలు దాటింది. పడమటి దిశన సూర్యుడు ఇంకా రౌద్రంగానే వున్నాడు. వెచ్చనిగాలి వీస్తూనే వుంది. ఆకాశంలో ఒక్కపక్షికూడా తిరగడంలేదు. అదిగో, సరిగ్గా అటువంటి సమయంలో—

ముందు ఓ ఇరవై చిన్నకార్లు నడుస్తూ వుండగా, ఆ తర్వాత బోయింగ్ విమానంలాటి ఎయిర్ కండిషన్డ్ కారులో కూర్చుని అటూ యిటూ పరికిస్తూ మంత్రిపుంగవులు వున్నారు. ఆ తర్వాత మరెన్నో జీపులూ, చిన్నకార్లూ వున్నాయి.

మంత్రి మహాశయులుగారి శాంతియాత్ర సాగుతోందన్నమాట !

షోసొచ్చి చెట్టుక్రింద పడిపోయిన హరిశ్చంద్రుడికి ఇవేమీ తెలియదు.

కానీ, ఘనమైన మంత్రిగారు, ఒక కానిస్టేబుల్ చెట్టుక్రింద నిద్ర పోవడం చూశారు.

తనీ దారంట వస్తున్నట్టు తెలిసి కూడా ఇంత నిర్లక్ష్యంగా వున్న ఆ కానిస్టేబుల్ మీద విపరీతమైన కోపంతో మండిపడ్డారు !

గొప్పవారు తలచుకుంటే ఏదైనా చెయ్య గలరు !



## కృష్ణ — విశాఖ

పాడి అక్షరాలు చూస్తేనే వాళ్ల ప్రశ్నల విలువ తెలిసిపోతుంది. ఆ ప్రశ్నకి జవాబులిచ్చి— నాలాంటి వారి దృష్టికి దూరంగా ఎందుకు పోతున్నారో తెలియడం లేదండీ ?

★ అంతా కర్మ నాయనా క్రిష్ణా! పాడి అక్షరాలు నేనిచ్చేది. పూర్తి పేరు చిరునామా లేకుంటే— కార్డు బుట్టదాఖలా.

## ఎమ్. ఎమ్. — పెద్దాపురం

ముఖ్యమంత్రి నవ్వాలంటే ఏంచెయ్యాల్సార్?

★ సింపుల్. రుద్రాక్షలు ధరించేసి కాషాయం కట్టుముందు—తరవాత ఆలోచించుకో వచ్చు—ఎందుకంటారా ? ఎన్‌టిఆర్ నట జీవన కృషి, ఎమ్‌జిఆర్.కృషి మీకెలాగా రాదు. రావాలన్నా టైమ్ పడుతుంది. మీ కోరికకి అంత టైమున్నట్టు లేదు మాధవా !

## యు. ఎన్. — కల్లుబావి

వెనుకటికొక కవిని, అతను రాసిన మహా కావ్యం చూసి "మీరింత గొప్ప రచనలు సృష్టించడానికి కారణం" అడుగగా అతడు "పరమ గయ్యాళి అయిన తన భార్య పుణ్యాత్మురాల్లో లేనందు వల్ల" అని చెప్పాడట. అంతటి గొప్ప వ్యక్తి తన భార్య గయ్యాళి తనాన్ని మార్చకపోవడానికి కారణం ఏమిటి ?

★ అదే కాబోలు కవిగారికి ఇన్స్పిరేషన్. అయినా అంత గొప్ప వ్యక్తికి—మనిషిని మార్చడం అసాధ్యం—(మారదల్చుకోని మనిషి)అని తెలియదా ఏమిటి !

## గణేశ్ — ఆదోని

ప్రేమించడం, ప్రేమించబడడం వీటికి అంతం వుందంటారా ?

★ లేదు. వుంటే మానవజాతి క్షీణించి పోతూ వస్తుంది.

ఆడవారి మాటలకి అర్థాలే వేరులే అంటా రెందుకు. మనసులోని మాట నిక్కచ్చిగా చెప్ప లేరనా ? లేక పైకొకటి అంటూ, లోన వేరేగా అనుకుంటారనా ?

★ కాదు. నిజంగా ఆడవాళ్లు నిక్కచ్చిగా మాట్లాడడం ప్రారంభిస్తే మగవాళ్ల పౌరుషాలు దెబ్బతింటాయి. ఈ మగవాళ్లలో చాలా మంది ఉట్టి ఉబ్బుల రంగళ్లు. పొగిడితే పొంగిపోతారు. తియ్యగా మాట్లాడితే ఐసైపోతారు. అందుకే చాలా మంది— మనసులో ఏ అభిప్రాయం వున్నా, ఏం అనాలని వున్నా— పైకి చెప్పే చెప్పనట్టుగా చెప్తారు !

ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

## ఎం. ఆర్. ఆర్. — రేమటగ్రామం

ఒక పురుషుడు ఒక దేవత పాదాలు తాకితే భక్తుడంటారు. మరి అతనే ఆ దేవత చెంపలు తాకితే —

★ మధుర భక్తుడనవచ్చుగా ? !

## పి. ఎస్. ఆర్. — రాజమండ్రి

కట్నాలు పుచ్చుకుంటున్నారనే కంటే యిస్తున్నారన్నది నా భావన. మీరేమంటారు ?

★ అడక్కుండా అమ్మేనా పెట్టదన్న సామెత మీకు తెలియదా ?

## బి. వి. ఎల్. ఆర్. — రాజమండ్రి

అక్కా ఒకర్ని ప్రేమించడానికి ఇతరుల సలహాలు పనికిరావు ఎందుకని ?

★ ప్రేమించేది మీరు కనుక !

## కె. పి. ఎల్. — పెండెకల్

భార్య భర్తకు ఎడమ భుజంవైపున ఎందుకుండాలి ?

★ ఎందుకేమిటి ? ఆటేగా గుండె వుండేది ?!

## టి. వి. — హొళగుంద

అక్కయ్యా, కొంతమంది కవులు, కవయిత్రులు తమ పేర్లకి పబ్లిసిటీ కోసం డబ్బిచ్చి సన్మానం చేయించుకుంటారని విన్నాను. నిజమేనా ?

★ నేనూ వింటున్నాను. కాని 'నేను సన్మానం చేయించుకుంటున్నాను దయచేసి రండి' అన్న కార్డెక్కడా చూడలేదు విజయా ? అంచేత ఎలా నమ్మడమో అర్థం కావడంలేదు !

కట్నం గురించి, దాన్ని తీసుకోకూడదని రచనల్లో రాస్తూ, ఆ రచయితలే కట్నం తీసుకొంటున్నారు. దీన్నేమనాలి ?

★ ఆత్మ వంచన.

## కె. పి. ఆర్. — మంగళగిరి

అతిగా వచ్చే ఆలోచనలని కంట్రోల్‌చేసే మార్గం వుందా ?

★ ఉంది. దాన్నే — 'పని' అంటారు. ఏం చేయకుండా కూర్చుంటే అడ్డమైన ఆలోచనలు వస్తాయి. పనిలో నిమగ్నమై తే— బుర్రకి ఆలోచించే తెరిపే వుండదు.

## పి. హెచ్. — విజయనగరం

పాడు పనులు చేసినోడు భూమినేలు తున్నాడు. మంచి బుద్ధులున్నోడు మట్టి కరుస్తున్నాడు. నేడు నీతి నిజాయితీలకు విలువ ప్రోత్సాహం లభించటంలేదు. ఎందుచేత ?

★ కలికాలం కదా. పోనీ — పుణ్యచింతనకి హృషీకేశం వెళ్లినా — అక్కడ హిప్పీలుట ! ★



సీరియల్

# ఈ రాగానికదే తాళం

## చక్కిలం విజయలక్ష్మి

**24**

( గత సంచిక తరువాయి )

"హలో."

"ఎవరూ ? మనూ."

"ఔనమ్మా ఎక్కడి నుంచి మాట్లాడుతున్నావ్ ?"

"శకుంతల ఆంటీ ఇంటి నుంచి."

"ఆంటీకి ఎలావుంది?" మనూ అడిగాడు.

"ఫర్వాలేదు. డ్రైవర్ వున్నాడా ?"

"లేదమ్మా. నాన్నగారి కారుతో వెళ్ళాడు"

"ఏం లేదు. ఆంటీ నన్ను ఈ రోజు ఇక్కడే వుండిపొమ్మని బలవంతం చేస్తోంది. నేనూ వుండిపోదామని అనుకుంటున్నాను. అంకుల్ కూడా వూళ్ళో లేరు పాపం."

"ఉండిపోమ్మా అయితే."

"అది సరే. జయంతి కూడా నాతోపాటే శకుంతలను చూడ్డానికి వచ్చింది. ఇద్దరం ఇక్కడే వుండిపోతే ఎలా ? ఇక్కడ అన్నయ్యగారు లేనందుకు కారు కూడా లేదు. అక్కడ డ్రైవర్ వున్నాడేమో కారు తీసుకురమ్మందామని ఫోన్ చేశాను..."

"పోనీ..."

మనూమాట పూర్తికానేలేదు. సుమిత్రమ్మ అంది "పోనీ నీవు రాకూడదూ జయంతిని తీసుకు వెళ్ళడానికి ?"

మనూ హృదయం పూలరేకులా గాలిలో తేలిపోసాగింది. తొందరపడి తను మాట పూర్తి చేయనందుకు— కాదు కాదు— తను పూర్తి చేయకముందే తల్లే పూర్తి చేసినందుకు అదీ తన మనసులోని మాటను ... చెప్పలేని ఆనందం కలిగింది. తడబడే గొంతుకతో అన్నాడు — "నీవు రమ్మంటే వస్తానమ్మా."

"తప్పకుండా రా. మీ నాన్నగారికి అవసరమవుతుందని డ్రైవర్‌ను వెళ్ళిపొమ్మన్నాను, అన్నయ్యగారెటూ డ్రాప్ చేస్తారు లెమ్మని. ఇప్పుడీ చిక్కు వచ్చిపడింది. జయంతిని ఒక్కత్తెనూ టాక్సీలో పంపటం ఇష్టంలేదు."

"ఇవన్నీ ఎందుకు ? వస్తానన్నా కదా."

"సరే సరే. వచ్చేసెయ్."

* * *

ఇవన్నీ ఏమీతెలియని జయంతి హఠాత్తుగా మన్‌మోహన్ ప్రత్యక్షం కావడం, తన నతనితో ఇంటికి వెళ్ళమని సుమిత్రమ్మ చెప్పటం ఇవన్నీ చూసి బెంబేలు పడిపోయింది. అయితే సుమిత్రమ్మ ఎదుట బయటపడిపోవటం, అతనితో వెళ్ళటానికి అభ్యంతరం చెప్పటం ఇష్టం లేక అయిష్టంగానే అయినా మౌనంగా బయలుదేరింది.

* * *

కారు మెయిన్‌రోడ్డుమీంచి క్రాస్‌రోడ్డుకు తిరిగి ఆ తర్వాత మట్టిరోడ్డుకు మళ్ళి ఫర్లాంగు దూరంలోని చీని తోటలో వచ్చి ఆగింది.

అప్పటికే ఈ దారి మళ్ళింపును అనుమానంగా చూస్తున్న జయంతి కారు ఆగటం చూసి 'ఇక్కడ ఆపారేం !' అన్నట్లుగా చూసింది.

మన్‌మోహన్ తడబడ్డాడు. అతని ఎర్రని పెదిమలు అదురుతున్నాయి. నుదుటిమీద చిరుచెమటలు పట్టాయి.

"నీవు నాతో ఎందుకు మాట్లాడటం లేదు జయంతీ ?" అన్నాడు వణికే స్వరంతో.

"అయితే, ఇది బలవంతంగానైనా సరే మాట్లాడించే ప్రయత్నమని అనుకోవచ్చా ?" మెల్లగా, మెత్తని కత్తిలా అంది జయంతి.

"లేదు లేదు" గాభరగా అన్నాడు మన్‌మోహన్.

"ఆ ఇంట్లో, మన మధ్య ఓ విషాదం జరిగిపోయింది. మనం ఎదురుపడ్డ ప్రతిసారీ ఆ విషాదం తాలూకు చిరు ఛాయల్ని ఆ పరిసరాలు గుర్తు తెస్తూనే వుంటాయి. అందుకే ... అందుకే ఓసారి ఇలా ఆ పరిసరాలకు దూరంగా.."

జయంతి ఏమీ అనలేదు.

"నీ అనుమతి లేకుండా నిన్నిలా తీసుకు రావటం తప్పే. ఒప్పుకుంటాను. కానీ... కానీ ఒక్కోసారి తప్పని తెలిసీ చేయకుండా వుండలేని ఆరాటం గుండెల్ని తొలిచివేసే పరిస్థితి ఎదురవుతూ వుంటుంది."

విచిత్రంగా చూసింది జయంతి.

"నీ చూపుల్తో నన్నిలా దూరంగా నిలబెట్టేయకు జయంతీ. నేరానికీ, క్షమకూ మధ్య శిక్ష అన్నది ఒకటుందని నాకు తెలుసు. కానీ నీ మౌనం నన్నెంతగా శిక్షిస్తోందో నీకు తెలియదు."

తలవంచుకుంది జయంతి. "నా ప్రమేయం లేని విషయాలకు నన్ను బాధ్యురాల్ని కమ్మనటం సబబు కాదు."

"కావచ్చు. కానీ జయంతీ, ఇకమీదట నీ మౌనం భరించే శక్తి నాకు లేదు. ఎందుకంటే నా అశక్తత గురించి నీ కిప్పుడు తెలుసు కాబట్టి."

చిరాగ్గా చూసింది జయంతి.

ఆ చూపు కొరడాలా తగిలింది మన్‌మోహన్‌కు. బాధాతప్త స్వరంతో అన్నాడు "నా నేరం క్షమించరానిదే. కానీ, నే ననుభవిస్తున్న శిక్ష నా నేరానికి కోటి రెట్లుగా వుందని నిన్ను నమ్మించేదెలా !"

"నేను నమ్మనంత మాత్రాన మీకు జరిగే నష్టమేమీ లేదు. పైగా ఇంతగా బాధపడవలసినంత నేరం మీరేమీ చేయలేదు. ఇష్టంలేని విషయాన్ని నిర్మొహమాటంగా చెప్పగలగటం నేరమేమీకాదు. నేనెంతో సంతోషించాను కూడా. కానీ...మీ అభిప్రాయం మీద మీరు దృఢంగా నిలబడివుంటే మరింత బావుండేది. త్వరత్వరగా అభిప్రాయాలు, అభిరుచులు మార్చుకోవటం ఏమంత..." అంటూ ఆగిపోయింది జయంతి.

"ఒక వ్యక్తి ఎడల సరియైన అవగాహన లేకుండా ఏర్పరచుకున్న అభిప్రాయాన్ని ఆ తర్వాత మార్చుకోవడం తప్పే అవుతుందా ?"

చురుగ్గా చూసింది జయంతి. "నా విషయంలో మీరు కొత్తగా చేసుకున్న అవగాహన ఏమిటో !"

**జరిగిన కథ — 7 :** గీతతో బజారుకెళ్ళిన జయంతిని పద్మిని అవమానిస్తుంది. గీత బర్త్‌డే రోజు జయంతి పాడిన పాట విన్న సుమిత్రమ్మ జయంతిని సంగీతం మాస్టారు దగ్గర సంగీతం నేర్చుకోమని చెపుతుంది. జయంతి తనకిపుడు సంగీతంమీద ఆసక్తి లేదని చెపుతుంది. కారు యాక్సిడెంట్‌లో పద్మిని మరణిస్తుంది; హరికి కళ్ళు పోతాయి. యాక్సిడెంటులో గాయాలయిన మన్‌మోహన్‌కు తన రక్తం ఇస్తుంది జయంతి. జయంతి వ్యక్తిత్వం మన్‌మోహన్‌ను ఆకర్షిస్తుంది. జయంతి హరి సేవలలో కాలం గడుపుతూ ఉంటుంది. గీతను చూడవచ్చిన పెళ్ళివారు వాళ్ళ అబ్బాయికి జయంతి నచ్చినట్లు రఘునాధరావుకి ఉత్తరం రాస్తారు. జయంతి కథకు మొదటి బహుమతి వచ్చింది ఆమెను చూడను ఆమె అభిమానులు వచ్చారు. జ్వరం వచ్చి పడుకున్న జయంతిని మన్‌మోహన్ కిటికీలోంచి చూసాడు. మర్నాడు ఆ కిటికీ మూసి ఉండటం గమనిస్తాడు మన్‌మోహన్.

తడబడ్డాడు మనూ. చాలాసేపు మౌనం వహించాడు. తర్వాత డోర్ తెరచుకుని క్రిందికి దిగాడు. గాలికి చెలరేగుతూన్న వుంగరాల జుట్టును చేత్తో వెనక్కు నెట్టుకుంటూ అన్నాడు ''మనసుకు భాష లేదు జయంతీ. అందుకే అదేమిటో మాటల్లో చెప్పలేను.''

జాలి గొల్పుతూన్న ఆ స్వరాన్ని వింటూ అతని మనసును చదువుతున్నదానిలా ఓరగా అతనికేసి చూస్తూ వుండిపోయింది, జయంతి.

మనసుకు భాష్యం చెప్పక తప్పని పరిస్థితిలో అలా చెప్పడానికి ప్రయత్నిస్తూ ''నేను సిటీలో ప్లాస్టిక్ పువ్వుల మధ్య, ఆ కొట్టొచ్చే రంగుల ఆకర్షణల మధ్య పెరిగినవాణ్ణి. ఆడంబరంలేని పారిజాతాన్ని గుర్తించడానికి కాస్త టైం తీసుకుంది అంతే.'' అన్నాడు.

'అయితే? నా కిదంతా ఎందుకు చెబుతున్నట్లు?' అన్నట్లుగా చూసింది జయంతి.

హతాశుడయ్యాడు మన్‌మోహన్.

''జయంతీ, జయంతీ ! నీవు తెలివిగలదానివి. రచయిత్రివి. నా బాధ, నేను పడే బాధ నీకు అర్థం కావటంలేదా ? '' నిస్సహాయంగా, దీనంగా అన్నాడు మనూ.

జయంతి అతని బాధేమీ అర్థంకాని పసి పాపలా, ప్రశాంతంగా, నిర్వికారంగా చూసింది.

జయంతికి తగిలిన గాలిని తాకడానికి కూడా ఇంతవరకూ నోచుకోనివాడు మన్‌మోహన్. ఒక్కసారిగా ఆమెతో ఈ ఏకాంతం అతనికి స్వర్గంలా వుంది. మళ్లీ ఆమె మౌనం, తన బాధ అర్థం కానట్లున్న ఆమె నిర్లిప్తతా నరకంగా వుంది. ఆమె సౌందర్యం, ఆమె గాంభీర్యం, ఆమె ఎడల తనకున్న మితిలేని రాగభావం నిలువ నివ్వటంలేదు మన్‌మోహన్‌ను. జయంతి శరీరం మీంచి తేలి వస్తూన్న గాలి అతనికి మత్తెక్కించగా, ఆమెను రెండు చేతులా చుట్టి గుండెలకు హత్తుకోవాలనే కోరికను అణుచుకోవడానికి చాలా ఇబ్బంది పడవలసి వచ్చింది. అతని మార్పులు అధికం కాగా ''నా అణువణువునూ ఇలా కాల్చివేయకు జయంతీ. నీ కోసం ... నీ కోసం తపించి పోతున్నాను.'' ఆవేశంగా అన్నాడు.

ఉలికిపడింది జయంతి. వణుకుతున్న అతని పెదిమలు, తనకేసి ఆకలిగా చూస్తున్న అతని కళ్లు, అసహనంగా కంపిస్తున్న అతని చేతులు ఆమె గుండెల్లో అదటు కలిగించాయి.

''ఇంటికి వెళ్లిపోదాం'' అని అంది అరిచినట్లుగా.

నవనాడులూ కృంగిపోయిన వాడిలా డీలాపడి చూశాడు మనూ. దేవుడని భ్రమించి రాతి ముందు తల కొట్టుకున్న వాడిలా చూశాడు. తర్వాత భారంగా వచ్చి కార్లో కూర్చున్నాడు.

స్టీరింగ్ మీద తల వాల్చి ఆవేదన గూడు కట్టిన స్వరంతో అన్నాడు ''సరే జయంతీ. నీ కసి తీరేదాకా నన్ను శిక్షించు. కానీ శిక్షాంతంలో నీవు...నీవు నాక్కావాలి.''

హఠాత్తుగా కారు స్టార్ట్ చేశాడు మన్‌మోహన్. రివ్వున బాణంలా ముందుకు దూకింది.

*　　　*　　　*

సుమిత్రమ్మ జయంతిని తన గదికి పిలిపించుకుంది.

''కూర్చో జయంతీ.''

జయంతి కూర్చుంటూ సుమిత్రమ్మ ముఖంలోకి చూసింది. ఆమె ముఖం దీప్తివంతంగా వుంది.

''నిన్న నీవు, మనూ తోటకు వెళ్లారా ?''

ఔనన్నట్లుగా తల వూపింది జయంతి.

సంతోషంగా నిట్టూర్చింది సుమిత్రమ్మ.

''కానీ...'' ఏదో అనబోయింది జయంతి.

అంతలోనే ''వాడిప్పటికయినా మనుషుల విలువలు గ్రహించటం నేర్చుకున్నాడు. ఫరవా లేదు'' అంది సుమిత్రమ్మ.

సుమిత్రమ్మ మాటలు, ఆమె ముఖంలోని సంతోషం, సంతృప్తి చూస్తుంటే వూపిరాడనట్లయింది జయంతికి.

'ఇక లాభం లేదు' అనుకుంది.

''అత్తయ్యా...'' అంటూ చెప్పడం ప్రారంభించింది.

## 25

ఏదో పుస్తకంచదివి వినిపిస్తోంది జయంతి. హరి మనసు దానిమీద లేదు.

''జయంతీ, నన్ను కాస్త తోటలోకి తీసి కెళ్లగలవా ?'' అన్నాడు.

''అలాగే.''



"చేయిపట్టి తోటలోకి నడిపించుకువెళ్ళింది జయంతి. ఇద్దరూ సిమెంటు బెంచీ మీద కూర్చున్నారు.

"జయంతీ."

"ఊ"

"ఇప్పుడు టైమెంతయిందో తెలుసా? దాదాపు ఆరు గంటలు. ఇంకా చంద్రోదయం కాలేదు. గులాబీలు గుబాళిస్తున్నాయి. సన్నజాజులు ఇప్పుడిప్పుడే వికసిస్తున్నాయి. మాలి కిళ్ళు కట్టినట్లున్నాడు. తడిసిన పచ్చి ముఖమల్ పరుపులా వుంది. మట్టివాసన ఎంత మధురంగా వుందో తెలుసా? ఇప్పుడు వీస్తున్న గాలి సమశీతలంగా, ఎంత హాయిగా వుందో కదూ? అదిగో కోకిల గానం నీ చెవులకు విందు చేయడం లేదూ?"

జయంతి ఆశ్చర్యంగా చూసింది హరికేసి.

"జయంతీ, ప్రకృతిలోని ఈ సౌందర్యాన్ని, సౌరభాన్ని, కర్ణపేయమైన శబ్దాన్నీ నేను నీకంటే ఎక్కువగా ఆస్వాదిస్తున్నాను. ఎందుకో తెలుసా? అంధుణ్ని కాబట్టి. పలు వంకలకు పారాడే నేత్ర ద్వయం నాకు లేదు కాబట్టి. నా ఏకాగ్రతను ఏకోన్ముఖం, అంతర్ముఖం చేసుకున్నాను కాబట్టి. రసం ఏదైనా కానీ, నా రసాస్వాదన పరిపూర్ణమైనది. కళ్లతో చూస్తూ మనసుతో ఆస్వాదించటంలో ఏకాగ్రత దెబ్బతింటుంది. ఆస్వాదన అసంపూర్ణమవుతుంది. కళ్ళు లేనివాడు మనసుతో చూసి మనసుతో ఆస్వాదించగలడు. అణుమాత్రం కూడా అతని ఆస్వాదన పరిధిలోంచి తప్పించుకోలేదు. ఒక విధంగా అంధత్వం అదృష్టమే ననిపిస్తుంది నాకు. ఆ అంధుడు రసహృదయుడు, భావుకుడు కూడా అయితే ఇంక చెప్పేదేముంది? జయంతీ, సౌందర్యారాధనలో,

# ఈ రాగానికదే తాళం

సౌందర్య రసాస్వాదనలో ఎంత ఆనందం వుందో నీకు తెలుసా? నీకు తెలియదులే. ఎందుకంటే కళ్ళున్నన్ని నాళ్ళూ నాకూ తెలియదు. నాకిప్పుడు ఎంత ఆనందంగా వుంది! సర్వేంద్రియాలనూ, సర్వశక్తుల్నీ అంతర్ముఖం చేసుకుని, తపోనిష్ఠలాంటి ఏకాగ్రతలో ఈ ఆనందమనే అమృతపానం ... జయంతీ, రసహీనమైన వైవాహిక జీవితంతో విసిగిపోయిన నాకు, ఏ బాదరబందీ లేని ఈ.. "

"ఆపండి."

జయంతి కేకతో వులికిపడ్డాడు హరి

"జయంతీ!" అన్నాడు గాభరాగా.

"బావా, దురదృష్టవశాత్తూ నాకు కళ్ళు వున్నాయి. మీ అంతరాత్మ ఎంత ఆనందమనే అమృతపానం చేస్తోందో మీ ముఖం నా కళ్లకు చెబుతూనే వుంది"

హరి ముఖం నల్లబడిపోయింది.

"మీరు నటులుకారు. ఉపన్యాసకులు. అందుకే గొప్పగా మాట్లాడ గలుగుతున్నారు గానీ ఆ మాటలకు తగినట్లుగా ముఖంలోని భావాలను మార్చుకోలేకపోతున్నారు బావా, ఇదంతా నాకెందుకు చెబుతున్నారో అర్థం చేసుకోలేనంత మూర్ఖురాల్ని కాను. అర్హత లేకపోయినా అవకాశాలు కోసం వెంపర్లాడటం మానవనైజం. అవకాశాలు వచ్చినా ఎదుటివాళ్ళ మీద దయతో తమను తాము తక్కువ చేసుకోవటం ఎంత ఔన్నత్యం! మీలోని ఆ వ్యక్తిత్వం, ఔన్నత్యమే నన్ను ప్రభావితురాల్ని చేశాయి. మీ సహధర్మచారిణినయ్యే భాగ్యాన్ని నాకెందుకు కలిగించకూడదు?"

"జయంతీ! నా వ్యక్తిత్వం, ఔన్నత్యం నిన్ను ప్రభావితురాలిని చేశాయని అంటున్నావు. అదంతా గతం. ప్రస్తుతం నేను కళ్ళు లేని కబోదిని. తినటం, నిద్రించటం తప్ప మరేమీ చేయలేనివాణ్ణి. అయినా ఇతరుల మీద ఆధారపడి. ఇలాంటి నాకు వేరే వ్యక్తిత్వమేమిటి! ఔన్నత్యమేమిటి! కదిలే రాయిని జయంతీ. కదిలే రాయిని అంతే."

"కదలని రాయికి కూడా వ్యక్తిత్వం వుంది బావా. రాయికీ రాయికీ తేడా వుంది. ఒక రాయిలో వజ్రం వుంది ఒక రాయిలో శిల్పం వుంది. మరో రాయిలో జలం వుంది. మీరు.. మీరు అందులే కావచ్చు ఔన్నత్యం కళ్లకు సంబంధించినది కాదు బావా. మనసుకు కళ్ళు పోయినంత మాత్రాన మనసు మరణించదు మనసున్నంత కాలం దానికి ఓ తత్వం వుంటుంది. మీ మనసుకున్న ఆ తత్వం ... ఔన్నత్యం"

"జయంతీ, ఇలా అంటున్నానని ఏమీ అనుకోకు. నీవు రచయిత్రివి. నీ భావాలకు అందమైన భాష నివ్వగల నేర్పు నీకుంది. నీ అభిప్రాయాన్ని ఇతరుల చేత కూడా ఔననిపించగల భావ వ్యక్తీకరణ నీకుంది. ఈ నీ అపురూపమైన శక్తి సామర్థ్యాలు సాహిత్యంలో వినియోగించుకుంటే వుచితంగా వుంటుంది. ఇది నీ జీవితం. నీ కున్న ఒకే ఒక్క అమూల్యమైన జీవితం బాధలోనే సుఖాన్ని వెతుక్కోమ్మనే కవి భావం కమ్మగానే వుంటుంది గానీ అనుభవంలో బాధ బాధే జయంతీ. నీ జీవితం బాధామయం కావటం నేను సహించలేను."

"కాదు. నా జీవితం సుఖమయం కావటం మీరు భరించ లేకుండా వున్నట్లుంది" కాస్త కోపంగా అంది జయంతి.

నవ్వేడు శ్రీహరి

"నిప్పు ఎర్రగా, అందంగా వుందనీ, దానితో ఆడుకుంటాననీ చిన్నబిడ్డ అనినంత మాత్రాన ఆ బిడ్డ మీద పెద్దల కెంత ప్రేమ వున్నా నిప్పును తాకనివ్వరు జయంతీ."

"నా కోరిక మీకంత మూర్ఖంగా కన్పిస్తోందా?" ఉక్రోషంగా అడిగింది జయంతి.

"అంతకంటే కూడా."

"సరే అయితే. నిప్పును పట్టుకునే నిబ్బరమైనా సాధిస్తాను. లేదా ఆ నిప్పులో మాడి అయినా పోతాను" నిబ్బరంగా, దృఢంగా, ప్రతిన పూనినట్లుగా అంది జయంతి.

చిరునవ్వుతో అన్నాడు హరి "పట్టుదల మంచిదే. కానీ న్యాయమైన విషయంలో వుంటే సాధించటానికి ఎక్కువ అవకాశాలుంటాయి" అంటూనే లేచి నిలబడి లోనికి దారి తీశాడు.

ఆతని చేయి అందుకుంటూ అంది జయంతి "ఎవరి న్యాయం వాళ్ళకుంటుంది."

* * *



లక్నో ఆంధ్రా అసోసియేషన్ వార్షికోత్సవంలో నృత్య ప్రదర్శన ఇచ్చిన కుమారి జొన్నలగడ్డ అనూరాధ (హైదరాబాదు). ఈమె ప్రఖ్యాత నర్తకి కుమారి శోభానాయుడు శిష్యురాలు

## రుచిచూస్తే తెలుస్తుంది:

# మేము వుపయోగించిన వస్తువులు ఆ ప్రత్యేకతకి కారణం.

ప్రకృతి సిద్ధమైన మూల పదార్థాలు.
అందుచేతే ట్రూ బిస్కట్లకి లభించాయి—
స్వచ్ఛత, పోషకత్వం, సంపూర్ణత్వం.
ట్రూ బిస్కట్లు. ఆరగించి
ఆనందించడానికి....ఇతరులతో
పంచుకోడానికి....ఇతరులకి
ఇవ్వడానికి....అందరికీ
కావలసిన అనేకరకాలు.

## ట్రూ బిస్కట్







**హనీ గ్లూకోజ్**
గ్లూకోజ్ మరియు స్వచ్ఛమైన తేనెతో శక్తినిచ్చే బిస్కట్.







**నీస్**
సహజమైన కొబ్బరి కురిడీతో చేసి పంచదార జల్లిన రుచికరమైన బిస్కెట్.







**మారీ**
అన్ని వేళలకి.
కాఫీ త్రాగేటప్పుడు,
టీ తీసుకునేటప్పుడు
లేక ఏ
సమయంలోనయినా.







**స్క్రంచ్**
మింట్ చేరిన తియ్యని, కరకరలాడే చాక్‌లెట్ క్రీమ్ బిస్కెట్.







**ఏలక్కాయ క్రీమ్ కస్టర్డ్**
పోషకత్వం కలిగి, గట్టిగావుండే కస్టర్డ్ క్రీమ్ మరియు ప్రకృతిసిద్ధమైన ఏలక్కాయలతో రుచికరమైన కలయిక. ఆరగించడానికి, అందించి ఆనందించడానికి.

AFL - 1432

# ఈ రాగాని కదే తాళం

సాయంకాలం ఆరు గంటలయింది. సంధ్యా దీపం వెలిగించి పూజ గదిలోంచి బయటకు వచ్చింది జయంతి.

"నిన్ను నాన్న పిలుస్తున్నారు" అంటూ వచ్చింది గీత.

"ఎక్కడున్నారు ?"

"మేడ పైన డాబా మీద."

వంట గదిలోకి వెళ్లి రాత్రికి వంట ఏం చేయాలో వంటవాడికి చెప్పి డాబా మీదికి వెళ్లింది జయంతి.

రెండో అంతస్తు పైన వుంది విశాలమైన డాబా, బాగా ఎత్తు అవడంవల్ల రోడ్డు మీది శబ్దాలు అంతగా వినిపించక ప్రశాంతంగా వుంటుంది. ఎప్పుడైన తీరికగా వున్నప్పుడు సుమిత్రమ్మతో డాబా పైకి వచ్చి కబుర్లు చెప్పుకోవడం అలవాటు రఘునాథరావుగారికి. సుమిత్రమ్మ పూలకుండీలు కూడా పెట్టించి రూఫ్‌గార్డన్‌లా కూడా మార్చింది. ప్రశాంతంగా వున్నచోట ఇద్దరే వుండి మాట్లాడుకుంటూన్నప్పుడు ఎదుటి ఆ రెండవవారు మనకు ఆత్మీయులుగా అనిపిస్తారు. మనం ఏమైనా ప్రత్యేకించి ఎదుటి వాళ్లను ఒప్పించాలన్నా అలాంటి చోట్లే అనువైనవి. అందుకే జయంతితో మాట్లాడ్డానికి, క్రింద గదులు, తోట వున్నా డాబా ఎన్నుకున్నారు రఘునాథ రావుగారు.

తాననుకున్నదేమిటి !? జరుగుతున్నదేమిటి? అనుకున్నవాటికి, జరిగేవాటికి పొంతన లేకపోవటమే కాబోలు జీవితంలోని రహస్యం ! జయంతిని తీసుకువచ్చిననాడు తన వుద్దేశం వేరు. ఆ వుద్దేశం నెరవేరనందుకు తానెంతో బాధ పడుతున్నాడు. ఎప్పటికైనా నెరవేరుతుందనే ఆశతోనూ వున్నాడు. కానీ అదేదో జరగలేదని జయంతి ఇంత తొందరపాటు నిర్ణయాలు తీసుకుంటుందని తను వూహించలేదు. ఇలా జరుగుతుందని ఏమాత్రం వూహించి వున్నా అసలు జయంతి నిక్కడికి తీసుకువచ్చేవాడేకాదు. అయినా ఇలా జరుగుతుందని వూహించడానికి ఆనాడవకాశమెక్కడిది ?

ఊహూ, ఇలా జరగడానికి వీల్లేదు. అవసరమైతే జయంతిని ఇక్కడి నుండి పంపివేస్తాను గానీ జయంతి ఆటలు తను సాగనివ్వడు. జయంతిని తమ మంచి తనంలో ముంచితేల్చాలని తీసుకువచ్చాడు గానీ జయంతి అంతులేని మంచి తనం తన నింత ఇరకాటంలో పెట్టి చంపుతుందనుకోలేదు. అసలు జయంతి...

"మామయ్యా"

ఆలోచనల్లో మునిగిపోయిన రఘునాథరావు గారు వులికిపడి చూశారు.

పాలతో కడిగినట్లుగా తెల్లగా, స్వచ్ఛంగా వున్న ముఖం, కనుబొమల నడుమ కుంకుమ రేఖ, మెడ చుట్టూ కప్పుకున్న తెల్ల నేతచీర, ప్రసన్నమైన చిరునవ్వు ! వినీలాకాశం నుంచి, ఎగిరిపోతూ రెక్కజారి క్రిందపడిన తెల్ల పావురాయిలా వుంది జయంతి.

"పిలిచారట ?"

"ఊ ? ఔను. నీ పనులన్నీ పూర్తయ్యాయా ?" చిరునవ్వు నవ్వుతూ ప్రశ్నించారు రఘునాథరావుగారు.

తనూ చిన్నగా నవ్వుతూ "ఇంకా ..." అంటూ ఏదో చెప్పబోయింది.

"సరేగానీ... కూర్చో" అన్నారు మరో కుర్చీకేసి చేయి చూపుతూ.

కూర్చుంది జయంతి.

తల వంచుకుని కూర్చున్న జయంతిని పరిశీలనగా చూస్తూ అడిగారు రఘునాథరావుగారు "నేను విన్నది నిజమేనా ?"

'ఏమిటి విన్నారు ?' అన్నట్లు ప్రశ్నార్థకంగా చూసింది.

"త్యాగం పేరుతో పిచ్చి వేషాలేయటం ఈ తరం వారికి బాగా అలవాటయింది" అన్నారు వ్యంగ్యంగా.

విషయం అర్థమైంది జయంతికి.

"నేను చాలా స్వార్థపరురాలిని మామయ్యా. ఎవరి కోసమూ త్యాగం చేసేంత ఔదార్యం నాకు లేదు" అంది.

"నేనన్నదీ అదే. నీవు త్యాగం చేయలేవు. కానీ త్యాగం పేరిట పిచ్చిపనులు చేస్తున్నావు."

చిన్నగా నవ్వి అంది జయంతి "నేను పిచ్చిదానిలా కనిపిస్తున్నానా మామయ్యా ?"

"నేను తీసుకు వచ్చినప్పుడు మంచిదానివే. కానీ ఇక్కడికి వచ్చాక పిచ్చిదానివైనట్లున్నావ్."

ఒకసారి తల ఎత్తి రఘునాథరావుగారికేసి చూసి, మళ్లీ తల వంచుకుని, వచ్చే నవ్వు నాపుకుంటూ అంది జయంతి "బహుశా ఇక్కడి వాళ్ల పిచ్చి నాకూ సోకిందేమో."

"జయంతీ" కొంచెం తీవ్రంగా అన్నారు రఘునాథరావు.

చురుగ్గా తలెత్తింది జయంతి.

తన్ను తాను కంట్రోలు చేసుకుంటూన్నట్లుగా ఒకసారి గుటకవేసి, తర్వాత సౌమ్య స్వరంతో అన్నారు "జయంతీ, నేను మీ నాన్నకిచ్చిన మాట నిలబెట్టుకోలేకపోయాను. అందుకు నాకింత పెద్ద శిక్ష విధిస్తున్నావా ?"

## నిరీక్షణ

ఉవ్వెత్తున విరుచుకుపడే
జన సముద్ర కెరటాల క్రూర ఘోష
నా చుట్టూ —
ఏకాంతం వాయులీనం మీంచి
అలవోకగా జాలువారే
నిశ్శబ్దతరంగాల చుట్టూ నేను !
హృదయకుటీరం తలుపుల ముందు
ఒళ్లంతా కళ్లు చేసుకొని
కాలాన్ని తోడుకుంటున్న ఆశ !
దరీదాపూ లేని
సంశయ కల్లోలినిలో వూగిసలాడుతూ
తెరచాప లేని చూపు !
నిర్లక్ష్యంగా
ఓ శిలనై పడివున్నా బావున్ను
ఏ అదృష్టపు పాదధూళైనా
యింత సోకేది !
ఇప్పుడు చూడు :
జీవన సాఫల్యా'భిరామ'కైంకర్యానికి
కాలాటవిలోని యీ నిరీక్షణ
ఎన్ని దినఫలాలను రుచి చూస్తూ
ఎదురుతెన్నులు చూడవలసివస్తున్నదో ...

— దిలావర్

"మామయ్యా!!" నొచ్చుకుని అంది జయంతి.

"ఒక పురుషుడు ఒక తండ్రికి బిడ్డే కావచ్చు. కానీ అతన్ని కోరే అధికారం, అవకాశం ఒక స్త్రీకి వుండకూడదా మామయ్యా? అది ఆ తండ్రికి శిక్ష అవుతుందా?"

"జయంతీ, హరి వివాహితుడు, విధురుడు, ఒక బిడ్డ తండ్రి, అంధుడు కూడా. అన్ని విధాలా ఉన్నత స్థానంలో వున్న స్త్రీ అతన్ని మనస్ఫూర్తిగా కోరిందంటే ఆమె పిచ్చిదయినా అయివుండాలి లేదా నమ్మేవాళ్లయినా పిచ్చివాళ్లయి వుండాలి. మనుషుల అసహాయతమీద జాలి వుండడం మంచిదేగానీ అది తమ జీవితాలనే బలి కోరేంత తీవ్రరూపం ధరించటం ఇరు పక్షాల వారికీ మంచిది కాదు. ఆ అసహాయుల మీద జాలిచూపే అవసరం వైదొలగిననాడు జాలి పేరిట తామెంత తప్పటడుగు వేశారో గుర్తించినా అప్పుడు చేయగలిగేదేమీ వుండదు."

"నేను జాలితో ఈ నిర్ణయానికి రాలేదు మామయ్యా. హరి బావ అంటే నాకు ఇష్టం. అతని మనసు, వ్యక్తిత్వం నాకు నచ్చాయి" తల వంచుకుని అంది జయంతి.

"నీ మాటలు నమ్మేందుకు నేను పసివాణ్ణి కాదు. వెర్రివాణ్ణీ కాదు"

"మీరు నమ్మకపోయినా వున్న విషయం అదే."

"అంధుడై కూడా నీకు అంతగా నచ్చిన విషయం వాడిలో ఏముంది?"

కొన్ని క్షణాలు మౌనంగా వుంది జయంతి. ఆ తర్వాత "అది ఒక్క మాటతో చెప్పేదికాదు. మీ అందరికీ అపురూపంగా కనిపించే నేను మన్‌మోహన్‌కెందుకు నచ్చలేదు? ఇదీ అంతే" అంది.

"నీ వెన్నైనా చెప్పు. నీవు నన్ను నమ్మించలేవు. జయంతీ, హరిమీద నీకు సానుభూతి ఉండవచ్చు. వాడి అసహాయతకు, జీవితంలో వాడికి జరిగిన అన్యాయానికి నీ గుండెలు నీరవుతూ వుండవచ్చు. కానీ నీవు సానుభూతి చూపవలసిన పద్ధతి ఇది కాదు. ఒకరికి సానుభూతి చూపించబోయి మనం సానుభూతి పొందవలసిన పరిస్థితిలో పడిపోవటం చాలా మూర్ఖత్వం. సార్థకత లేని త్యాగం తాగ్యమనిపించుకోదు."

"మీరనే సానుభూతి బావమీద నాకుంది గానీ కేవలం సానుభూతితోనే నేనతని ఇల్లాలిని కావాలనుకోవడం లేదు. అతని కోసం ఎలాంటి త్యాగమూ చేయాలనుకోవడం లేదు. వైవాహిక జీవితానికి సానుభూతి శాశ్వతమైన ఆలంబన కాలేదని నాకు తెలుసు. త్యాగం పేరుతో వివాహమాడి బావను మరింత సానుభూతి చూపవలసిన స్థితికి దిగజార్చనూ తలచుకోలేదు. కానీ, మామయ్యా, మీరు నమ్మనందువల్ల నేను సిగ్గు వదలి చెబుతున్నాను. హరి బావను నేను... ప్రేమిస్తున్నాను."

"జయంతీ!!!"

"ఔను మామయ్యా. నా మీద ఇంత వాత్సల్యం చూపించే మీ దగ్గర నా మనసు విప్పి చెప్పటంలో పొరపాటు లేదు. నన్ను నన్నుగా ప్రేమించే భర్త నాకు కావాలి. నాలో ఏ ప్రత్యేకత లేకపోయినా నా మనసుకు, వ్యక్తిత్వానికి, స్త్రీత్వానికి విలువనిచ్చేవాడు కావాలి. ఈ రోజు నేను రచయిత్రిని. నాలోని రచనా పటిమను చాలామంది ప్రేమిస్తూండవచ్చు. కానీ రేపది నాలోంచి జారిపోవచ్చు. నేనేమీ రాయలేకపోవచ్చు. ఆ ఆకర్షణీయమైన ప్రత్యేకతను ఆరాధించేవాళ్లు కేవలం ఒక మామూలు స్త్రీగా మాత్రమే మిగిలిపోయిన జయంతిని ప్రేమించగలరా?"

"నీ వంటున్న దేమిటో నా కర్థంకావటం లేదు. ఈ ప్రపంచంలో అందరూ రచయిత్రులు కాదు. ఆ మామూలు స్త్రీలను ప్రేమించడానికి ఒక అంధుడే కావాలా?"

"ఊహూ. అక్కర్లేదు. కానీ రచయిత్రిని ఒక మామూలు స్త్రీగా కూడా అభిమానించగల్గిన ఒక అంధుణ్ణి, ఆ రచయిత్రి ప్రేమిస్తే ఆ ప్రేమకు అంధత్వం ఒక ఆటంకం ఎందుకు కావాలంటున్నాను."

"నీ వెన్నయినా చెప్పు నీ అభిప్రాయాల్ని నేను సమర్థించను. ఆశే అయితే నీ ఆశను నేను నెరవేరనివ్వను" కాస్త ఆవేశంగా అన్నారు రఘునాథరావుగారు.

నిర్లిప్తంగా అంది జయంతి "మనిషి పెంచుకున్న ప్రతి ఆశా నెరవేరాలనీ, నెరవేరుతుందనీ ఎక్కడుంది మామయ్యా. అయినా ఆశించడం మాత్రం తప్పుకాదుగా."

"ఆశించడం తప్పు కాదు. కానీ తప్పు ఆశల్ని పెంచుకోవడం తప్పు" విసుగ్గా అన్నారు రఘునాథరావుగారు.

తల వంచుకుని చేతి వేళ్లకేసి చూసుకోసాగింది జయంతి. తన మాటల్ని ఖాతరు చేయని దానిలా మౌనం వహించిన జయంతిని చూసి చిరాకు పడ్డారు రఘునాథరావుగారు.

"సరే వెళ్లు. నీ ఆశ నెరవేరదని నీకూ, నాకూ కూడా తెలుసు. కానీ మంచితనంగానే నిన్ను ప్రయత్నంనుండి మరలించాలని ప్రయత్నం. అంతే వెళ్ళు"

"ఆశ అంటేనే జరిపించుకోవాలనే ఆసక్తి. జరగదని తెలిసి ఎవరూ ఆశించరు. దాన్ని ఆశ అనరు" అంటూ లేచి నిలబడింది జయంతి

"కూర్చో" అన్నారు రఘునాథరావుగారు. ఆగ్రహాన్ని బలవంతంగా అణచి పెడుతున్నట్లుగా ఆయన కణతలు కదిలిపోయాయి ముఖం ఎర్రబడింది.

జయంతి కూర్చుంది.

చాలా సేపటివరకూ రఘునాథరావుగారు మాట్లాడలేదు. జయంతి తల ఎత్తి చూసింది. ఆయన ముఖంలో కోపం తాలూకు ఛాయలు కనిపించలేదు. డాబా మీద ఏర్పాటు చేసిన లైటు కేసి చూస్తున్నా, ఆయన చూపులు ఎక్కడో ఎన్నేళ్ళ క్రితపు దృశ్యాన్నో చూస్తున్నట్లుగా వున్నాయి.

(ఇంకా ఉంది)

ఖమ్మంలో డాక్టర్ సి. నారాయణరెడ్డి అధ్యక్షతన జరిగిన సాహితీ సమారాధనోత్సవ సభలో ప్రసంగిస్తున్న శ్రీ రావెళ్ల వెంకట రామారావు. శ్రీ కె.వి. గిరి, శ్రీ తులసి జగన్మోహనరావు, డా. రావూరి భరద్వాజలగార్లని చిత్రంలో చూడవచ్చు.



# హిప్నాటిజం - డాక్టర్ జేమ్స్ బ్రయిడ్

## అద్భుత వ్యక్తులు

వైద్య శాస్త్రం అప్పుడప్పుడే అభివృద్ధి చెందుతున్న సమయంలో స్కాట్‌లెండ్‌కు చెందిన డాక్టర్ బ్రయిడ్, హిప్నాటిజం ప్రక్రియను కనిపెట్టి ఆ రంగంలో ఒక అత్యున్నత స్థితికి చేరుకున్నారు. 1795 లో జన్మించిన బ్రయిడ్‌కి చిన్నతనం నుంచీ వైద్యశాస్త్రం మీద ఎంతో ఆసక్తి ఉండేది. ఒకసారి తన స్నేహితుని ముంజేతి ఎముక విరిగినపుడు అతనిని వైద్యుని వద్దకు తీసుకుని వెళ్ళవలసి వచ్చింది. అప్పటికి వైద్యశాస్త్రంలో బాధ తెలియకుండా ఉండడానికి అవసరమైన ఔషధాలు, ప్రక్రియలు సాధనాలు అంతగా లేకపోవటంవలన తన స్నేహితుడు విపరీతంగా బాధ పడవలసి వచ్చింది. ఆ భాధతోనే చికిత్స చేయించుకోవలసి వచ్చింది. ఇది చూసిన బ్రయిడ్‌కి బాధ తెలియకుండా ఉండే ప్రక్రియ ఏదైనా ఉండి ఉంటే ఎంత బాగుండును అనిపించింది. ఆ స్పందనే "హిప్నాటిజం" ఆవిర్భవించడానికి దారితీసింది. "హిప్నో" అనే గ్రీకు మాటనుంచి వచ్చినది హిప్నాటిజం. హిప్నో అంటె నిద్ర అని అర్థము. ఈ విద్యను కనిపెట్టి పేరును పెట్టి, ఒక గుర్తింపు ప్రచారము తీసుకు వచ్చిన డాక్టర్ బ్రయిడ్ చిరస్మరణీయుడు.

అంతవరకు బహుళప్రాచుర్యం పొందిన "మెస్మరిజం" సిద్ధాంతాలతో డాక్టర్ బ్రయిడ్ ఏకీభవించినా, సత్వర ఫలితాలు పొందటానికి హిప్నాటిజమే సరియైన విధానము అని ప్రకటించి తాను స్వయంగా తన రోగులపై ప్రదర్శించి చూపాడు. డాక్టర్ మెస్మర్ కనిపెట్టిన మెస్మరిజంలో అయస్కాంతములు ఉపయోగించి రోగులకు స్వస్థత చేకూర్చేవారు. అయస్కాంతములతో పాటు స్పర్శతో కూడ రోగులకు ఉపశమనం కలిగించేవారు మెస్మరిజం సిద్ధాంతాలప్రకారం ప్రతీ మనిషిలోను కొన్ని అయస్కాంత శక్తులున్నాయని, అవి ఎదుటవారి మీద ప్రభావాన్ని చూపుతాయనీ, ఆ శక్తితోనే వారికి స్వస్థత కలిగించవచ్చని అంటారు. అయితే ఆ వ్యక్తికి, తన స్పర్శతో తప్పక నయమవుతుందనే గాఢమైన విశ్వాసము కూడ ఉండి తీరాలంటారు.

డాక్టర్ బ్రయిడ్ అయస్కాంతములు, స్పర్శలు అవసరం లేకుండా కేవలం మృదువైన మాటలతో బుజ్జగిస్తూ, ఒక మనిషిని నిద్రావస్థలాంటి స్థితికి పంపి, అతనికి ఉన్న వ్యాధులను నివారించవచ్చునని బుజువు చేసి చూపారు. అంతేకాక ఆ స్థితిలో శస్త్రచికిత్సలను కూడ చేసి రోగికి ఎటువంటి బాధా తెలియకుండా చేయవచ్చని బుజువు చేసి చూపాడు.




మొదట్లో హిప్నాటిజంతో చేసే వైద్యం హిప్నోథెరపీకి ప్రజల నుంచి అనుకున్నంత ప్రోత్సాహం లభించలేదు. తనను ఎంతో అభిమానించే తన పేషెంట్లు సైతం ఈ హిప్నాటిజం ఏదో భూత ప్రేత పిశాచాలుకు సంబంధించిన క్షుద్ర విద్య అని భావించి ఆవిద్యను వదిలి వేయమని ఎంతో ప్రాధేయ పడా వారందరికీ ఎంతో నచ్చచెప్పి వారికి జబ్బులను ఈ విద్యతో ఎటువంటి బాధలేకుండా నయం చేస్తానని, పైగా డబ్బుకూడ ఇవ్వనవసరములేదని, మందులే కావాలి అంటే తనడిగినంత డబ్బు ఇవ్వాలని చెప్పి, ఆర్థికంగా ఎంతో నష్టపోయినా, హిప్నాటిజం వ్యాప్తికి, ప్రచారానికి ఎంతో కృషి చేసాడు. నత్తి, నిద్రలేమితనం, నిద్రలోనడవటం, హిస్టీరియా, ఆస్మ, ప్రారంభ దశలో ఉన్న క్యాన్సరు, పంటికి సంబంధించిన వ్యాధులు, అతితాగుడు, వ్యభిచారం, భయాలు, డిప్రెషన్స్, ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ లాంటివి అతిసునాయాసంగా నయం చేసి డాక్టర్ బ్రయిడ్ హిప్నాటిజంలో ఉపశమనం కలిగించే శక్తి ఉందనీ, హిప్నోథెరపీ ఉత్తమ చికిత్స అని ప్రజలలో నమ్మకం కలిగించారు.

హిప్నాటిజం అంటే మాయలు మంత్రాలుకి సంబంధించిన విద్యకాదు. అభ్యాసం చేస్తే ఎవరైనా హిప్నాటిజం చేయగలరు. విశ్వాసం ఉంటే ఎవరైన హిప్నటైజ్ అవగలరు అంటారు డాక్టర్ బ్రయిడ్. ప్రజలలో 95 శాతం మంది హిప్నాటిజంకు లోనవుతారని, వారిలో 35 శాతం లైట్‌స్టేజి లోను, 35 శాతం డీప్‌స్టేజిలోను, 20 మంది మరీ డీప్‌లోకి వెళ్ళడానికి అవకాశం ఉందని అంటారాయన. మగిలిన ఐదు శాతం మందినీ హిప్నటైజ్ చెయ్యలేక పోవటం హిప్నాటిస్ట్ అసమర్థతకాదు. వారు సహకరించని వారు, లేదా పిచ్చివారు అయి ఉంటారు. ఒక వ్యక్తి హిప్నటైజ్ అవుదామనే సంకల్పం ఉన్నపుడు వారు హిప్నాటిస్ట్ చెప్పే ప్రతీమాటను జాగ్రత్తగా వింటూ అతను చెప్పిన రీతిలో ఊహించుకోవాలి. అంటే మీ కనురెప్పలు మెల్లగా బరువెక్కుతున్నాయి. మీరు మెల్లగా నిద్రలోకి జారుకుంటున్నారు. మీ శరీరం మెల్లి మెల్లిగా బరువెక్కడం ప్రారంభించింది. నిద్ర అంతకంతకూ ఎక్కువవుతుంది అని అంటున్నపుడు, అలాగే ఊహించు కుంటూ ఉంటే అయిదునిమిషాల్లో ఆవ్యక్తిని ప్రశాంతమైన

# సంపూర్ణ ఆరోగ్యానికి-సంతృప్తికర మైన భోజనానికి

**1**



**A. S.** బ్రాండ్ పప్పునూనె మరియు మాన్షన్ బ్రాండు నువ్వులనూనెతో తయారయ్యే వంటకాలతో మీరు ఎన్నడూ చేయనంత సంతృప్తిగా భోజనం చేస్తారు. వంటకాల్లో వచ్చే రుచి, కమ్మదనం అద్వితీయం.

**2**



అన్నిరకాల ఊరగాయలను సంవత్సర పొడువునా మెత్తబడనీయకుండ, రుచికరంగా, ఘుమఘుమలాడుతూ, తాజాగా ఉంచుతుంది.

**3**



గుండెపోటు, రక్తపోటు అరికట్టడంలో గొప్పగా సహాయపడుతుంది.

**16, 4, 2** కేజీల డబ్బాలలో ఇండియన్ గవర్నమెంట్ వారి అగ్‌మార్కు సీలుతో లభించును.






SAIKRUPA/ASC/83

అంబటి సుబ్బన్న అండ్ కో. సామర్లకోట . A.P.

## అద్భుత వ్యక్తులు

మగత నిద్రలాంటి స్థితికి పంపవచ్చని ఆయన అభిప్రాయం.

ఆ రోజుల్లో హిప్నాటిజంకి ఎంత మంచి ప్రచారం చేసినా కొంత మంది ప్రజలలో కొన్ని అపనమ్మకాలు ఉండేవి. కేవలం మానసికంగా బలహీనంగా ఉన్నవారు మాత్రమే హిప్నటైజ్ అవుతారనీ, అలాంటి స్థితికి వెళ్ళినపుడు వారిచేత చెడు పనులు చేయిస్తారనీ, ఒకసారి హిప్నటైజ్ అయితే చాలు ఎప్పటికీ, హిప్నటిస్ట్‌కి లొంగిపోయి ఎప్పుడు "స్లీప్" అంటే అపుడు నిద్రలోకి జారు కుంటారు. కాబట్టి అసలు హిప్నాటిజం జోలికి పోవద్దనే దుష్ప్రచారం కూడ సాగింది.

డాక్టర్ బ్రెయిడ్, వారి అనుమానాలకు సమాధానం చెప్తూ "మానసికంగా బలహీనంగా ఉన్నవాళ్ళను అసలు హిప్నటైజ్ చెయ్యటం కష్టం, కారణమేమంటే ఈస్థితి పొందడానికి ముఖ్యంగా కావలసినది చక్కని ఊహాశక్తి. అది వీరిలో లోపించి ఉంటుంది. కాబట్టి వారిని హిప్నటైజ్ చెయ్యటం కష్టం. తరువాత హిప్నటైజ్ అయిన వారిచేత చెడ పనులు చేయించడం అనేది హాస్యాస్పదమైన విమర్శ. హిప్నటైజ్ అయినా సరే, ఆ వ్యక్తి తన ఇష్టానికి వ్యతిరేకంగా ఉన్న ఏ పని చెప్పినా చేయడు. తనకు నచ్చిన పనులే చేస్తాడు. ఇకపోతే హిప్నటైజ్ అయిన వ్యక్తి ఎప్పటికీ లొంగి ఉంటాడనేది కేవలం అపోహ మాత్రమే. ఎన్ని సార్లు హిప్నటైజ్ అయినాసరే, ఆ వ్యక్తి కిష్టంలేని సమయంలో, నిద్రలోకి పంపుదామనే ప్రయత్నం చేసినా అతను నిద్రపోడు" అని స్పష్టంచేసి ఈ విద్యాభివృద్ధికి అహర్నిశలు పాటుపడ్డాడు.

బ్రయిడ్ లాగనే, డాక్టర్ ఇలియట్‌సన్, డాక్టర్ లీబాల్ట్, ప్రొఫెసర్ చార్కాట్, ప్రముఖ సైకాలజిస్ట్ డాక్టర్ ఫ్రాయిడ్, ఈ విద్యకు ఎంతో గుర్తింపు తీసుకువచ్చారు. అనంతరం ఈ విద్యను వినోదం కొరకు స్టేజి మీదకూడా కొందరు ప్రదర్శించారు. ఇపుడు కూడా ప్రదర్శిస్తున్నారు. కొన్ని దేశాలలో మాత్రం స్టేజి హిప్నాటిజం ప్రదర్శనలు నిషేధించారు.

భారతదేశంలో తప్ప, అభివృద్ధి చెందిన దాదాపు అన్ని దేశాలలోనూ ఈ శాస్త్రాన్ని వైద్య రంగంలో గుర్తించి ఎన్నో ఫలితాలను పొందుతున్నారు. మనదేశంలో కూడా ఈ శాస్త్రాన్ని గుర్తించడానికి వైద్యరంగంలోని ప్రముఖులు తగు చర్యలు తీసుకుంటే దేశంలో ఉన్న దాదాపు సగంమంది రోగులకు మందులు లేకుండా స్వస్థత కలిగించవచ్చు.

బి. వి. పట్టాభిరామ్
మెజీషియన్–హిప్నాటిస్టు

[పైవారం: పి.సి. సర్కార్]

# ఓ పెళ్ళి కథ



## రాంపల్లి వసుంధర

పెళ్ళి పందిరి ముందు టాక్సీ ఆగింది.

"పెళ్ళివారు వచ్చేసారు ! మగపెళ్ళివారు వచ్చేసారు !" ఒక్కసారిగ పెళ్ళింట్లో కలకలం !

లోపల పనులు పురమాయిస్తూన్న మీనాక్షి హడావుడిగ బయటికి వచ్చింది. అప్పటికే రాఘవ రావు వినయంగ టాక్సీ డోర్ తీసి పట్టుకోగా 'మగపెళ్ళివారు' టాక్సీ దిగారు.

"రండి వదినగారూ! ప్రయాణం కులాసాగా జరిగిందా ?" అంటూ ఎదురెళ్ళి ఆహ్వానించింది మీనాక్షి.

"ఏం ప్రయాణమో ! వళ్ళు హూనం అయిపోయింది ! స్నానానికి వేణ్ణీళ్ళున్నాయా ?" అధికారిలా దర్పంగా ప్రశ్నించిది పెళ్ళికొడుకు తల్లి జగదాంబ.

"స్నానానికి వేణ్ణీళ్ళు, కాఫీ, టిఫిన్ అన్నీ సిద్ధంగా వున్నాయి వదినగారూ !" 'చిత్తం ! సిద్ధం' అన్నట్టుగా జవాబు చెప్పింది మీనాక్షి.

విడిదిగా ఏర్పాటు చేసిన మేడ పైభాగం మీదికి చేరుకొన్నారు మగపెళ్ళి వారంతా !

'ఫలహారాలు పంపమంటారా?' అని అడిగిన నాలుగుసార్లు 'ఇప్పుడే వద్దు', 'తొందర లేదు' అన్న పెళ్ళివారు — "ఇంకా ఎంతాలస్యం ఫలహారాలు పంపడానికి ? త్వరగా పంపమనండి. ప్రయాణంలో అంతా నీర్సపడిపోయారు." అంటూ గొడవ ప్రారంభించారు.

సరిగ్గా మూడో నిముషంలో వుప్మాగిన్నె, ఆకులు పైకి వెళ్ళాయి.

"హుఁ ! ఈ ఆకులేమిటి ? ప్లేటులో పెట్టమను !" పెళ్ళికూతురుకి కాబోయే ఆడపడుచు నీలుగు.

"వున్నంత వరకూ పంపిస్తాను. కావలసిన వాళ్ళు వాటిల్లో తిని, కాస్త మిగతా వాళ్ళు సర్దుకోండి తల్లీ !" ప్రాధేయపడుతూ పళ్ళేల కోసం కబురు పెట్టాడు రాఘవరావు.

"పెళ్ళిలో కాకపోతే ఇంకెప్పుడు చేస్తారు మాకు మర్యాదలు" పెళ్ళికొడుకు, అతని తమ్ముళ్ళు పళ్ళేల్లో తింటూనే సణుక్కోసాగారు.

సింగారం పూర్తిచేసుకు వచ్చిన జగదాంబకి వుప్మా ప్లేటు స్వయంగా అందించింది మీనాక్షి. అటు ఇటు కెలికి, "ఇదేం చేత ? జీడిపప్పు వెయ్యాలని తెలియదూ ?" అని దీర్ఘం తీసింది.

"అయ్యో ! వేయించాను వదినగారు ! లోపలుంటాయి" నమ్రతగా చెప్పింది మీనాక్షి.

"ఏవీ ? నాలుగంటె నాలుగ బద్దలా ? చూడగానే అలా గుప్పెడు బద్దలు కనిపించాలి గానీ !... అబ్బెబ్బె ! ఏదో మొక్కుబడిలాగ..."

ఈలోగా మరికాస్త 'తినండి' అంటూ మీనాక్షి మరో రెండుసార్లు వెయ్యడం, జగదాంబ తినడం అయిపోయింది.

అందిస్తోన్న గ్లాసు అందుకోకుండానే "ఏమిటి ? నెస్సేనా ?" స్టైల్‌గా అడిగాడు పెళ్ళికొడుకు తమ్ముడు. కాసేపు అయోమయంగా చూసి, "నెస్‌కాఫీ కాదుగానీ బాబూ ! దగ్గరుండి చేయించి మరీ తెచ్చాను కాఫీపొడి. చాలా బావుంటుంది..." ఇంకా ఏమో చెప్పబోతూండ గానే,

"అమ్మా ! 'నెస్' కాదుటే !" గారంగా అన్నాడు.

"ఈ రోజుల్లో అంతా నెస్సుకాఫీలేగా తాగేదీ ! ఆమాత్రం తెలియదూ ?" దీర్ఘం తీసింది జగదాంబ.

"అమ్మా ! పొరబాటయింది. కాఫీ కలిపేసారు కాబట్టి ప్రస్తుతానికి తాగేయండి. ఒక్క అరగంటలో బజారు పంపించి, డబ్బాలు తెప్పించి కలిపి మళ్ళా పంపిస్తాను కాఫీలు. ఏం తల్లీ !" ప్రాధేయపడ్డాడు రాఘవరావు.

"ఏమిటీ ? ఇంకా బజారు పంపాలా ? బాగుంది ? మగపెళ్ళివారికి కూడా అన్నీ అందరితోబాటు ఇస్తారా ? ఆమాత్రం ప్రత్యేకత చూపించాలని తెలియదూ ?"

గంట తర్వాత మగపెళ్ళివారంతా నెస్‌కాఫీలు తాగేరన్న మాట వినేదాకా మనసు కుదుటపడ లేదు మీనాక్షి, రాఘవరావులకి.

"వంటలేం చేయిస్తున్నారు ?" ఠీవిగా అడిగింది పెళ్ళికొడుకు పినతల్లి.

"పప్పులో దోసకాయలు వేయమన్నాను, పుల్లికారం పెట్టి వంకాయ ఆవ పెట్టి పనస పొట్టు కూర, గుమ్మడికాయి పులుసు, రసం, వడియాలు, అప్పడాలు, ఆవకాయ అదీ వూర గాయలన్నీ వున్నాయనుకోండి. పెళ్లి అయ్యాక చెయ్యలిట కదా బూరెలు. అందుకని బూర్లు, పులిహోర రేపు చేయిస్తాం ! ఆ వేళ మిఠాయి, బజ్జీలు చేయిస్తున్నాము భోజనంలోకి."

ఒక పని చేయండి ! మావాళ్లు వంకాయ తినరు, అది మానేసి ఇప్పుడు బజార్లో కాలీ ఫ్లవర్సు వస్తున్నాయి ! అవి తెప్పించి బంగాళా దుంపలు, బీన్సు, పచ్చి బఠానీలు కలిపి కొబ్బరి వేసి వొండుతే చక్కగా వుంటుంది. దర్జాగా కూడా వుంటుంది. లడ్డూలు అలా వుంచి, సేమియా పాయసం చెయ్యండి. తొందరగా అవుతుంది. మొన్నో పెళ్లిలో చూసాను సేమియా పాయసం చేసి గాజు గ్లాసుల్లో పోసి విస్తరి

పక్కన పెడితే ఎంత నిండుగా వుందను కున్నారూ ? ... ''

అయోమయంగా వింటోంది మీనాక్షి

''పైన ఫేనుందా ? కాస్సేపు నిద్రపోవాలి. బడలికగా వుంది; ఆపసోపాలు పడుతూ ఆవిడ పైకెళ్లిపోయింది.

అప్పుడే అటు వచ్చిన రాఘవరావు, ''విన్నావా ? మీనాక్షీ ! వాళ్ల స్నాతకానికి కూడా అన్నీ మనమే ఏర్పాటు చెయ్యాలిట ! అన్నాడు.

''ముందు అనుకోలేదు కదా ! ఇప్పుడెలా ఏర్పాటు చేస్తాం ? '' తెల్లబోతూ అడిగింది మీనాక్షి.

''ఎవరి పెళ్లిలోనో ఎవరో అలా చేసారుట ! అందుకని ఇపుడు వీళ్లు కూడా అలానే చెయ్యాలనుకుంటున్నారుట ! ఏం చెప్పనూ ? '' వ్యధగా అన్నాడు.

''ఇప్పుడు వనం చేయిస్తోన్న వంటల్లో కొన్ని మార్పులు చేసి వెళ్లారు'' నిట్టూరుస్తూ అంది.

''ఫర్వాలేదు. చెప్పు. ఎలాగోలాగ సర్దుదాం! ఇంతవరకు వచ్చాక ఏం చేస్తాం ? వాళ్లేది కావాలంటె అది జరిపించాల్సిందే ! తప్పదు'' విషయం చెప్పింది మీనాక్షి.

''తెప్పిద్దాంలె ! నువ్వు ఖంగారుపడకు''

''ఏం తెప్పిస్తారు ? బజారు నుంచి కూరలు, పళ్లు అయితే తెప్పించవచ్చు ! ముందుగా ఏర్పాటు చేసుకోకుండా అన్నీ పాలెలా దొరుకుతాయి ?

''అదీ నిజమే ! సరె ! నే చెప్తాలె ! రాత్రికి చేయిద్దాం ! మిగిలినవి తెప్పిస్తాను. అవి చేయించు ! లే ! లేచి, పనులెందాకా వచ్చాయో చూడు ! అక్కడ స్నాతకానికి ఏం కావాలో అడుగు'' భార్యకి ధైర్యాన్నిచ్చి లేవుతూంటే, సరిగ్గా అపుడే వచ్చిందో ముసలావిడ.

''తీరుబడిగా భార్యాభర్తలిద్దరూ కూర్చుని కబుర్లాడుకుంటున్నారా ? అవతల వాళ్ళు పిలుస్తూంటేనూ ... ''

''వస్తున్నా మామ్మగారూ !'' అంటూ, ''మీరు వెంటనే బజారుకి పంపండి'' అని భర్తని హెచ్చరించి మరీ వెళ్ళింది మీనాక్షి.

వియ్యపురాలు ఎదురై ''బ్రాహ్మ వొస్తున్నాడా ?'' అని అడిగింది.

''ఆఁ ఇందాకే కబురెట్టారు. వస్తూ వుంటారు ఈపాటికి.''

''ఈలోపున మాకు పసుపు, కుంకం, బియ్యం, పళ్ళు ... '' ఆవిడ లిస్టు చదువుతూంటే,

''ఆ కాయితం ఇలా ఇవ్వండి ! అన్నీ క్షణంలో పంపిస్తాను'' అని వియ్యపురాలి చేతిలో చీటీ తీసుకుంది మీనాక్షి.

పెళ్ళికూతురు మేనత్త రాజేశ్వరి తెచ్చిన సామాన్లు చూసి, ''మరి కాసిని తమలపాకులు, అరటిపళ్ళు పంపించండి'' అంది జగదాంబ.

''అలాగే'' అని, పళ్ళెంనిండా ఆకులు, వక్కలు, పళ్ళుపెట్టి మళ్ళీ అందించింది రాజేశ్వరి.

స్నాతకం మొదలెట్టిన లగాయతు ''అది చాల్లేదు. ఇవి చాల్లేదు'' అంటూ ఒకటికి నాలుగుసార్లు ఏదో ఒకటి పట్టుకు వెళ్తూనే వున్నారు మగపెళ్ళివారి తాలూకువాళ్ళు.

పెళ్ళికి తెచ్చిన సామాన్లు సగం అయ్యేటప్పటికి స్నాతకం పూర్తయింది. స్నాతకం మధ్యలోనే ఓసారి వంటలని పర్యవేక్షించింది మీనాక్షి.

''ఇదిగో అమ్మా! అంతా అయిపోయినట్టే! వడ్డనలు మొదలుపెట్టవచ్చు'' అన్నారు వంటవాళ్ళు. ముందు అనుకున్నట్టుగా అయితే అంతా అయిపోయినట్టేగాని, ఆ కాలీఫ్లవర్సు కూర మాత్రం మిగిలిపోయిందిప్పుడు జరిగిన మార్పుల వల్ల.

''అన్నట్టు ప్రొద్దుటనగా, బజారు వెళ్ళిన మనుష్యుల జాడేలేదు. ఇంకా రారేం చెప్మా ?'' అనుకుని కంగారు పడ్తూంటే మేనల్లుడు ఎదురుపడ్డాడు పెద్ద బుట్టతో

''హమయ్య ! ఏరా ! ఇంతసేపయింది ? విశ్వం ఏడీ ?'' అంది స్థిమితపడ్డ మనసుతో.

''ముందు ఆపిల్సు తీసుకుని నన్ను వెళ్లమన్నాడత్తయ్యా !...''

''ఇప్పుడు ఆపిల్స్ ఎవరికి ?''

''మగ పెళ్ళివారికి భోజనం చెయ్యగానే ఆపిల్స్ తినడం అలవాటుట.'' మార్కెట్లో కాలీ ఫ్లవర్స్ లేవు. అయిపోయాయి. ఇంకెక్కడన్నా దొరుకుతాయేమో చూస్తాను. ముందు నువ్వెళ్ళిపో ! మళ్ళీ వీటికి ఆలశ్యం అవుతుంది. అని నన్ను పంపించేశాడు విశ్వం !'' మేనల్లుడి మాటలకి గుండెల్లో రాయిపడింది మీనాక్షికి. ఇంతలో ఎవరో వచ్చి, 'మగ పెళ్ళివారి బంధువులొచ్చారు. టిఫిన్లు, కాఫీలు పంపించమంటున్నారు' అన్నారు.

అప్పటికే పన్నెండయింది. ఇప్పుడు మళ్ళీ టిఫెన్లా ? అపుడె రెండుసార్లు ఉప్మా, నాలుగు సార్లు కాఫీలు చేయించారు. 'సరే? తప్పేదేముంది ?' అని మీనాక్షి వంటవాళ్ళకి పురమాయించింది.

''ఇంకేం ఆలస్యం ? వాళ్ళని భోజనాలకి పిలుద్దాం రా !'' అన్నాడు రాఘవరావు.

''కాలీ ఫ్లవర్సుకని పంపించిన అబ్బాయి ఇంకా రాలేదు. ఏం చేద్దాం ?''

''ఇప్పుడె ఆ కూర కావాలంటే మరి కాసేపు ఆగుతారో లేక వద్దని వచ్చేస్తారో వాళ్ళనే అడుగుదాం పద!'' అన్నాడు రాఘవరావు ఆడబడుచుని, తోడికోడళ్ళి వెంట తీసుకుని, కుంకంబరిణతో అనుసరించింది మీనాక్షి.

ముందు గదిలో వియ్యంకుడు కనిపించాడు. ''బావగారూ ! మీ పనంతా అయినట్లేనా ? ఇక భోజనానికి లేస్తారా ?'' అంటూ మొదట రాఘవరావు కదిపాడు.

''ఏమేవ్ ! భోజనాలకి ఆలస్యం వుందా మీకు ?'' లోపలికి వినిపించేలా కేక పెట్టాడు వియ్యంకుడు.

''మాకేం ఆలస్యం లేదు.''

మర్యాదకోసం వియ్యంకుడితో చెప్పాడు రాఘవరావు, ''వుదయం మీ ఆడవాళ్ళు సేమియా పాయసం, కాలీ ఫ్లవర్సు కూర చేయించమని చెప్పారుట ! కాలీఫ్లవర్స్ ఇంతవరకు రాలేదు. పాలు ముందుగా ఏర్పాటు చేసుకుంటేనే గాని దొరకవు. రాత్రికి చేయిస్తాము''...

''అలాగే లెండి !...'' భర్త మాటలు పూర్తి కాకుండానే అప్పటిదాకా తలుపు వెనకాల నుంచుని వింటూన్న జగదాంబ ఆడ పులిలా ముందుకు వచ్చింది.

''ఏమిటి మేం చెప్పిన దాంట్లో ఒక్కటే చేయించలేదు. కాని మేము భోజనాలకి రావాలా ? మేం రాం '' ఖచ్చితంగా చెప్పింది.

మీనాక్షి ముందుకు వచ్చి, ''అలా అనకండొదినగారు ! దొరక్కగాని, చేయించడానికి మాకేమి అభ్యంతరం వుంటుంది చెప్పండి ? వాటికోసమే కుర్రాడు ఇంకా ఇల్లు చేరకుండా ఈ ఎండలో ఎక్కడెక్కడో తిరుగుతున్నాడు. మీరు కాస్త పరిస్థితి అర్థం చేసుకుని దయ చూపాలి ...''

''చాల్లేవమ్మా ! మేమేమన్నా బంగారం

## వంటపుస్తకాల రాణి!

పశ్చిమ జర్మనీ పుస్తక ప్రపంచంలో శ్రీమతి రోస్వితాహ్యైన్‌కు ఒక ప్రత్యేక స్థానమున్నది. ఆమె యింతవరకు వంటల గురించి 399 పుస్తకాలు వ్రాశారు. ఆమె వ్రాసిన 400వ పుస్తకం త్వరలో వెలువడ నున్నది. ఆమె వ్రాసిన పుస్తకాలు అన్నీ కలసి 30 కోట్ల ప్రతులు అమ్ముడుపోయాయి ! వాటిలో 300 పుస్తకాలు పునర్ముద్రణలను పొందుతున్నాయి. వంటల పుస్తకాలు వంటింటి సామ్రాజ్యంలో విప్లవాలను రేకెత్తించడానికి కాదని ఆమె అభిప్రాయం. అందువలన, ప్రజల అవసరాలకు అనుగుణంగా ఆమె పుస్తకాలను రాశారు. సమీకృతాహారం ఆరోగ్యకరమైన వంటల గురించి కొన్ని పుస్తకాలు వ్రాశారు. మూత్రపిండాల వ్యాధివలన, గుండెజబ్బుల వలన బాధ పడుతున్న వారికోసం ప్రత్యేకంగా కొన్ని వంటల పుస్తకాలను ఆమె రాశారు.

# ఆప్కో అల్లికే అల్లిక
# సుందర స్వప్నాల వేదిక

కాలానుగుణ్యంగా రంగుల కలలను కలిపి నేసిన
ఆప్కో చేనేతలు మీ పరిసర వస్త్ర ప్రపంచాన్ని
ఉత్తేజపరుస్తాయి.

- షర్టింగులు
- డ్రస్ మెటీరియల్స్
- చీరలు
- తయారీ వస్త్రాలు
- గృహోపకరణ వస్త్రాలు

ఆప్కో చేనేతలు




ది ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్స్
కోపరేటివ్ సొసైటి లిమిటెడ్
హైదరాబాద్-500 029.

KIRON/APCO/841/G

ంటామన్నామా? వెండి ఆకుల్లో పెట్టమన్నామా? బజార్లో దొరికే వస్తువుకు ... కనీసం పెళ్ళిలో అయినా... అందునా మగపెళ్ళివారు స్వయంగా కోరిన మీదట పీనాసితనం చూపెట్టకూడదు!"

"అలా అనకండొదినగారు! అసలు దేనికీ డబ్బు గురించి ఆలోచించడం లేదు. వేళమించిపోయి బజార్లో సరుకు దొరక్కగాని, అక్కడికీ ఆపిల్ పళ్ళ ధర మీకు తెలిసే వుంటుంది. అయినా క్షణం చెప్పించాం ..."

"ఎవరికోసం? మీ మర్యాద మీరు కాపాడుకోవాలిగాని", వాళ్ళిద్దర్నీ అలా వదలి రాఘవరావు పెళ్ళికొడుకుని పట్టుకున్నాడు. "బాబూ! నువ్వయినా చెప్పు మా పొరబాటు ఎంతవుందో?"

"నాదేం వుందండి! మా అమ్మకి నచ్చచెప్పండి" తెలివిగా తప్పించుకున్నాడు.

గంటన్నర బ్రతిమాలి 'ఇవి చేతులు కావు' అని చేతులే పట్టుకుని నచ్చచెప్పి వప్పించేసరికి కల్ప్రాణం [తోక లేదు కనుక] కాలి వేళ్ళల్లోకి వచ్చింది. జరిగిన పొరబాటుకి పరిహారంగా వియ్యపురాలికి అదనంగా మరో పట్టుచీర లంచంగా అనుకున్నా సరే!] పెట్టేలా ఒప్పందం జరిగి మగపెళ్ళివారంతా భోజనాలకి తరలి వచ్చారు!

మీనాక్షి, రాఘవరావు చెరో రెండు లీటర్ల మంచినీళ్ళు త్రాగి వడ్డన కార్యక్రమాల్లోకి దిగారు!

వాళ్ళు వీళ్ళు కలిపి ఐదొందలు పైనే అయ్యారు! "మా వైపు రెండొందల మంది వస్తామని చెప్పి మూడొందల దాకా వచ్చారు మగపెళ్ళివారు!" ముందే జాగ్రత్తపడి మాట దక్కించుకున్నారు రాఘవరావు దంపతులు.

ఎంగిలి విస్తళ్ళు తీస్తూంటే అటుగా వచ్చిన రాఘవరావు చూసి ఆశ్చర్యపోయాడు. మగపెళ్ళివారు కూర్చున్న పంక్తిలో ప్రతి విస్తరి కిందా నాలుగు, ఐదు, ఆరు చొప్పున లడ్డూలు, బజ్జీలు, కూరలు కళ్ళు తిరిగినంత పనయింది రాఘవరావుకి. ఇంతలో మీనాక్షి వచ్చి, 'చూసారా వాళ్ళపని ... ' అంది.

"ఏమిటి?"

"రెండు రోజులకి సరిపడా కొబ్బరికాయలు, అరటిపళ్ళ గెలలు, నాలుగు బుట్టలు తమలపాకులు తెప్పించి పెడితే ఒక్క ఆకుగాని, ఒక్క పండుగాని మిగలలేదు."

"ఏమయ్యాయి?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏమవుతాయి? పిల్లెత్తుకు పోతుందా? స్నాతకం మొదలుపెట్టిన లగాయితు 'ఇవి చాలవు అవి చాలవు' అంటూ అడిగినవాళ్ళు అడిగినట్లున్నారు. ప్రాణం విసుగెత్తి, 'ఇదిగో అన్నీ ఇక్కడే వున్నాయి. మీక్కావలసినన్ని పట్టుకెళ్ళండి' అన్నాను. ఇప్పుడు భోజనాలు అయ్యాక వాళ్ళకి తాంబూలాలివ్వాలని మా చెల్లాయి వచ్చి,

# ఓ పెళ్ళి కథ

అక్కడ ఆకులు, పళ్ళు లేవంటే వెళ్ళి చూస్తే ఇదీ సంగతి! ముందెవరినైనా పంపించి తెప్పించండి."

"అలాగే" అన్నాడు రాఘవరావు నీర్సంగా.

మధ్యాహ్నం ఫలహారాలప్పుడు లడ్డూలు వద్దంటే, అప్పటికప్పుడు మైసూర్ పాక్ చేయించి పంపించారు! మనిషికో రకం (,) కాఫీ, టీ, బోర్నవిటా. ఇక పిల్లల సంగతి చెప్పనక్కరలేదు. ఈ తతంగం పూర్తయ్యేసరికి రాత్రి పెళ్ళికి హడావుడి మొదలయ్యింది.

రాత్రి పదకొండు గంటలకి ముహూర్తం! పెళ్ళికూతురుకి, పెళ్ళికొడుక్కి మంగళస్నానాలు చేయించారు. పెళ్ళికూతుర్ని 'గౌరీ పూజకి' కూర్చోపెట్టారు.

అప్పటికి వుదయం కాలీఫ్లవర్కి వెళ్ళిన మనిషి వచ్చాడు. తిండీ తిప్పలు లేకుండా తిరిగాడేమో వడలిన తోటకూర కాడలా వేలాడిపోతున్నాడు. తల్లితో 'దొరకలేదు' అనే మాట చెప్పి, మజ్జిగ తేట తాగి, స్టోర్‌రూంలో మంచం మీదపడ్డాడు.

ఈసారి మీనాక్షికి గుండెల్లోంచి రైళ్ళు పరిగెడుతున్నట్టుగా వుంది. కన్న కొడుకు పెళ్ళింట్లో భోజనం అన్నా చెయ్యకుండా, ఎండలో తిరిగి తిరిగి వచ్చి అలా పడిపోవడం చూసి గుండె కలుక్కుమన్నా కొడుక్కి వుపచారాలకన్నా ముఖ్యమైన పనిలా ఈ విషయం భర్తతో చెప్పడానికి వెళ్ళిపోయింది.

చాలా కష్టంమీద సంపాదించిన పాలతో అందరికీ సరిపడా పాయసం కాదు. ఓ వంద మందికి సరిపోవచ్చునేమో! రాత్రికి మాట దక్కేలా లేదు. 'ఎలా? ఏం చెయ్యాలా?' అని సతమతమవుతున్న రాఘవరావు భార్య తెచ్చిన కబురుతో హతాశుడయ్యాడు. భార్యాభర్త లిద్దరికీ మెదడు మొద్దుబారి పోయింది. బాహ్య ప్రపంచం అంతా మర్చిపోయి కళ్ళక పాల సముద్రాలు, కాలీ ఫ్లవర్స్ తోటలూ కనిపిస్తూంటే, 'అవి ఎలా సంపాదించాలా?' అవి కాసేపు, కాని పక్షంలో వియ్యాల వారి వెలా సమాధానపరచాలా?' అని కొంతసేపు, ఆలోచిస్తూ వుండిపోయారు.

వాళ్ళిద్దరూ అలా వుండగానే. రాత్రి ఏడు గంటల వేళ మగ పెళ్ళివారు తాలూకు కొంద రాడవాళ్ళు, "చిన్న పిల్లలకు అన్నాలు పెట్టేయండి. నిద్రపోతారు" అంటూ రావడం జరిగింది.

రాత్రి భోజనం కూడా కాలీ ఫ్లవర్స్ వండలేదని, పాయసం చెయ్యలేదనేవార్త క్షణంలో వియ్యాలవారిని చేరుకుంది. జగదాంబ స్వయంగా వచ్చి చూసింది; కాలీఫ్లవర్సు లేవు. నిద్రపోతూన్న విశ్వాన్ని చూసింది.

పెళ్ళి మంటపం వద్ద ఏదో అమర్చుతూన్న మీనాక్షి వద్ద కెళ్ళింది;

"రాత్రికి కాలీ ఫ్లవర్సు చేయిస్తామని 'మాట ఇచ్చారుగా! ఎందుకు చేయించలేదు?" హూంకరించింది.

"దొరక లేదొదినగారు!" చేతులు నలుపుకుంటూ చెప్పింది మీనాక్షి.

"పాయసం?" వివరాలు పూర్తిగా తెల్సుకోవాలన్నట్లు అడిగింది.

"పాలు కొద్దిగానే దొరికాయట! మీలో ముఖ్యులకి ఓ వందమంది దాకా వడ్డిద్దా..."

"ఏమిటీ? కొందరికే వడ్డిస్తారా? ఇదేం మర్యాదా? ఆడపిల్ల విచ్చుకునే వాళ్ళకింత నిర్లక్ష్యమా? మగపెళ్ళి వాళ్ళమా? మజాకానా? చూపిస్తా మా తడాఖా ఏమిటో" అంటూ పెళ్ళి మండపం ముందు నిల్చున చిందులేయ సాగింది.

వాళ్ల వీళ్ల నలుగురూ పోగడ్డారు. వాళ్ల ప్రయత్నాలు ఫలించని కారణం చెప్పి, మన్నించమని వేడుకున్నారు.

"అవన్నీ వినను పొమ్మంది" జగదాంబ.

"మీ కాళ్ళ పట్టుకుంటాం" అన్నారు.

"వీల్లేదు కాలీఫ్లవర్సే వ్వటండి" అంది.

ఆడపిల్ల వైపు వచ్చిన బంధువులంతా మగ పెళ్ళి వారికి, వారి బంధువులకి నచ్చచెప్పడానికి నానా తంటాలూ పడుతున్నారు.

"ఈ పూట కాలీఫ్లవర్సు కూర, పాయసం లేందే మేము భోజనాలు చెయ్యంగాక చెయ్యమని" డిక్లేర్ చేసింది జగదాంబ.

"దొరకని వాటికి మేమేం చెయ్యం?" అని తల బాదుకున్నారు.

ఈ గలాభాకి విశ్వం మెలకువ వచ్చి, లేచి తూలుతూ వచ్చాడు. పరిస్థితి అర్థం అయ్యింది. వళ్ళు తెలియని కోపంతో "ఏమిటండీ" వెధవ కాలీఫ్లవర్సు కోసం ఇంత రాద్ధాంతమా?

## చర్మ బ్యాంకు

పశ్చిమ జర్మనీలోని లుడ్విక్షేషనులో ఎంప్లాయర్స్ లయబిలిటీ ఇన్సూరెన్సు అసోసియేషనువారు ఒక చర్మ బ్యాంకును నిర్వహిస్తున్నారు. కాల్పుల గాయాలతో బాధపడుతున్న రోగులకు ఇక్కడ చికిత్స చేస్తారు. దాతలు ఇచ్చిన చర్మాన్ని 197 డిగ్రీల సెల్సియస్‌వద్ద నత్రజని ద్రవములో నిల్వయుంచుతారు. ఈ పద్ధతిలో చర్మాన్ని ఎంత కాలమైనా సురక్షితంగా భద్రపరచడానికి వీలవుతుంది. చావు బతుకుల మధ్య ఉన్న రోగులకు చర్మ మార్పిడి చికిత్సలు జరుపుతారు. ఇతర రకాల గాయాలకు చికిత్స చేయటానికికూడా కొన్ని ప్రత్యేక విభాగాలను నిర్వహిస్తున్నారు. ఐరోపాలో ఉన్న ఒకే ఒక చర్మ బ్యాంకు ఇది కావటం ఒక విశేషం.








కావాలంటె మా చెల్లాయి సారెతో బాటు ఓ లారీడు కాళీఫ్లవర్సు కూడా పంపిస్తాంలెండి!'' అన్నాడు.

అంతె! కొంప మునిగింది!

"ఆడ పెళ్లివారికి ఇంత పొగరా? ఈ పళంగా "మా అబ్బాయి తాళి కట్టడు పొండి'' అంటె తెలుస్తుంది.'' అంటూ జగదాంబ ఓ బాంబు విసిరింది.

విస్తుపోయారు పిల్లవైపు వారు.

'తిక్క కుదిరిందా?' అన్నట్లు చూస్తున్నారు మగ పెళ్లివారు. మొదట విశ్వాన్ని మందలించారు. తర్వాత నిజంగానే జగదాంబ కాళ్లు పట్టుకొనే ప్రయత్నం చేయబోతూండగా,

"ఆగండి నాన్నా! ... అమ్మా! నువ్వు తప్పుకో!'' అంటూ వచ్చింది పెళ్లికూతురయిన విజయ.

అందరూ వింతగా చూస్తూండగా, "జగదాంబగారు! మీ అబ్బాయి కడ్తానన్నా ఆ తాళి 'నేను కట్టించుకోను' అని చెప్పడానికే వచ్చాను'' అంది.

విలువు గుడ్లు పడ్డాయి జగదాంబకి.

"నీకేం మతి పోయిందా? నువ్వెందుకు వచ్చావు?'' అని తల్లీ తండ్రీ కోప్పడుతున్నా పట్టించుకోకుండా, "ఏ బాధా లేకుండా వుండడానికి నేను మనిషినా? బొమ్మనా? వుదయం నుండి అంతా గమనిస్తూనే ఇప్పటిదాకా వూరుకోడం నా బుద్ధితక్కువ.''

"ఏమండీ పెళ్ళికొడుకుగారూ! మాటా పలుకు లేకుండా వుంటె ఎలా? పెద్దవాళ్ళేదో చాదస్తంగానో, మూర్ఖంగానో ప్రవర్తిస్తూంటె వాళ్ళకి నచ్చచెప్పాల్సింది పోయి వినోదంగా చూస్తున్నారా? డోంట్ యూ ఫీల్ ఎషేమ్డ్ ఆఫ్ యూ?'' అని నిలదీస్తూంటే తెల్లబోయి చూస్తున్న పెళ్ళికొడుకు ముఖం క్షణంలో ఎర్రబడింది. ఆవేశం ఆపుకోలేకపోతోంది విజయ.

"బజారులో వస్తువు నాణ్యం పరీక్షించినట్లు నన్ను శల్య పరీక్ష చేస్తూంటె ఓర్చుకున్నాను. ప్రభుత్వం వరకట్నం నేరమని, శిక్షార్హమని చాటుతోన్న ఈ రోజుల్లో కూడా కట్నం కోసం సంతలో గొడ్డును బేరం చేస్తున్నట్లు బేరాలాడుతుంటె భరించాను. ఇంకా తృప్తిలేక హిరణ్యాక్ష వరాలు కోరుతున్నారని తెలిసి మౌనం వహించాను. ఎందుకనో తెల్సా? ఇవన్నీ లేకపోతే ఆడపిల్ల పెళ్ళి కావడం కష్టం. ఎన్నాళ్ళని మా గుండెలమీద బరువుగా వుంటావని?'' నా తల్లి ప్రాధేయపడ్డంవల్ల.

ఇవన్నీ చాలక బంగారు గుడ్లు పెట్టే బాతులా ప్రతినెలా నావల్ల మంచి ఇన్‌కం అని, 'వుద్యోగం మానేయనవసరంలేదని, వుద్యోగం చెయ్యడమే మీ కిష్టం' అని చెప్పారు. ఇన్నివిధాల లాభం పొందుతూన్నా ఇంకా తృప్తిలేదు మీకు. ప్రతి చిన్న విషయంలోను బాధించి ఆనందించే శాడిస్టులు మీరు.

మీరు ఫలానాది కావాలని కోరడం తప్పు లేదు. అది సాధ్యం కానప్పుడు సర్దుకుపోడానికి ప్రయత్నించాలిగాని ఆఫ్ట్రాల్ మీరు చెప్పిన స్వీటు చెయ్యనందుకు, కూర వండనందుకు 'తాళి కట్టం' అనడం ఎంత హాస్యాస్పదం?

వుదయంనుండి ఆకు వక్కల దగ్గర్నుంచి భోజనందాకా చెయ్యాలని మీరు నేలపాలు చేసిన నేరానికి మిమ్మల్నెలా శిక్షించాలి? దేశంలో ఎంతోమంది ఒక్కపూట... ఒక్క ముద్ద దొరక్క నానా బాధలు పడుతూంటె కేవలం మమ్మల్ని... అంటె ఆడపెళ్ళివారిని ఏడిపించడానికో లేక బాధించడానికో అన్నట్టు తేరగా వచ్చాయి కదా అని ఇలా వేస్ట్ చేసినందుకు మీ సంజాయిషీ ఏమిటి?

సంబంధం కలుపుకోదల్చిన వాళ్ళు అరమరికలు లేకుండా స్నేహభావంతో మెలగాలి గాని...'' ఆవేశాన్ని గుక్కతిప్పుకోడం కోసం ఒక్క క్షణం ఆగింది.

విశ్వానికి నిద్రమత్తు నీర్సంతో సహా ఎగిరిపోయింది. వుషారు కూడా వచ్చేసింది. "మగపెళ్ళివారంటె నెత్తిమీద దేవతలా? లేక ఆకాశాన్నుండి ఊడిపడిన గంధర్వులా? అబ్బాయి పెళ్ళికి మగపెళ్ళివారయిన మీరు మీ అమ్మాయిల పెళ్ళికి ఆడపెళ్లి వారు కారా? అప్పుడు మీ పరిస్థితి ఎలా వుంటుందో వూహించలేరా? ఇంత చిన్న విషయానికి అంత రాద్ధాంతం చేసిన మీతో ముందు ముందు మా చెల్లెలు ఎన్ని బాధలు పడాలో? మూడుముళ్ళు పడకముందే మీ నిజ [విశ్వ] రూపము చూపించిన మీకు కృతజ్ఞులం. మీకు మీ సంబంధానికి ఓ నమస్కారం.''

తీక్షణంగా అంటూన్న విశ్వాన్ని చూసి అయోమయావస్థ నుండి తేరుకున్న రాఘవరావు. "ఒరే విశ్వం! బుద్ధి వుందిరా? ఏం మాట్లాడుతున్నావు? తెలిసి వుండే మాట్లాడుతున్నావా?'' అంటూ కళ్ళు ఎర్రచేసి చేయి ఎత్తబోతూంటె చటుక్కున ఆ చేయి పట్టుకుని ఆపింది విజయ.

"అన్నయ్య నేమీ అనకండి నాన్నా! నా నిర్ణయం కూడా అదే! అన్యాయానికి తలవంచడానికి ఆతరం అబలని కాదు నాన్నా! ఈతరం సబలని! వక్తిత్వం, మనసు లేనివాడిని నేను పెళ్ళాడలేను. సాంప్రదాయం ముసుగులో ఆడపిల్ల తండ్రిని నిలువు దోపిడి చెయ్యనివాడు, ఆచారం పేరుతో అనుక్షణం నా తల్లి తండ్రులని అవమానించని వాడు తారస పడినపుడు చేసుకుంటాను. పెళ్ళి పేరుతో "లాటరీలో వచ్చే లక్షల్లా కొంతలమ్సమ్ ఎమౌంట్, స్కూటరు, వుద్యోగస్థురాలయిన భార్య ద్వారా తన ఆర్థిక స్థితి పెరుగుదల''— వీటికోసం కాకుండా కేవలం తనకోసం... జీవితాంతం తన జీవితానికి తోడు—నీడగ వుండే భార్యనే కోరుకునే వాడ్ని మాత్రమే నేను పెళ్ళి చేసుకుంటాను.

ఆడపిల్లకి భర్త ఎంత అవసరమో, ప్రతి మగాడికి భార్యా అవసరం అంత కంటె ఎక్కువే! పెళ్ళి కాదేమోనన్న భయం నాకేమీ లేదు. నువ్వేమీ దిగులుపడకు అమ్మా! ఈ దేశంలో సంస్కారవంతులు లేకపోలేదు. నిర్భయంగా, ధృడంగా, సూటిగా చెపుతున్న విజయని చూసి జగదాంబ లాంటి వాళ్ళు కొందరు ముఖం చిట్లించినా, మరెన్నో జతల కళ్ళు అభినందిస్తున్నాయి.

★



చంద్రమోహన్ విజయశాంతి ''సుందరి–సుబ్బారావు''



# సినిమా.

## "ఎస్. పి. భయంకర్"లో పీటర్

శాంతమ్మ (జానకి)తో ధైర్యం (పి. ఎల్. నారాయణ) ''పంతులమ్మ లక్ష్మికి, ఫాదర్‌గారు దయతో వెయ్యి గజాల స్థలాన్ని ఇప్పిస్తామన్నారు. కాని, మీ అబ్బాయి 'ఫాదర్ అయితే నాకేం లెక్కా ?' అని...'' అంటూ ఫిర్యాదును టక్కున ఆపి, ''అమ్మా, ఓ మంచి కాఫీ ఇప్పిస్తావా ?'' అన్నాడు.

''నోరు మంచిదైతే ఇవ్వొచ్చు,'' అంది శాంతమ్మ.

పక్కనే ఉన్న జీవా (వై. వి. రాజు) ''కాఫీ ఇస్తుందిలేవయ్యా. తర్వాతేం జరిగిందో చెప్పు,'' అన్నాడు ఆత్రుతతో.

''అచ్చోసిన ఆబోతల్లే అరవడం – అబ్బో– ఎందుకులే,'' అని ఇంకా చాడీలు చెప్పబోతూన్న ధైర్యం హఠాత్తుగా అటు పీటర్ (కృష్ణంరాజు) రావడం చూడగానే ప్లేటు మార్చేసి, ''ఆఁ... ఈ పెట్టెకి ఆర్డరిచ్చి పోదామని వచ్చాను. నాకా రోజులు బాగాలేవు,'' అంటూ నీళ్ళు నమిలాడు.

పీటర్ ''నీలాంటివాళ్ళు అంత తొందరగా వస్తారా ? ఏదో సువార్త ప్రసారం చెయ్యడానికి వచ్చావని నాకు తెలుసు. చెప్పు – ఏం కూశావ్ ?'' గుడ్డురిమాడు.

జీవా కోపంతో ''ఎంత పొగర్రా నీకు ? ఫాదర్నే లెక్కచెయ్యనని బెదిరిస్తావా ? తిండి పెడుతూంటే ఒళ్ళు మదంపట్టి ఉన్నావురా !'' అన్నాడు.

''మీ తిండి లేకపోతే నేనేం చచ్చిపోను,'' అన్నాడు పీటర్.

''అంత పౌరుషం ఉన్నవాడివైతే పోరా.. ఎక్కడ అడుక్కుతింటావో తిను !'' అన్నాడు జీవా.

ఇంతలో ''అన్నయ్యా!'' అంటూ గదిలోంచి వచ్చిన మేరీ (గీత) ''ఫోంచేసి వెళ్ళన్నయ్యా !'' అంది.

'ముఖ్యమంత్రి'లో కృష్ణ, అంబిక



"ఎస్. పి. భయంకర్"లో



# విశేషాలు

"తినబోతూ లేచివచ్చావు కదూ? అన్నంతో కడుపు నిండుతుంది; ప్రేమతో మనసు నిండుతుందమ్మా. నువ్వు పెళ్ళి చేసుకొని కాపురం చేసేప్పుడు నీ ఇంటికి వచ్చి నీ అన్నం, నా అన్నం అంతా తింటానులే," అంటూ పీటర్ వడివడిగా వెళ్ళిపోయాడు.

మేరీ చెమ్మగిల్లిన కళ్ళతో చూస్తూండిపోయింది.

ఎ. ఎస్. ఆర్‌తో దర్శక నిర్మాత వి. బి. రాజేంద్రప్రసాద్ రూపొందించిన జగపతి ఆర్ట్ పిక్చర్స్ "ఎస్. పి. భయంకర్" మే విడుదల.

## విశ్వాసమిత్రులు

నూతన చలనచిత్ర నిర్మాణ సంస్థ శ్రీ సాంబశివ సినీ క్రియేషన్స్‌వారు ఏప్రిల్ 2న విజయవాడ రోటరీ క్లబ్ ఆడిటోరియంలో పూజా కార్యక్రమాలు నిర్వహించారు. మే నెలలో రికార్డింగ్ జరుపుకొని షూటింగ్ కార్యక్రమములు మొదలుపెడతామని నిర్మాతలు తెలిపారు. వీరు నిర్మించే చిత్రం "విశ్వాసమిత్రులు."

చిత్ర రంగంలో అనుభవం గడించిన శ్రీ గాదిరాజు కేశవరావు యీ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. పాత కొత్త నటీనటులు నటిస్తారు. త్వరలోనే ఆర్టిస్టులు, టెక్నిషియన్స్‌ని ఎన్నుకుంటారు. ఈ చిత్రానికి శ్రీ యం. జయరాం కథను సమకూర్చారు. ప్రొడక్షన్స్ కంట్రోలర్ శ్రీ యం. రాజగోపాల్, నిర్మాత శ్రీ యం. సాంబశివరావు.




సీత, సురేష్



## అనంతలక్ష్మి క్రియేషన్స్ "కుర్ర చేష్టలు"

"తప్పులు ఎందరో చేస్తారు. కాని,కొందరే దిద్దుకోగల్గుతారు. బాల్యంనాటి కుర్ర చేష్టలు మానవుడు పరిణతి చెందాక ఏ విధమైన ప్రభావం చూపుతాయో తెలిపే పూర్తి వినోదాత్మక చిత్రం," అన్నారు రాజాచంద్ర. ఈయన దర్శకత్వం వహించే పై చిత్రానికి ఇటీవల పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. సుమన్, విజయశాంతి, భానుప్రియ, గొల్లపూడి మారుతీరావు, పి. ఎల్. నారాయణ, రాళ్ళపల్లి, అన్నపూర్ణ వగైరా తారాగణం, కాశీ విశ్వనాథ్ కథకు ఆత్రేయ సంభాషణలకర్త. ఆత్రేయ, కొసరాజు గీతాలకు సత్యం స్వరకర్త. పి. చెంగయ్య ఛాయ, ప్రకాష్ నృత్యం, పి. మహేష్‌కుమార్ సహకార దర్శకత్వం, మణి — పి. శ్రీనివాస్ ప్రొడక్షన్, పరమశివం — రాజా స్టంట్స్‌తో ఈ చిత్రాన్ని నిర్మించే దగ్గుపాటి భాస్కరరావు "ఏప్రిల్ 13 నుంచి 27 వరకు తొలిషెడ్యూల్, మే 15 నుంచి జూన్ 2 వరకు ఆఖరి షెడ్యూల్ మద్రాసులోనే జరుగుతాయి," అని తెలియజేశారు.

## జంధ్యాల దర్శకత్వంలో కమలహాసన్

పి. శశిభూషణ్ నిర్మించే శ్రీ సారథీ స్టూడియోస్ 18వ చిత్రంలో కమలహాసన్ హీరో. ఎస్. గోపాలరెడ్డి ఛాయాగ్రాహకుడు.



'కిరాయి అల్లుడు'లో కృష్ణ, జయసుధ



కృష్ణంరాజు, జయసుధ 'బొబ్బిలి బ్రహ్మన్న'

"శుభముహూర్తం" అనంతరం ఏప్రిల్‌లో సత్యశక్తి పిక్చర్స్ మొదలెట్టే "రామాయణంలో భాగవతం" చిత్రంలో సుహాసిని, గొల్లపూడి, జగ్గయ్య ప్రభృత నటవర్గం.

రామకృష్ణ, పి. ఆర్. ఆర్. ప్రసాద్ నిర్మించే చిత్రానికి స్క్రిప్ట్‌వర్క్ జరుగుతోంది.

## "శ్రీదేవి కళ్లు"

దక్షిణ భారతంలోనేకాక ఉత్తర భారతంలో కూడా అందాల తారగా సంచలనం సృష్టిస్తున్న శ్రీదేవికి ఎంతగానో నచ్చిన చిత్రం "శ్రీదేవి కళ్లు".

అంతేకాక శ్రీదేవిని మనసారా ప్రేమించిన డాక్టరుగా కమల్‌హాసన్ మరో మంచి పాత్ర పోషించాడు.

# సినిమా

సగం చిత్రం పూర్తయ్యే నాడు ఆగిపోయిన "శ్రీదేవి కళ్లు" సినిమా నేడు త్వరితగతిన పూర్తిచేసుకుంటోంది —

ఇందులో కె. ఆర్. విజయ, హాస్య చక్రవర్తి నగేష్ రెండు ముఖ్య పాత్రల్లో నటిస్తున్నారు. గాయత్రీదేవి సమర్పణలో, శర్వాణి ప్రొడక్షన్స్ నిర్మించిన ఈ చిత్రానికి దర్శకుడు : కృష్ణన్‌పంజు, నిర్మాత : డి. అంజిరెడ్డి. సంగీతం : ఎమ్. ఎస్. విశ్వనాథం.

## "సంసారానికి సంకెళ్ళు"

"వేటూరి, అనితారెడ్డితో కలిసి పాడిన పాట మా చిత్రంలో అదనపు ఆకర్షణ," అన్నారు కొమ్మినేని శేషగిరిరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి దర్శకత్వం నెఱపే లక్ష్మీ కళా కంబైన్స్‌వారి పై చిత్రం షూటింగ్ మార్చి 19 నుంచి ఏప్రిల్ 20 వరకు ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది. శివకృష్ణ, సుధాకర్, రాజేంద్రప్రసాద్, పూర్ణిమ, ప్రభ, సంగీత, జయమాలిని, అనూరాధ, వేలు, వీరభద్రరావు, ఒక విశిష్టమైన పాత్రలో గొల్లపూడి మారుతీరావు నటిస్తున్నారు. పేరాల మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, ఎస్. ఎస్. లాల్ — కబీర్‌లాల్ ఛాయ, పి. వెంకటేశ్వరరావు శిల్పం, రవీంద్రబాబు కూర్పుతో తోట రాజమౌళి నిర్మాత.

సంయుక్తమూవీస్ "మహా సంగ్రామం" షూటింగ్ ముహూర్తోత్సవ సమావేశ దృశ్యం



## "ముద్దుల చెల్లెలు"

ఇమంది రామారావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో వావిలపల్లి రాజారావు, వి. రమణయ్య నాయుడు నిర్మించే శ్రీ యోగప్రియా ఆర్ట్ క్రియేషన్స్ వారి పై చిత్రం షూటింగ్ మార్చి 19 నుంచి జరుగుతోంది. మురళీమోహన్, రంగనాథ్. నూతన్ ప్రసాద్, రాజేష్, రాజేంద్ర ప్రసాద్, వేలు, భరత్, నానిబాబు, పద్మనాభం, మందులు, కుమ్మరి మాస్టారు, ముచ్చెర్ల అరుణ; తులసి, సంగీత, దీప, రాజశేఖర్, కల్పనారాయ్, శ్రీలక్ష్మి, లక్ష్మీప్రియ వగైరా నటవర్గం. ఆత్రేయ గీతాలకు కె. వి. మహదేవన్ స్వరకర్త. పద్మనాభన్— మోహన్ ఛాయ, గాదిరాజు కేశవరావు సహ దర్శకత్వం, బాబు నృత్యాలు, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో యువరాజు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. నిర్మాణత : సేపేన సత్యం, ఇ. నాయుడు, సిరిపురపు నీలంనాయుడు.

## 'శ్రీమతి కావాలి'లో మందు మహాప్రపూర్ణ

మద్యం సేవిస్తున్న పానకాలు (అల్లు రామలింగయ్య) సీసాకు నమస్కరించబోయేసరికి అదికాస్తా జారి క్రిందపడి, ముక్కలైంది. "అయ్యో! నా హృదయాన్ని ముక్కలు ముక్కలుగా చేసి నేలపాలైపోయావా మందూ! నా పాపానికి నిష్కృతి లేదు." అని శోకాలు తీస్తున్న పానకాలును ఓదార్చడానికి వచ్చిన మోహన్ (మోహన్‌బాబు). "ఛీ - ఊరుకోండి, పెద్దవారు. మీరు ఏడవకూడదు. ఇలాంటి సమయాల్లోనే కాస్త ధైర్యంగా ఉండాలి. కష్టాలు మందు తాగే వాళ్ళకు కాక తాగని వాళ్ళకు వస్తాయా? తట్టుకోండి" అన్నాడు.

"ఎలా తట్టుకోను, బాబూ! ఎంతో ప్రేమగా, జాగ్రత్తగా చంటిముండను షాపు నుండి ఇంటివరకు ఎండ తగలకుండా తెచ్చాను... సీసా ఎగిరి నేను ఏడుస్తూ ఉంటే మీసాలు సరి దిద్దుకో అన్నాడట — వెనకటికి ఎవడో. నా మందు నేలపాలైపోవడం నీకు ఆనందమా?"

"ముందు నే చెప్పేది వినండి. అసలు నేను వచ్చింది ఎందుకంటే -- మందు సంఘమంతా మీకు సన్మానం చేసి, 'మందు మహాప్రపూర్ణ' అనే బిరుదు ఇవ్వాలని ఉత్సాహపడుతున్నారు. మీ గొప్పతనాన్ని లోకానికి చాటి చెప్పటానికి ప్రత్యేకంగా సావనీరు కూడా వెయ్యాలని చూస్తున్నారు."

"ఛా... ఏమిటో, నాయనా! నా గొప్ప తనాన్ని ప్రపంచం ఇన్నాళ్ళకు గుర్తించింది. చాలా సంతోషం. ఈ సంతోష సమయంలో మందు లేకుండా పోయింది."

"ఈ విషయం మీకు చెప్పి మీ అనుమతి తీసుకుందామని వచ్చాను. ముందు మీరు లేవండి," అంటూ మోహన్ రకరకాల లిక్కర్ సీసాలతో కట్టిన దండను పానకాలు మెడలో వేశాడు.

పానకాలు సంబరపడిపోయాడు. "చాలా సంతోషం, నాయనా! నీ పేరేమిటి?"

"మోహన్‌బాబు. చాలా మంచి వాడ్ని. ఇంకా పెళ్ళి చేసుకోలేదు."

"అదేం పాపం?"

"నచ్చిన పిల్ల దొరకలేదండి. అంతే కాదండి; నాకు కాబోయే మామగారు గొప్పవారై ఉండాలని నా కోరిక. అందుకని మీరు ఊఁ — అంటే ..."

"ఊఁ — అంటే?"

"మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాను."

"ఆఁ!" పానకాలుకు మత్తు వదిలినట్లయింది.



"కాయ్ రాజా కాయ్" అరుణ—తులసి—సుమలత

జనార్థన్ దర్శకత్వంలో శివశంకర్ నిర్మించే శ్వేతచిత్ర ఇంటర్నేషనల్ వారి "శ్రీమతి కావాలి" చిత్రం షూటింగ్ పూర్తయింది. ఓంప్రకాష్ సహనిర్మాత.

## కృష్ణతో పద్మావతీ ఫిలిమ్స్ చిత్రం

"డిసెంబర్ నుండి షూటింగ్ ప్లాన్ చేశాం," అన్నారు ఉప్పలపాటి సూర్యనారాయణ బాబు. ఈయన నిర్మించే చిత్రంలో కృష్ణ సరసన రాధ, సుమలత, నాయికలు. చక్రవర్తి సంగీతం, కంచర్ల పూర్ణచంద్రరావు సహ దర్శకత్వం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయతో ఎ. కోదండ రామిరెడ్డి దర్శకుడు.

"శ్రీమతి కావాలి" రాధిక, రాజ్యలక్ష్మి



"ఈ తీర్పు ఇల్లాలిది" మోహన్‌బాబు, సుజాత



## అధికార దుర్వినియోగం

ఢిల్లీ ఎయిరిండియా ''వాయుదూత్'' విభాగం జనరల్ మేనేజరు 28 ఏళ్ళ హర్షవర్థన్ అనే ఆయన తన పదవి పలుకుబడి వుపయోగించి హిందీ చలనచిత్ర నటి పద్మినీ కొల్హాపురి అనే ఆమెకు, షర్మిలా కుల్‌కర్ణి అనే వొకామెకూ రోమ్, ఆమ్‌స్టర్‌డామ్, ఫ్రాంక్‌ఫర్ట్, లండన్ వగైరాలు చుట్టిరాడానికి రెండు టిక్కట్లు ఇటలీలోని ఎయిరిండియా అధికారులచేత కొనిపించి, ఆనక ఆ డబ్బు యివ్వలేదట. ఇది ఈ హర్షవర్థన్ ప్రత్యేకమయిన ఫోనులవల్లా, పెరసనల్ వుత్తరాలవల్లా 1983 మే నెలలో జరిగిపోయిందట. ఇవి అతగాడు ఫ్రీ టిక్కట్లుగా చేయించాలని వేచి, కాలదోషంవల్ల బుట్టదాఖలా కాపోతుందా అని ఆశపడ్డాడట. పద్మినీ కొల్హాపురికి యిచ్చిన టిక్కట్టు ఖరీదే 16,243రూపాయలట.




అదిగాక వారిద్దరికీ రోమ్, లండన్, ఫ్రాంక్‌ఫర్ట్ వంటి మహానగరాల్లో వుండడానికి హోటలు వసతులు, తిరుగడానికి కారు వసతులు అవీ కూడా ఈయన ఆదేశాలమీద ఆయన ఏర్పాట్లుగా జరిగాయట. అధికార దుర్వినియోగం క్రింద ఈయన మీద నేరం మోపి, సి. బి. ఐ. సంస్థ ఆరాలు తీస్తోందట. 29 ఏళ్ళ ఈ హర్షవర్థన్ గారికి ''వాయుదూత్'' విభాగంలో జనరల్ మేనేజరు పోస్టు రాడానికి పాపం ఆయన తండ్రి.. వగైరాలు ఎంత కష్టపడుంటారో!

### తండ్రిమీద పగతో పసివానిపై కిరాతకం!

మద్రాసు అంబత్తూరుకు చెందిన ఒమేగా కేబుల్స్ అనే ఓ కంపెనీలో రామలింగం అనే ఆయన వెల్‌ఫేర్ ఆఫీసరుగా పనిచేస్తున్నారట. ఈ కంపెనీలోనుంచి ఒక హేక్సా బ్లేడుల కట్టను



ఘూర్కా గుల్ బహదూర్ దొంగతనం చేసినందు కాతన్ని రామలింగం సస్పెండు చేశారట. ఆ స్థానంలో అదే కంపెనీ బ్రాంచి రాణీపేటలో పని చేస్తున్న మలైపాండియన్‌ను బదిలీ చేశారట. ఈ బదిలీ మలైపాండియను క్కూడా యిష్టం లేకపోయిందట. గుల్ బహదూర్ ఆ మలైపాండియన్‌తో చేరి యిలాంటి అక్రమాలు చేసి రామలింగానికి గుణపాఠం చెప్పాలని తీర్మానించుకుని ఆయన కొడుకు 8 ఏళ్ళ అశోక్ కుమార్‌ను స్కూలునుంచి ఎత్తుకుపోయి సూరప్పాదు అనే ప్రాంతానికి తీసుకుపోయి అక్కడా కుర్రాణ్ణి చంపి నీళ్ళ కుళాయి క్రింద పడేసి చక్కాపోయారట.

### పసివానిని బలితీసుకున్న కామ పిశాచి!

ఖమ్మం జిల్లా ఇల్లెందు గ్రామానికిచెందిన సౌరమ్మ అనే విధవరాలు తానుంచుకున్న రాజలింగం తనమీద సీతకన్నేసి, తన భార్యతోనే కులుకుతున్నాడని ఉద్వేగంతో వూగిపోయి ఆ రాజలింగం కొడుకు ఐదేళ్ళ రమేష్‌ను స్కూలు నుంచి మాయ మాటలతో ఎత్తుకుపోయి, వో వాగువద్ద రాయిపెట్టి చితకబాది చంపి, అక్కడే పాతిపెట్టి చక్కాపోయిందట. పిల్లాడు కనబడని తలిదండ్రుల గోడుతో బయటపడి, నాతో యున్నాళ్ళూ కులికి, యిపుడు పెళ్ళాంతో కులికితే నేనావేశంలో ఆ పసికందుని చంపానందట ఆ విధవ కామ పిశాచి.

### ఆత్మాహుతికి దారితీసిన ఆలుమగల తగాదాలు!

సేలం (తమిళనాడు)కు చెందిన 30 ఏళ్ళ సుబ్రహ్మణ్యానికి, అతనిభార్య 25ఏళ్ళ కమలకూ పెళ్ళయిన ఎనిమిది నెలలనుంచి మనస్పర్థలు, పోట్లాటలు మీదుగా ద్వేషం తన్నులాట వరకూ వెళ్ళిందట. ఓ రోజు రభసలో సుబ్రహ్మణ్యం ఆమెను చితుకబాది, బయటకు తోసేసి, ఇల్లు తాళంవేసి, తాళంచెవి పక్కింట్లో ఇచ్చి హెచ్చరించి వెళ్ళిపోయాట్ట. కాస్సేపటికి సుబ్రహ్మణ్యం తండ్రివచ్చి తలుపు తాళంతీసి లోపలకు వెళ్ళే సరికామె ఆయన వెనక లోపలకు వెళ్ళి, నేరుగా వంటిట్లోకి వెళ్ళి కిరసనాయిలు మీదపోసుకుని అగ్గిపుల్లంటించుకుని ఆత్మాహుతి చేసేసుకున్నదట.

### ప్రాణం తీసిన అత్తమామలు!

హుజూరాబాద్‌కు చెందిన రాజయ్య అనే అతను తన భార్య అరుణ కట్నం డబ్బు పదివేలలో వో వెయ్యి తక్కువ తెచ్చినందుకు ఆమెనా వెయ్యి కోసం వేయించుకు తాను తినడమేగాక ఆ పని తన తలిదండ్రులకూ వొప్పగించాడట. ఈ బాధలు పడలేకామె తన తండ్రి ఎలిగేటి బాలయ్యతో చెప్పకు ఏడిస్తే అతను డబ్బు తొందర్లో యిచ్చేస్తానని చెప్పి పంపాడట. ఈమె 23–1–84న పగలు పన్నెండింటికి వురిపోసుకు చనిపోయిందని ఖబురు తెలిసి బాలయ్య భోరున ఏడుస్తూ ఆమె అత్తారింటికి వెళ్ళాడట. అది ఆత్మహత్యకాదని, తన కూతుర్ని అత్తమామలు కరెంటు షాకుతో చంపి, ఆనక చూరుకు వ్రేలాడదీశారనీ ఆ తండ్రి పోలీసులతో భోరుమన్నాడట.




### కట్న పిశాచికి మరో అబల బలి!

ప్రకాశంజిల్లా ఉలవపాడుకు చెందిన రావిపాటి సత్యనారాయణ తనకు పెళ్ళయ్యేముందే వో స్త్రీతో సంబంధం పెట్టుకున్నాడట. పెద్దాళ్ళమాట కాదనలేక అరుణ అనే ఆమెను పెళ్ళిచేసుకుని, కట్నం బాగాతేలేదని ఆమెను తను, తన తలిదండ్రులతో కలిసి బాధలు పెట్టి చివరికోనాడు (జనవరి 21వ తేదీ) చనిపోయినట్టు ఆమె అన్నకు తెలియజేస్తే అతను గుండె బాదుకుంటూ వెళ్ళిచూస్తే ఆమె మెడ వుబ్బి వున్నదట. ముఖంమీదా, మెడమీదా, చేతుల మీదా రక్కిన రక్తపు చారలున్నాయట. ఇది ఆత్మహత్య కాదు, చావు కానేకాదు. కేవలం హత్యేననీ, విచారణ జరిపించి, న్యాయం చేకూర్చాలనీ అతను అధికారికి విన్నవించుకున్నాట్ట. ★

ముంధా వెంకట రమణారావు సీరియల్

# ఉదయసంధ్య

3 (గత సంచిక తరువాయి)

భోజనం అయిపోయింది. తాంబూలం, రూపాయి దక్షిణా ఇచ్చి నమస్కారం చేసింది శాంతమ్మ. ప్రతి నమస్కారం చేసేడు రామం.

చంద్రం, సుబ్బారావూ సినీమాకి వెళ్లి పోయేరు. ''సావిత్రి పిలుస్తోంది పద'' అంది నిర్మల. మీదకి మళ్ళా వెళ్లేడు. సావిత్రి పుస్తకాలు ముందు పడేసుకు కూర్చుంది. టేబిలు, నాలుగుకుర్చీలూ, చిందర వందరగా పుస్తకాలు. పనిమనిషి గది తుడుస్తోంది. ఈ గదిలో లతా, సావిత్రీ ఉంటారు. రెండు టేకు మంచాలు, పరుపులు, నీట్‌గా దుప్పట్లు గదికి ఒక మూలకున్నాయి. మంచాల పక్కని టీపాయ్‌ల మీద బెడ్‌రూమ్ రీడింగ్ లేంప్సు. పుస్తకాలు పెట్టుకుందుకి అద్దాల క్వరబీరువా ఉంది. వాటి నిండా టెక్ట్సు పుస్తకాలూ, గైడ్లూ.

రామం మీది గదిలోకి వెళ్లి నిల్చున్నాడు. సావిత్రి తల ఎత్తి చూసింది. ''కూర్చోరామం. నాకీ నౌన్ క్లాజుకీ, ఎడ్జెక్టివ్ క్లాజుకీ బేధం తెలీడం లేదు. మెయిన్ క్లాజు, సబార్డినేట్ క్లాజు, కోర్డినేట్ క్లాజు ... అబ్బబ్బ ... ఏమిటీ గ్రామరు బాబూ! పరీక్షలో ఈ ప్రశ్న వదిలేస్తా ననుకో—కాని క్లాసులో మాష్టారూరుకోరు... అందరి ముందూ అడిగేస్తారు...చెప్పలేకపోతే ఇన్సల్టు...''

రామం కుర్చీలో కూర్చున్నాడు...గ్రామరు పుస్తకం తీసేడు. ''క్లాజుల ముందు, నీకు సింపిల్ ఎండ్ కాంపౌండ్ సెన్టెన్స్ గురించి చెప్తాను...సింపిల్ సెన్టెన్సంటే...'' ఎక్జాంపిల్సు ఇస్తూ చెప్పుకు వెళ్లేడు రామం. ప్రతి ఎక్జాంపుల్ తరవాత సావిత్రినొక ఉదాహరణ చెప్పమన్నాడు...రామం చెప్తూ ఉంటే సావిత్రికే కాకుండా, పక్క కుర్చీలో కూర్చున్న నిర్మలకి కూడా సులభంగా అర్థం అవుతోంది. రామం చెప్తూఉంటే అర్థంకానప్పుడు ఆపి మళ్లా అడుగుతోంది సావిత్రి ... ఆమెలో శ్రద్ధ కుదిరింది...రామం తనకీ తెలీనట్టు ఆమెతో సహా నేర్చుకుంటున్నట్టు మెట్టు తరవాత మెట్టు మీదకి వెళ్ళేడు.

ఇంతలో లత వచ్చింది గదిలోకి చేతిలో పత్రికతో. రామాన్ని చూడనట్టుగా వెళ్లి మంచమ్మీద సాగోరి పుస్తకం చదువుకో సాగింది. మధ్య మధ్య పుస్తకం ప్రక్కని పడేసి రామం చెప్పేది వింది. రామం పాఠం చెప్తున్నాడే కాని లత రాగానే మనసులో భయం ప్రవేశించింది. ఏదో ఒక మాట అంటుంది...మనసుని గాయ పరుద్దామని చూస్తుంది. అరిమీదికి ఎగరడానికి చూసే పిల్లిలా చూస్తుంది అవకాశం కోసం.

''రామానికి పాఠాలు చెప్పడం కూడా ఎంతో బాగావచ్చు కదూ...ఏం సావిత్రీ ?'' మధ్యలో దూరి అంది నిర్మల. రామంకోసం గది సంపాదించాలంటే సావిత్రి సహకారం కూడా కావాలి...తన మీద ఆ భారం వేసుకున్న నిర్మల అంది...

''వెంకటేశ్వరులుకి తెలుగు వ్యాకరణం ఈ అబ్బాయే చెప్తున్నాడేమో అడుగు ?'' లత అడిగింది. రామం గతుక్కుమని ఆగిపోయేడు. లతకేసి చూసేడు. లత వెటకారంగా చూస్తోంది. నిర్మల రామంకేసీ లతకేసీ చూసి ఏదో యుద్ధం రాబోయేటట్టుందని పసికట్టింది.

''నువ్వూరుకోవే అక్కా... మధ్యలో అడ్డు రాకు— చెప్పు రామం.. ఏడ్వర్బియల్ కాజంటే.''

**జరిగిన కథ — 2 :** రామం వారాలు చేసుకుంటూ చదువుకుంటుంటాడు. దుర్గమ్మ కూతురు మీనాక్షి రామాన్ని ఆదరిస్తుంది. పూర్ణమ్మ ఇంటిలోని వీధి కొట్టులో రామం నివాసం. ప్లీడరు సీతారామయ్యగారి మేనకోడలు నిర్మలకు రామం అంటే ఇష్టం. శాంతమ్మగారి నడిగి వాళ్లింట్లో గదిలో ఉండడానికి నిశ్చయించు కుంటాడు రామం.

''అంటే...'' ఆగేడు... లతకేసి చూసి అన్నాడు. ''వెంకటేశ్వరులుకి తెలుగులో నాకన్నా మంచి మార్కులొస్తాయి. తెలుగు వ్యాకరణంలో వాడు బాగా మార్కులు తెచ్చుకుంటాడు...''

''ఛందస్సు నేర్చుకొని కవిత్వం అల్లుతాడు.. పద్యాలు రాస్తాడు...'' లత లేచింది...టేబిలు దగ్గర కొచ్చింది... ఆమె గొంతులో తీవ్రత.

రామం నోరు కట్టుబడింది. కాళ్లు వణుకు తున్నాయి. ముఖం ఎర్రబడింది...ఏం చెప్పడానికీ తెలియలేదు. లత కళ్ళలోకి చూడలేక పోయేడు...

''ఏమిటే అక్కా... రామం ఏం చేస్తాడు వెంకటేశ్వరులు పద్యాలు రాస్తే...'' సావిత్రి కోపంగా అంది.

టేబులుమీంచి ఒక అచ్చుపుస్తకం తీసి అడిగింది లత ... ''నాకు ఎస్సేల పుస్తకం కావాలన్నానని వెంకటేశ్వరులికి చెప్పేవా ?''

''నేను చెప్పడం చెప్పేను. వాడి పుస్తకం అడిగేను మీకిద్దామన్న ఉద్దేశంతో'' లతని 'మీరు' అని అంటాడు రామం. 'నువ్వు' అని అనడం అసభ్యంగా ఉంటుంది ఎదిగిన ఆడపిల్లని, అని పించింది.

వాడు నిన్న ఈ పుస్తకం తెచ్చి నా మొహాన కొట్టేడు ... 'నాకు రామం చెప్పేడు ... కాబట్టి పుస్తకం తెచ్చి ఇస్తున్నాను ... 'మై ఏంబిషన్ ఇన్ లైఫ్' ఫలానా పేజీ దగ్గరుందని... ఉంది ... వాడి ఏంబిషన్ ఇన్ లైఫ్ ఆ పేజీ దగ్గర ... చదువుతావా ఎస్సే ?'' పుస్తకం విప్పి రెండు తెల్లకాగితాలు తీసింది... వాటిమీద పద్యాలు రాసి ఉన్నాయి. రామానికి అర్థం అయింది ... సిగ్గుతో తల దించుకున్నాడు.

లత చదవడం ఆరంభించింది ... ''వెంకటేశ్వరుడి 'ఏంబిషన్ ఇన్ లైఫ్' విను... 'ఓ ... కోమల లతాంగీ ! నీ పద్మ నయనంబులు చిందెడు సుధాకర శీతల దృక్కుల కౌముదీ కాంతిలో, ఈనీ నామ సంకీర్తనాతుర జీవుడు, తదీయ సుకుమార సుందర శరీర లతా సాహచర్య పిపాసా పీడితుడు, తదీయ సేవకుడు, బృత్యుడు, ఈ వెంకటేశ్వరుని సేదదేర్చుమా ... ''

సావిత్రి పకపకా నవ్వింది. ''అబ్బ ! ఎంత బాగా రాసేడో ... చదువక్కా ఇంకా ఏం రాసేడు ... ''

లత కోపంతో ఆ ఎస్సే పుస్తకం రామం మ్మీదికి విసిరికొట్టింది. పుస్తకం రామం తలకి తగిలి క్రింద పడింది. ''ఇవి నువ్వు రాసినవే కదూ ? వాడి తెలివి తేటలు నాకు తెలుసు ... నువ్వు రాసేవ్ వాడు కాపీ చేసేడు.''

రామం లేచి నిల్చున్నాడు. తల గిర్రున తిరుగుతోంది. పుస్తకంతో తనని కొట్టింది. అది అవమానంగా తోచలేదు. అంతటితో పోనిస్తుందా ... తనమీద అందరికీ కంప్లెయింటిస్తుంది, వెంకటేశ్వరుడెంత పని చేసేడు ... తనతో మాటవరసకన్నా అనలేదు ఈ పని చెయ్యబూనినట్టు ...

"నాకేం తెలీదండీ ... నా మాట నమ్మండి ... వాడూ నేనూ కలిసి ఒకే ఇంట్లో ఉంటూ చదువుతున్నాము తప్ప వాడి పనులతో నాకేం సంబంధంలేదు ..." గొంతు బొంగురు పోయింది. మంచివాడినని సంపాదించుకున్న పరపతంతా పోయిందీ ఇంట్లో. లతని తనమీద ఈ అభిప్రాయం ఉదంటే ఈ ఇంట్లోనేకాదు... ఊరిలోనే ఉండడం కష్టం ... ఈ అపవాదు భరిస్తూ.

సావిత్రి లేచివెళ్లి లత ముందు నిలబడింది.



# ఉదయ సంధ్య

''ఆ అబ్బాయిని పుస్తకంతో ఎందుకుకొట్టేవ్... మంచీ మర్యాదా లేదా ?'' కోపంగా అడిగింది. నవ్వుపోయింది.

''నువ్వు పక్కకి తప్పుకో . నీకిందులో సంబంధంలేదు. ఇది నా వ్యక్తిగత విషయం. ఈ అబ్బాయికి తెలుసు...వెంకటేశ్వరులే పద్యాలు రాసేడని. ఒకవేళ ఈ అబ్బాయి రాయకపోతే అందులోని ఉపమానాలూ, అలంకారాలూ ఇతనే వేసి ఉంటాడు ...'' లత వెళ్ళి రామాని కెదురుగా నిలబడింది. రామం తల దించుకొని ఉన్నాడు .. కళ్ళల్లో నీళ్ళున్నాయి ... తన దగ్గరున్నవి ఆడదాని కన్నీళ్ళు తప్ప మరేమీ లేవు. ''చూడు నాకేసి ... నా కళ్ళల్లోకి చూడు'' రామం ఎత్తలేదు. అప్పుడు లత మరింత దగ్గరగా వెళ్ళి, రామం జుత్తులోకి వేళ్ళు పోనిచ్చి, ఆ జుత్తు పట్టుకొని తల ఎత్తింది .. రామం కళ్ళలోకి చూసింది ''నా చూపులు చల్లగా ఉన్నాయా ? ... వెన్నెలలా ఉన్నాయా ? నా ముఖం చంద్ర బింబంలా ఉందా ... చెప్పు ఇప్పుడు నీ మీద కౌముదీ కాంతి పడుతోందా ? ...'' జుత్తు పట్టుకొని రామం తల ఊచి ఎగతాళిగానూ ధిక్కారంతోనూ చూసింది.

నిర్మల అప్పుడు లతమీద కలియబడింది... లత చెయ్యిని పట్టుకొని విసురుగా లాగి కేక పెట్టింది.. ''నువ్వు ఆడదానివి కావు... నీ మొహం రాక్షసి మొహంలా ఉంది.. నీ చూపులు వెయ్యం చూపుల్లా ఉన్నాయి. . నీ మొహం కోంచి నిప్పులొస్తున్నాయి.. రామాన్నొదులు... నీకు ధైర్యముంటే మామయ్యకి చెప్పు... ఏమీ తెలీని మనిషిని పట్టుకొని నీ ఇష్టం వచ్చిన మాటలనకు .. నీకు రామం అంటే ఏడుపు... ి కెప్పుడూ ఎందులోనన్నా నలభైకన్న ఎక్కువ మార్కులొచ్చేయా ? రామంకి అన్నింటిలోనూ తెబ్బయిలూ, ఎనభైలూ. . రాసి రాసి నీమీదే కవిత్వం రాయాలా...'' నిర్మల ఒగరుస్తోంది. మనిషిలో ఆవేశం సుళ్ళు తిరుగుతోంది.

లత, నిర్మలకేసి ఆశ్చర్యంగా చూసింది... ''హాయ్...! ఇదేమిటే చిత్రం ? అబ్బాయికి సాయం అమ్మాయిగారు...అలాగేనే మామయ్యకే చూపిస్తాను ... హెడ్ మాష్టరుకి రిపోర్టి స్తాను...''

''ఏమని ఇస్తావ్?'' సావిత్రి అడిగింది.

''ఏదో ఒకటిస్తాను...ఈ రౌడీ జులాయి వెధవలకి నేను భయపడేది లేదు...''

''వెధవలెవరు ? మాటలు సరిగారానీ. .'' సావిత్రి లేచింది...

''ఇది ఎవరు రాసేరో వాళ్ళే. .నీకెందుకు మధ్యని రోషం. .నీ మీద గోడలమీద రాసినప్పుడు నువ్వా రాసినవాడిని ముద్దు పెట్టుకుంటావా?'' సవాలు చేస్తూ అడిగింది లత ఎదురుగా ఒక మగాడున్నాడన్న సంగతి మరిచిపోయేరందరూ ఈ రామం అన్నవాడికి వ్యక్తిత్వం, రక్త మాంసాలూ, సిగ్గు, లజ్జాభిమానాలూ లేవు ఆ వ్యక్తుల దృష్ట్యా ఆ క్షణం.

''అలాటి కవిత్వమే రాస్తే ముద్దుపెట్టు కుంటాను...''

''అయితే పెట్టుకో ... నీ ఎదురుగానే ఉన్నాడు...'' రామాన్ని ముందుకు లాగింది లత .

ఇప్పుడు జరుగుతున్న రభసకి అర్ధంపర్ధం లేదు. ఆవేశాలు ఆకాశాన్నందుకుంటే, అక్క చెల్లెళ్ళమధ్య, అన్నదమ్ముల మధ్య మాటా మాటా రేగుతే, సభ్యత మూల పడుతుంది. పట్టింపుకోసం, తను అంటున్నదీ, చేస్తున్నదీ సరైనదన్న వాదన బలపడడం కోసం ఏమైనా చేస్తారు. నడిరోడ్డుమీద నగ్నత్వాన్ని పదర్శి స్తారు. అశ్లీలాలు మాట్లాడతారు. అతి సన్ని హితమైన, రహస్యమైన విషయాలు బహిర్గతం చేస్తారు.

రామం భుజాలమీద చెయ్యివేసి, బుగ్గని గట్టిగా ముద్దుపెట్టుకుంది సావిత్రి ఏమాత్రం బిడియం లేకుండా ..''పెట్టుకున్నాను...నా మీద రాయి రామం నీ ఇష్టమొచ్చినన్ని పద్యాలు...''

రామం కుర్చీలో కూలబడ్డాడు. ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడవ నారంభించేడు అంతా శూన్యమే కనిపిస్తోంది తనకి. ఏం జరుగుతోందో జ్ఞానంపోయింది. .

ఇదిలాగుండగా ఆ గదిలో కొచ్చింది శాంతమ్మ. ఏడుస్తున్న రామాన్నీ, కోపంతో, అసూయతో, ద్వేషంతో ఒకరినొకరు చూసు కుంటున్న లతని, సావిత్రినీ, రామం కన్నీళ్ళు చూసి నిస్సహాయంగా కన్నీళ్ళు కారుస్తున్న నిర్మలనీ చూసింది ఆమె శాంత వదనంమ్మీద గంభీర ముద్రపడింది..

''ఏమయింది రామం '' అంది ఆమె రామం తలమీద చెయ్యివేసి .

రామం ఏడుస్తూ లేచి ఆమె కాళ్ళమీద పడి, రెండు పాదాలూ పట్టుకొని, ఆమె పాదాలని కన్నీటితో తడుపుతూ అన్నాడు. ''నాకేమీ తెలీదమ్మా.. నన్ను కాపాడండి...''

అర్ధంకాలేదామెకి ''నే ఉండగా నీకు భయంలేదు. ఏమయింది రామం .ఏమయిందే సావిత్రీ...''

నిర్మల చెప్పింది...''ఏమయిందంటే.. '' అంటూ ఆరంభించి అంతా చెప్పింది.

''ఓస్ ఇంతేనా...'' అంది శాంతమ్మ అంతావిని ... ''వెంకటేశ్వరుడు, లతాస్తోత్రం రాసేడా. ఏదీ చూడనీ'' లత చేతిలోంచి కవిత్వం తీసుకొని చదివింది . . ''బాగానే రాసేడు ... కాని ఇంకా యతీ, ప్రాసాపట్టు పడలేదు ''

లత దిమ్మెర పోయింది ''ఏమిటమ్మా నువ్వు. ఆ రౌడీ . ''

''లతా. రౌడీలు కవిత్వం రాయరే. . సరే ఆ సంగతి తరువాత. నువ్వెందుకు రామాన్ని అవమానించేవ్ ? కూటికీ గుడ్డకీ లేక మన ఇంటి కొచ్చి తింటున్నాడనుకున్నావా ? వాళ్ల తాతగారి సంగతి నీకు తెలీదు ... జోగయ్య పంతులుగార్ని తెలిందా ఈ జిల్లాలో ఎవరికి ఆ రోజులలో ? ఆ గ్రామాలన్నీ వారివే..అడిగినవాళ్ళకి లేదనకుండా ఇచ్చి...కరువు కాటకాలలో వేలకొద్దీ ప్రజలకి అన్నదానం చేసి ఉన్నదంతా పోగొట్టుకున్నారు. ఆఖరికి వీళ్ల నాన్న దగ్గరికొచ్చేసరికి ఏమీ మిగల్లేదు...''

''నీకు వీళ్ల వంశం అంతా తెలుసున్నా ఉంది ... తాతలనాడు గొప్పవారైతే ఇప్పుడేం మిగిలింది... నేనెవర్నీ అవమానించలేదు... నన్ను ఎవరన్నా అవమానిస్తే ఊరుకోను.''

''రామానికి క్షమాపణ చెప్పు...''శాంతమ్మ కటువుగా అంది.

ఇటీవల మానస ఆర్ట్ థియేటర్స్ ఆధ్వర్యంలో జరిగిన 'హరిశ్చంద్రప్రసాద్ చలనచిత్ర వ్యాసాలు' ఆవిష్కరణ సభలో ప్రసంగిస్తున్న సభాధ్యక్షులు శ్రీ టి. రాఘవదాసు, శ్రీ తమ్మారెడ్డి కృష్ణమూర్తి, శ్రీ జి. హరిశ్చంద్రప్రసాద్, శ్రీ వి. వెంకటరావు, శ్రీ సాంబశివరావు, శ్రీ రఘుశ్రీ గార్లని చిత్రంలో చూడవచ్చు.



''ఇదొకటా పైగా ... నేనెవరికీ పీకలో ప్రాణం ఉండగా క్షమాపణ చెప్పుకోను. ఆ అవసరం నాకులేదు ... ఆడదాన్లా ఏడుస్తూ అమ్మ కొంగు వెనక దాగొని అమ్మ చేత తిట్టిస్తావా ? ఛీ!'' అని కసిగా రామంకేసి చూసి ఆ గదిలోంచి పోయింది లత.

అప్పుడు నిర్మల మళ్ళా రామం తరఫున వాదించింది... ''ఆ వెంకటేశ్వర్లుడితో రామానికి చదువు నడవదత్తా... రామం మనింటికొచ్చేస్తే మా అందరికీ బాగుంటుంది...సావిత్రికీ, నాకూ అర్థం కాకపోతే పాఠాలు చెప్తాడు... లత కూడా రామంతో పరీక్ష ఇస్తోంది...''

''నాకేం అభ్యంతరం లేదే ... ఎప్పుడుపడితే అప్పుడే ఒచ్చి రామం ... నీకిక్కడ సదుపాయంగా ఉంటుంది... అక్కడ నీ చేత ఆవుల్నీ గేదెల్నీ కడిగిస్తున్నారుట ... నిజమేనా ?...''

రామం మనసు కృతజ్ఞతతో నిండింది ... సరిగ్గా సమయానికి దేవుడు శాంతమ్మగారిని గదిలోకి పంపేడు. లేకపోతే ఏమౌనో తలచుకుంటే భయంవేసుంది... ఏడ్చినందుకు సిగ్గు వేసింది... అసలు క్షమాపణ తను చెప్పుకోవాలి. తన స్నేహితుడి మూలకంగా ఆమెకు అవమానం జరిగింది... ఈ ఇంటికి వచ్చీటమే... అమ్మో... అంతకన్నా స్మశానంలో ఉండడమే నయం...

''నాకక్కడ బాగానే ఉందండీ... మీ దయ ఉంది అదే చాలు. నన్ను అపార్థం చేసుకోకుండా కాపాడేరు. లతమ్మకి నేనే క్షమాపణ చెప్పుకుంటాను...''

రామం ఆమె పాదాలు మరోసారి తాకి, సావిత్రి కేసి, నిర్మల కేసి కృతజ్ఞతతో చూసి గదిలోంచి బయట పడ్డాడు ... ఇవన్నీ ఎన్నో బోనులు. బోనులోకి వెళ్ళినప్పట్నించీ, బయటపడే వరకూ ప్రాణాలు అరిచేత ఉంటాయి.



## 4

వెంకటేశ్వర్లు ఎదురు చూస్తున్నాడు ఇంటికి వెళ్ళే సరికి. రామాన్ని చూడగానే కేక పెట్టేడు ''ఒరే రామం... ఇలారా...మాట !'' వెంకటేశ్వర్లుతో ఇవాళ జరిగిన సంగతి చెప్పి ఇకముందు అటువంటి పనులు చెయ్యొద్దని చెప్దామనుకున్నాడు రామం. కొంచెం కోపం కూడా చూపిస్తే ? వాడికి లెక్కలేదు. వాడి లోకమే వాడిది. ఒకటేదారి, వాడికి దూరంగా ఉండడం.

''రామం ఒచ్చేడమ్మా!'' అని ఎనౌన్సు చేసింది విశాల. తరువాత రామాన్ని ఎగాదిగా చూసి అడిగింది ''ఏం దొరగారూ ఇంతాలస్యం ? ఇంత సేపు భోజనమే? నిర్మలా, సావిత్రీ ఒదల్లేదేం?''

''రామం... నువ్వూ విశాలా మిల్లుకి వెళ్ళి బియ్యం పిండాడించుకురండి... దేనికీ పిండిలేదు ఇంట్లో...'' పూర్ణమ్మ వంటింట్లోంచే హుకుం జారీచేసింది. ''అలాగేనండీ...'' అని రామం తన వీధి కొట్టులోకి మారేడు. ఆ గదిలో ఒక మూలకు రామం పరుపుచుట్ట ఉంది చాపలో చుట్టి. పడుక్కొనేటప్పుడు అది విప్పడం అవుతుంది. గది గోడలకి వెంకటేశ్వర్లు అంటించిన సినిమా స్టార్ బొమ్మలు, స్కూలు పీరియడ్ల టైమ్‌టేబిళ్లు తనదీ, విశాలది, కృష్ణుడిదీ. అందరూ ఈ గదిలోకి దూరి టైమ్‌టేబుల్ చదువుకొని పుస్తకాలుతీసుకొని పోతారు. విశాల అంటించిన వెంకటేశ్వరస్వామి బొమ్మ ఎదురుగా దర్శనమిస్తుంది. క్రిందగచ్చు బీటలు వేసింది. బీటల్లోంచి చీమల బారులు తీరి వస్తూ పోతూ వుంటాయి. ఎప్పటికప్పుడు రిపేర్ చేయిద్దామని అశ్రద్ధ జరుగుతోంది, ఆ డబ్బు వేరేగా అవసరం ఉండటం వల్ల. పాత పింపిరిపట్టిన ట్రంకుపెట్టె ఒక మూలకుంది. అందులో రామం బట్టలు, నాన్న పంపిన నెల ఖర్చు ఐదు రూపాయలూ ఉన్నాయి. ఆ ఐదు రూపాయలూ పుస్తకాలు కొనుక్కుందుకీ, బుద్ధి పుడితే ఎప్పుడన్నా సినిమా చూడడానికీ, ఆకలి వేస్తే వేరుశనగలు కొనుక్కు తినడానికీ, ఇంటికి వెళ్ళినపుడు చెల్లెలికోసం బొమ్మలు కొనడానికీ, వెంకటేశ్వర్లుకి సిగరెట్లు కొనుక్కోడానికీ, విశాలకి చిల్లర ఖర్చుకీ అన్నింటికీ అదే డబ్బు. ''రామం... పావలాపెట్టి గులాబిరంగు రిబ్బను కొని తీసుకురా అలా మార్కెటుకి వెళ్ళి...'' అటుంది విశాల. రంగు రంగుల బొట్లు కొని తెమ్మంటుంది. వీధిలోకి కూరగాయలొస్తే చిల్లర డబ్బులు లేకపోగానే ''రామం...నీ డబ్బీలో చిల్లర డబ్బులుంటే ఇయ్యి'' అంటుంది పూర్ణమ్మ. ఆ పెట్టెకి ఉన్నది చిన్న క్లిక్‌కప్పు—గట్టిగా లాగుతే ఊడొస్తుంది. ఉన్న బట్టలు మూడు నిక్కర్లు, మూడు సగంచేతుల షర్టులు. రెండు తువ్వాళ్లు, బనియన్లు, అండర్‌వేర్లు అంటూ లేవు. ఆ బట్టలే డబ్బుపెట్టే ఉతుక్కోవడం, ఆరవేసుకోడం, వాటితోనే పడుక్కోడం. చాకలి ఖర్చులేదు. సబ్బులకీ, మంగలి ఖర్చుకీ రూపాయవుతుంది. ఒక సన్‌లైట్ సబ్బు, ఒక హమామ్ సబ్బు, మంగలికి పావలా. వాడు నెల వరకూ మొలవకుండా వెంట్రుకలు కత్తిరించేస్తాడు.

ఇంక నోట్సు రాసుకుందుకి కలం,సిరాబుడ్డీ ఉంది. సిరా అయిపోగానే ''నీల్‌కాల్'' సిరాగుండ కొని, బుడ్డీలోవేసి, నీళ్లుపోసి కలపగానే సిరా అయిపోతుంది. కుడిచేతినిండా పుస్తకాలు, ఎడమ చేత్తో కలం, సిరాబుడ్డీ, జేబులో పెన్సిలూ, బ్లేడూ, రబ్బరూ, కాలికి బేండేజీ, ధూళిపట్టిన జోళ్ళులేని పాదాలు, ఇస్త్రీలేని చవక బట్టలు, ఇవన్నీ ధరించిన రామం రూపం ఈ ఇంటినుంచి స్కూలు వరకు ఉన్న అందరికీ సుపరిచితమే.

వెంకటేశ్వర్లు రామం వెంట గదిలోకి కొచ్చేడు... తలుపు దగ్గరగా వేసి అడిగేడు... ''ఏంరా అలా కనిపిస్తున్నావ్ ? ఎవరన్నా తన్నా

# ఉదయ సంధ్య

రేమిటి... ఏడ్చినట్టున్నావ్ ?" రామం కన్నా నాలుగు అంగుళాలు పొడుగూ, బాగా ఎదిగిన శరీరంలో పెద్ద గెద్దలా ఉన్నాడు, పిచికలా కనిపించే రామం ముందు. శాస్త్రిగారు ఆరు అడుగుల పొడుగు. అతని పోలికలొచ్చేయి వెంకటేశ్వరులుకి.

రామం వెంకటేశ్వరులు వేపు తిరిగి బాధగా అన్నాడు... "లతకి నిన్న ఎస్సే పుస్తకంలో పద్యాలు పెట్టి ఇచ్చేవు కదూ ?"

వెంకటేశ్వరులు ముఖం విప్పారింది. ఆత్రంగా అడిగేడు... "చదివిందా? ఏమందిరా? దాని రియేక్షన్ ఏమిటి ?"

"నేనే రాసేనంది... వాళ్ల నాన్నగారికీ, హెడ్‌మాష్టర్‌కీ రిపోర్టిస్తానంది... ఇవాళ నా పరువు పోయింది వెంకూ...నేను రాయలేదని నమ్మించడం కష్టమయింది. శాంతమ్మగారు సమయానికి రాబట్టే కాని ..."

"ఆవిడకీ తెలిసిందా ? రిపోర్టిస్తుందా ... నీ మీద... ? భయపడకురా... నువ్వు రాసేవని ఎందుకనుకుంది ? నేనంత చేతకాని చవటనను కుందా ? రిపోర్టివ్వనీ... నే వెళ్లి చెప్తాలే నేనే రాసేనని..." ధీమాగా అన్నాడు వెంకటేశ్వరులు.

రామం విస్తుపోయేడు... "నువ్వు చెప్తావా? నీకు భయం లేదా ? నీ మీద ఏక్షన్ తీసు కుంటార్రా... ఎందుకిలాటి పనులు చేస్తున్నావ్ వెంకూ...? నేనే నీకు సాయం చేస్తున్నానను కుంటున్నారు ..."

"ఒరే రామం... నీలాటి పిరికివాడింకో డుండదురా. ఎస్సే పుస్తకంలో నేను రాసిన పద్యాలున్నాయి. అవి తనకే రాసేనని ఎలా అను కుంటోంది లత. అవి నేను నా ఊహాసుందరి కోసం రాసుకున్నాను... తెలుగులో మనకిప్పుడు ఛందస్సు చెప్తున్నారు నాన్న... ప్రాక్టీసు కోసం రాసేనంటాను ... నాన్నకి చూపించి దిద్దించి పిస్తా(నా కావస్తే ... నాకేం భయంలేదు..."

"నిన్ను ఎస్సే పుస్తకం అడిగిందా లత ?"

"నిన్ను అడిగిందిగా... ఎవర్నడిగితేనేమిటి? నీకూ నాకూ బేధమేమిట్రా ... నిన్నడుగుతే నన్నడిగినట్టే... నీ ఎస్సే పుస్తకం ఒకసారివ్వు.. లత కిస్తానూ అన్నావ్. నువ్విివ్వడానికి బదులు నేనిచ్చేను. నువ్వే ఇచ్చి ఉంటే ఆ కవిత్వం అందులో ఉండగా, చూసుకో నీ పని ఏమయి ఉండునో ? నిన్ను ఆ ఇబ్బందిలో పెట్టడం ఇష్టంలేక ఈ పని చేసేను.. అయితే అమ్మాయి చిందులు తొక్కిందంటావ్... ఒరే రామం ... ఈ ఆడవాళ్ల సంగతి నీకు తెలీదురా... చూడు ఆ కవిత్వం జాగ్రత్తగా సెంటురాసి పెట్టెలో దాచుకుంటుంది... వాళ్లకి కావాలి బాబూ ..." వెంకటేశ్వరులు, ఆడదాని మనస్సంతా అర్థమై పోయినట్టు లెక్చెర్ ఇవ్వడం ఆరంభించేడు ...

"ఏం కావాలి వాళ్లకి..." రామం అడిగేడు ధైర్యం చేసి... వాడి మాటలు వింతగా అని పించేయి.

"ఏం కావాలా ? మరేం చదివేవురా తెలుగు సాహిత్యం... ఆడదానికి కావల్సింది పొగడ్తరా... పొగుడు... ఇంకా పొగుడు అన్నాడురా షేక్స్పియర్... వర్ణించు... ఇంకా వర్ణించు అన్నాడురా కాళిదాసు..." పి. ఎన్. ఆర్. ని అనుకరిస్తూ అన్నాడు వెంకటేశ్వరులు... "నీకే మన్నా ఆపదొస్తే నాకు చెప్పు. చక్రం అడ్డు వేస్తాను... అయితే లత చదివిందన్నమాట... గుడ్... వెరీగుడ్... ఇంక చూస్కో గురూ... దాని మనసులో ప్రేమ బీజాన్ని నాటేనుకదా ... దాన్ని ప్రేమించే, ఆరాధించే దాసుణ్ణి ఉన్నానని తెలియజేసేనుకదా ?... ఇంక ఎలా ఆ చెట్టు పెరుగుతుందో చూడు.. మరో నాలుగు పద్యాలు రాయమంటుంది అదే.. అవి రాసేక ఒక ప్రబంధం రాయమంటుంది..."

రామం భయపడ్డాడు. వీడు ఇంత వేగం ఈ గొడవలోంచి బయటపడేటట్టులేడు. వీడూ దిగుతాడు, తన్నూ దించుతాడు కష్టాల్లోకి — "నీ సంగతి వేర్రా... నా సంగతి ఆలోచించు. నిన్నెవడూ అనేవాడులేడు. నీతో నేను కలిసి తిరుగుతున్నాను. నువ్వు నా ఫ్రెండ్‌వి. నువ్వు మంచి చేసినా చెడ్డ చేసినా అందులో నాకూ సంబంధం ఉందంటారు..."

వెంకటేశ్వర్లు రామంకేసి గర్వంగా చూసేడు... "నేను మంచేకాని చెడ్డ చెయ్యే చెయ్యను. ప్రేమించడం చెడ్డని ఎవరంటారు ? లవ్ ఈజ్ డివైన్‌రా..." చదువు లేకపోయినా, తెలివి తేటలు ఇందులో బాగా సంపాదించేడు. "నిన్ను చూస్తే నాకు జెలసీ వేస్తుందిరా రామం. లతతోనూ, సావిత్రితోనూ, మీనాక్షి తోనూ చనువుగా మాట్లాడే భాగ్యం నీకు దొరికిందిరా, వారాలు చేసుకుంటేనేం... వాళ్లకి పాఠాలుకూడా చెప్తున్నావుట... నీ బతుకు ధన్యంరా తండ్రీ... విశాల చెప్పిందిలే నువ్వు పాఠాలు చెప్తానని... దానికి మీనాక్షి చెప్పింది... మీనాక్షికి సావిత్రి చెప్పింది... భూమి గుండ్ర మైనది... ఎక్కడ బయల్దేరితే అక్కడికే వస్తాం... నాకే ఆ ఛాన్సు దొరికితేనా గ్రంథాలు రాసి ఉంచునురా... లత మీద... అసలు దాన్ని సరిగా చూసే ఛాన్సు, మాట్లాడే మహాభాగ్యం నాకు లేదురా... అయితే పద్యాలు చదివిందన్న మాట... గుడ్... రేపు క్లాసులో నాకేసి ఎలా చూస్తుందో గమనించాలి... సిగ్గుపడుతూ చూస్తుందో... చిరునవ్వుతూ చూస్తుందో... అవి నేత్రంబులా... కావు... కంజ దళములు... అవి హస్తంబులా... కావు లతాంకురములు... అవి..."

(ఇంకా ఉంది)

# సూర్య ఫలకం

— "శిఖామణి"

వందేమాతరం గీతంతో సభ ప్రారంభమైనట్టు
కోకిల గీతంతో ఇదివరకటిలా
వసంతం ప్రారంభం కావడంలేదు.
ఆకుల చాటునుండి పాడిన కోయిల
పాట అంత అందంగా లేదు.
దాని గొంతులో కమ్మదనం నిండినా
గుండెల్లో శాంతి నిండుకుంది.
జెండాల పండుగనాడు
జెండా ఎగరగానే ఎందుకు కొడుతున్నాయో
తమకే తెలియకుండా చప్పట్లు కొట్టిన లేత అరచేతుల్లా
మొండి కొమ్మల మెనలలోనుండి
మొలుచుకొస్తున్న చిగుళ్లను
వసంతానికి ప్రతీకలనడం పాతకవి సమయం మిత్రమా !
ఇప్పుడు చెట్లు కూడా తమ లేత చిగుళ్లను చిదిమి
జెండాలుగా మీ చొక్కాలకు తగిలించి
మిమ్మల్ని ఎర్ర సైన్యంగా తయారుచేయడానికి సిద్ధపడుతున్నాయి.
ఆకాశం కూడా మేఘాలను
ప్రణయదూత్య పనినుండి విరమింపచేసి చాలా రోజులయింది —
ఏ అడవిలో ఏ తుపాకీ ఎందుకు మోగిందో
ఏ చెట్టు మొదట ఏ రక్తబిందువు ఎందుకు చిమ్మిందో
ఇప్పుడు మేఘాలు ఊరూరా తిరిగి ప్రచారం చెయ్యడానికి
సిద్ధంగా ఉన్నాయి.
సముద్రం కూడా ఇదివరకటిలా
కెరటాల బాహువుల్లో చందమామని కావలించుకోవడం కోసం
ఉబలాట పడటంలేదు
కల్లోలాల్ని కెరటాల కరపత్రాలపై ముద్రించి
లోకానికి పంచిపెడుతుంది —
జనగణ మనకు బదులు.
ఇంక్విలాబ్ జిందాబాద్‌తో సభ ముగుస్తుంది
విజయ శాసనం చెక్కించడం కోసం
తూర్పు సూర్యఫలకాన్ని సిద్ధం చేస్తుంది.



# బాపిరాజస్మృతి

సుమారు పాతిక ముప్ఫయ్యేళ్లపాటు ఆంధ్ర రసజ్ఞ లోకాన్ని పాటలతో, కధలతో, నవలలతో, చిత్ర లేఖనంతో ఉర్రూతలూరించిన శ్రీ అడివి బాపిరాజుగారు సెప్టెంబరు 22వ తేదీన కాలధర్మం చెందారు వారి మరణ వార్త యావదాంధ్రానికీ తీవ్రాఘాతమై తగిలింది. ఆంధ్ర సాంస్కృతిక రంగంలో పూడ్చరాని అగడ్త మిగిలింది.

నిత్యమూ కలలు కంటూ స్నేహితులకు, అభిమానులకు తన కలలు వినిపిస్తూ, ఆ కలల కోసమే బ్రతికిన స్వప్నశీలి స్నేహితుడనేవాడు కనిపిస్తే హృదయం విప్పి ఆప్యాయతనంతా వెళ్లబోసుకునే స్నేహశీలి. ఛందో నియామాలను కెళ్లగించుకుని ఝరీ వేగంతో వచ్చే భావ పరంపరలను ఎక్కడ ఉన్నా, ఏం చేస్తున్నా, ఏ కాగితం దొరికితే దానిమీద అప్పటికప్పుడు పాటలు పాటలుగా రాసివేసే కావ్య తపస్వి. చక్కని వర్ణ చిత్రాలు, అసంఖ్యాకంగా రేఖా చిత్రాలు దేశంపై మరిపించిన చిత్రకారుడు. ఆయన "నారాయణ రావు," "తుఫాను" "హిమబిందు" మొదలైన నవలలు, ఎన్నో చిన్న కధలు చదవని సహృదయుడు ఆంధ్రదేశంలో ఉండడు

బాపిరాజుగారి మనస్సు ఒక కళమీద నుంచి మరొక కళమీదకు భ్రమరంలా నిత్యభ్రమణం చేసేది. చిత్రకళ, కవిత్వం, కధలు, సంగీతం, నృత్యం అన్నిటినీ ఆయన వరించారు ఆఖరికి సినిమా కళను గూడా ఆయన వరించారు. కాని ఆ కళలో ఆయనకు తగిన అవకాశాలు రాకపోవటం ఒక దురదృష్టం ఆయన కళ కోసమే కలలు కంటూ జీవించారు. ఆ కలల నన్నిటినీ ముద్దగా చేసి "శశికళ" అనే మూర్తిని సృష్టించుకున్నారు. ఆ శశికళను బొమ్మల్లో, పాటల్లో, ప్రతిబింబించుకుని, చూసి, అందరికీ చూపించి మురిసిపోయేవారు "ఎవరండీ ఆ శశికళ ?" అని ఎవరన్నా అడిగితే "ప్రకృతిలోని సౌందర్యం, కళ్లలోని సౌందర్యం, నా ఆశయాల్లోని శౌందర్యం అంతా మూర్తీభవించిన ఒకానొక దేవత" అనేవారు.

చిత్రకళా రంగంలో బాపిరాజుగారు చాలా ప్రముఖమైన పాత్ర నిర్వహించారు. తనకు ఖ్యాతి నార్జించిపెట్టిన కొన్ని చిత్రాలు ఆయన చిత్రించటమేకాక, తెలుగుదేశంలో చిత్రకళకు, చిత్రకళను అభ్యసించేవారికి ఒక గౌరవనీయమైన స్థానం సంపాదించి పెట్టినవారు బాపిరాజుగారు. రాజమండ్రి ఆర్ట్సు కాలేజి ప్రిన్సిపాల్‌గా ఓ. జె. కూల్ట్రెగారు వచ్చి, దామెర్ల రామారావు, అడవి బాపిరాజుగార్లవంటి యువకులను ఆకర్షించి వారిచేత కళలో ప్రత్యేకమైన కృషి చేయించారన్నది అందరూ ఎరిగిన విషయమే. కూల్ట్రేగారి ఆగమనానికి పూర్వం తెలుగుదేశంలో చిత్రకళ ఏ స్థాయిలో వున్నదో తెలుసుకొంటే, యీనాటి సంఘంలో చిత్రకళకు యీమాత్రమైనా గౌరవం లభించటం అబ్బుర మనిపిస్తుంది. ఎంత ప్రయత్నించి చూసినా రామారావు, బాపిరాజుగార్లు చిత్రకళారంగంలో ప్రవేశించక పూర్వం పేరెన్నికగన్న ఆంధ్ర చిత్రకారుడు ఎవరూ వున్నట్లు తోచటంలేదు అంటే — చిత్రకళ అంతకుముందు స్తంభించిపోయింది అనలేము కానీ, ఆ రంగంలో జరుగుతున్న కృషిపట్ల సంఘంలో ఆదరణ లేకుండా పోయిందనిమాత్రం చెప్పగలం రామారావు, బాపిరాజుగార్లు చిత్రకళా రంగంలో ప్రవేశించకుండా వేరే రంగాలలో చేరి పొట్టలు పోసుకోవటంతో తృప్తిపడి వున్నట్లయితే, తెలుగుదేశంలో చిత్రకళ ముచ్చె పనివాళ్ళ చేతుల్లోనుంచికూడా దిగజారిపోయి, అసలు రూపు లేకుండా మాసిపోయేదే! అటువంటి హీనస్థితి రాకుండా వీరుభయులు మన సంఘాన్ని కాపాడారు. రామారావుగారు



చిన్న వయస్సులోనే తనువును చాలించినా, తాను వెలిగించిన కళాజ్యోతి వెలుగులో మరికొందరు కళాకారులు తయారయ్యే కట్టుదిట్టం చేసిపోయారు. బాపిరాజుగారు చిత్రకళలోని మర్మాలను తాను తరచి తరచి, తనకు తోచిన ఆ విశేషాలు, తాను పొందిన ఆ ఆవేశాలు, తెలుగునాట అంతటా ప్రతి ఒక్కరికీ చెప్పి, ప్రతివారిచేతను చిత్రకళకు గల ప్రాశస్త్యాన్ని గుర్తింపచేశారు.

ముందు యుగాల్లో ఎవరైనా తెలుగుదేశపు చిత్రకళ చరిత్రను వ్రాస్తే యీ 20వ శతాబ్దంలో యిక్కడ చిత్రకళ అడుగంటి పోకుండా పుద్ధరించిన గౌరవం బాపిరాజుగారికే అంకితం చేస్తారనటం అతిశయోక్తి కాబోదు.

కళకోసం ఆయనకొరకు దుఃఖిస్తున్న కుటుంబానికి సానుభూతి తెలుపుతూ, ఆయన ఆత్మకు శాంతి కలుగుగాక అని ఆశిందాం. ★

**ఆంధ్రపత్రిక—సచిత్ర వారపత్రిక**
**1952 అక్టోబరు 8**
**సంచిక నుంచి**

వంధీ మాగధులా!! తోడర్‌మల్ కాలం వాళ్లా!! అక్కర్లేదయ్యా!! మా "స్టాఫ్" వాళ్లే చాలు!!



# పుణ్యమరణం

మాడుగుల దుర్గావళి



"లక్ష్మీం క్షీర సముద్రరాజ తనయాం శ్రీరంగ ధామేశ్వరీం," పూజా కార్యక్రమాన్ని పూర్తిచేసింది కామేశ్వరమ్మ.

పంచపాత్రలో ఉన్న నీళ్ళను తులసికోటలోకి ఒంపి ఆ నీళ్ళు నెత్తిన చల్లుకుని రెండు చేతులూ జోడించి "తులశమ్మ తల్లీ బ్రతికి ఉన్నంత కాలం సంసారం చల్లగా సాగిపోయేటట్లు చేసి, పసుపు కుంకుమలతో ఈ తనువు భర్త చేతులమీదుగా దాటిపోయేటట్లు దీవించు తల్లీ," అంటూ మనస్ఫూర్తిగా ప్రార్థిస్తోంది కామేశ్వరమ్మ.

"ఇదిగో ఇవ్వాల్టితో మా ఇంట్లో వంతు అయిపోయింది. ఇంక ఒక్కపూటకూడా తిండి పెట్టేదిలేదు. అసలే ఈ నెల ముప్పై ఒక్క రోజు కూడా వచ్చింది. జరుగుబాటుంటే మహారాజులా సాగించుకుంటారు. సంపాదిస్తుంటేగా కష్టం సుఖం తెలిసేందుకు. ఉదయం వేడి నీళ్ళ స్నానం, కాఫీ, రెండుపూటలా భోజనం అంటే మాటలా. నేను చెయ్యలేను తల్లీ ఈ చాకిరీ," అంటోంది పక్కింటి పార్వతమ్మ పెద్ద కోడలు సుశీల.

"తిండికి తిమ్మరాజు పనికి పోతరాజు అని కానీ ఆదాయం లేకపోయినా నెలతిరిగేసరికి గబ్బిలంలా చూరుపట్టుకుని వ్రేలాడాల్సిందే. చచ్చిన వాళ్ళకి మాసికం వంటలు చెయ్యలేక, బ్రతికున్నవాళ్ళకి పంక్తి భోజనాలు అమర్చలేక ఛస్తున్నాను. ఏమైనా ఇవాళ ఇంట్లో పొయ్యి వెలిగించేది లేదు. అవతల వ్వయానా పినతండ్రి కొడుకు పెళ్ళి. ఓ పెళ్ళి, పేరంటం అంటూ వెళ్ళక ఇంటిని మెడకి కట్టుకు కూర్చుంటానా," ఆ గొంతు రెండో కోడలు సుమిత్రది.

"ఏమో బాబూ మళ్ళీ నెలకి తయారీ తద్దినం. ఇలా ఎంతకాలం జరగాలో. అత్తగారు బ్రతికున్నా ఈ పాట్లు తప్పేవి. ఆడది కనుక ఇంట్లో పనైనా చేసేది. అందుకే అన్నారు "అసలులేని అత్తగారికంటే ముండ మోసిన అత్తగారుంటే చాకిరీ అయినా చేస్తుందని," మావగారు పోయి అత్తగారు బ్రతికున్నా బాగుండేదన్న విషయం ఆ మాటల్లో స్పష్టంగా కన్పిస్తూనే ఉంది.

"అయినా ఓ పూట మాడితే వచ్చే నష్టం ఏంలేదు. పైగా ఇవాళ కార్తీక సోమవారం కూడాను. ఉపవాసం చేస్తే పుణ్యమే కానీ పాపం రాదు. నేపోతున్నా బాబూ," అంటోంది సుమిత్ర ఖచ్చితంగా.

రెండు వాటాల మధ్య తల వంచుకుని కోడళ్ళ మాటలు వింటూ ముద్దాయిలా నిలబడి ఉన్నాడు శేషయ్య.

మరో అరగంటవరకూ తోడికోడళ్ళిద్దరూ వంతుల ప్రకారం మావగార్ని ఆడిపోసుకుంటూనే ఉన్నారు.

పక్కింటివైపు ఓసారి దృష్టి సారించి దీర్ఘంగా నిట్టూర్చి పంచెపాత్ర పళ్ళెం తీసుకుని లోపలికి నడిచింది కామేశ్వరమ్మ.

అన్యమనస్కంగానే వంట ప్రారంభించింది.

"పార్వతమ్మ పోయి గట్టిగా నాలుగు నెలలైనా కాలేదు. పాపం పెద్ద వయసులోవున్న మావగారిని నిలబెట్టి మరీ వంతులుపోతున్నారు కోడళ్ళు. ఆవిడైతే అదృష్టవంతురాలే. పుణ్యేడు పసుపు కుంకుమలతో పచ్చగా వెళ్ళిపోయింది. ఈయనకి వచ్చిపడ్డాయి తిప్పలు. పోనీ ఎవరైనా పిలిచి ఓ పూట భోజనం పెట్టినా వాళ్ళనీ, మావగారినీ కలిపి దుమ్మెత్తిపోస్తారు. పార్వతమ్మ ఉండగా భర్తకి ఏ లోటూ రాకుండా ఎంత ప్రేమగా చూసుకునేది. భర్తపోయిన ఆడదానికే కాదు బాధలు, భార్యపోయిన మగాడికీ అంతే" అనుకుంది బాధగా కామేశ్వరమ్మ.

పార్వతమ్మ, కామేశ్వరమ్మ పక్క పక్క ఇళ్ళల్లోకి ఒకేసారి కాపరానికి వచ్చారు. పిట్టగోడే సరిహద్దు కావటంతో ఇద్దరికీ ప్రాణస్నేహం అయింది. ఒకరిని చూడకుండా ఒకరు ఉండలేక పోయేవారు. కాలం కల్సిరావటంతో ఇద్దరూ బిడ్డల తల్లులయ్యారు.

పార్వతమ్మకి ఇద్దరు మగపిల్లలు. భర్త ప్లీడరు గుమాస్తా చేసేవాడు. కొడుకులు ఇద్దరికీ పెళ్ళిళ్ళయి కోడళ్ళు కాపరానికి వచ్చేశారు. అత్తగారు బ్రతికి ఉన్నంతకాలం చాపకింద నీరులా ఉండేవారు. ఆవిడ పోయాక వాళ్ళ అసలు రంగులు బైటపడుతున్నాయి.

కామేశ్వరమ్మ భర్త పార్వతీశం. గవర్నమెంట్ ఉద్యోగం. ముగ్గురు పిల్లలు. ఇద్దరు ఆడపిల్లలకి చిన్నప్పుడే పెళ్ళిళ్ళు అయిపోయాయి. కొడుక్కి క్రితం సంవత్సరమే పెళ్ళయింది.



ఒక్కలి సాహిత్య సాంస్కృతిక సమాజాధ్యక్షులు శ్రీ ఆర్. పద్మనాభరావుగారు ప్రముఖ సంగీత విద్వాంసులు పద్మభూషణ డా. శ్రీపాద పినాకినిగారిని 'సంగీత మహర్షి' బిరుదుతో సత్కరిస్తున్నదృశ్యం.

అతను హైదరాబాదులో ఏదో పెద్ద కంపెనీలోనే పనిచేస్తున్నాడు.

మనసు పార్వతమ్మను గురించే తలపోస్తుంటే గడియారం తొమ్మిది గంటలు కొట్టింది. గబగబా వంట ముగించి భర్తను భోజనానికి పిలిచింది కామేశ్వరమ్మ.

*  *  *

"కావుడూ... కావుడూ నీ కొడుకు ఉత్తరం రాశాడోయ్," అంటూ భార్యను కేకేశారు పార్వతీశంగారు.

# పుణ్యమరణం

"వస్తున్నా," అంటూ చేతులు పమిట చెంగుకు తుడుచుకుంటూవచ్చి "ఏం రాశాడండి అబ్బాయి," అంది ఆతృతగా.

"అంతా కులాసాయేనట. త్వరలో కంపెనీ వాళ్ళు కట్టించే ఇల్లు పూర్తికాబోతోందిట. బహూశా రెండు నెలల్లో ఇల్లు మారతామని రాశాడు. ఎటూ నేను మూడు నెలల్లో రిటైరు కాబోతున్నాను కనుక ఇక్కడి ఇల్లు అద్దెకిచ్చేసి మనిద్దరినీ తన దగ్గరికేవచ్చి ఉండిపొమ్మని వ్రాశాడు," అన్నారు కళ్ళజోడు తీసి కండువాతో ముఖం తుడుచుకుంటూ.

"పిచ్చినాయన, పాపం వాడికి మనం అంటే ఎంతప్రేమో. పోనీండి ఇన్నాళ్ళనుంచీ అద్దె కొంపల్లో అవస్థలు పడుతున్నాడు. ఇప్పటికైనా సొంత ఇల్లు ఒకటి ఏర్పడుతోంది."

"అప్పుడే కొడుకుదగ్గరికి పోదాం అన్పిస్తోందేమిటోయ్ నీకు," అన్నారు హాస్యంగా.

"మీకు మాత్రం లేదేమిటి. ఒక్కగానొక్క మగబిడ్డ. ఆడపిల్లలు వాళ్ళ కాపరాలు వాళ్ళు చేసుకుంటున్నారు. వాడు అన్నట్లు రేపు మీరు రిటైరవగానే ఇల్లు అద్దెకిచ్చేసి వాడిదగ్గరకు వెళ్ళిపోదామండీ. నల్గురం ఓచోటే ఉండచ్చు," అంది సంతోషంగా.

"తొందరపడి నిర్ణయాలు తీసుకోవటం మంచిదికాదు కావుడూ. చూద్దాం ఇంకా పైముందిగా," అన్నారు ఏదో ఆలోచిస్తూ.

"మీరెప్పుడూ ఇంతే దేనికీ తొందరలేదు, అన్నిటికీ మీనమేషాలు లెక్కపెడతారు," అంది కోపంగా.

"కావుడూ. నువ్వు ప్రతిరోజూ శేషయ్యని చూస్తూనే ఉన్నావుగా. పాపం వాడి అవస్థలు పగవాడికికూడా వద్దు అన్పిస్తుంది. ఎలాంటి మనిషి ఎలా అయిపోయాడో వీళ్ళ చేతుల్లోపడి," అన్నాడు బాధగా.

"నిజమేనండీ, వాళ్ళు కోడళ్ళా కొరివిలు కానీ. పార్వతమ్మ ఉండగా ఆయనకి దేనికీ లోటు చెయ్యలేదు. ఈ రాక్షసుల చేతుల్లో పడ్డాడు. ఏం మనుష్యులో ఏమిటో", అంది జాలిపడుతూ కామేశ్వరమ్మ.

"అందుకే మనం తొందరపడకూడదు అంటున్నాను."

"మీరు చెప్పేది నాకు అర్థం అయింది లెండి. నా కొడుకు కోడలు అలాంటివాళ్ళేం కారు. నక్కకీ నాగలోకానికీ పోలికా ?"

"ఏదైనా స్వయంగా అనుభవిస్తేనే కానీ తెలియదు కావుడూ", అన్నారు నవ్వుతూ పార్వతీశంగారు.

"చాల్లెండి మీ మాటలు. అన్నింటికీ అనుమానాలే. ఈ కబుర్లకేంగానీ దసరాపండుగ

దగ్గరకి వచ్చేసింది, వెంటనే బైలుదేరి రమ్మని పిల్లలందరికీ ఉత్తరాలు రాయండి. కనీసం వాళ్ళకి పండగనాటికైనా అందుతాయేమో'', అంది వ్యంగ్యంగా.

''అబ్బ సాదించకోయ్ ఇవాళే రాస్తాను. అయినా నీ మాట నేను ఏనాడైనా కాదన్నానా కావుడూ. నువ్వంటే నాకెంత ప్రేమో నీకు తెలియదూ'', అన్నారు ప్రేమగా భార్యవంకే చూస్తూ.

''నాకు తెలుసండీ మీ మనసు. నా బ్రతుకంతా మీ చల్లని నీడలో ఇలాగే సాగిపోవాలి. మీ చేతులమీదుగా నా తనువు వెళ్ళిపోవాలి. అదేనండీ నేను కోరుకునేది, అదే నా జన్మకు సార్ధకత'', అంది ఆనందబాష్పాలు రాలిపోతుంటే.

''కావుడూ'', దెబ్బతిన్నట్లు చూశారు పార్వతీశంగారు.

''నేను నీకు ఏం లోటు చేశానని అలా అంటున్నావు'', అన్నారు ఆవేదనగా.

''ఏమిటండీ మీరనేది?'' అంది కామేశ్వరమ్మ తెల్లపోతూ.

''నిజం కావుడూ. మీ ఆడవాళ్ళు మహా సాధ్వులు. భర్తని ఆవగింజంత పనైనా చెయ్యనీకుండా అన్నీ అమర్చిపెట్టి వాళ్ళని ఎందుకూ కొరగాకుండా తయారుచేస్తారు. ఇప్పుడా శేషయ్య సంగతి చూడు. నీ సంగతి నువ్వు చూసుకుంటే నేను శేషయ్యలా అవస్థలు పడాలా?'', అన్నారు భయంగా.

''ఛఛ... ఎందుకండీ అలా అనుకుంటారు. అందరూ ఒకేలా ఎందుకుంటారు?''

''ఏమో కావుడూ, నాకు మాత్రం నీ చేతుల్లో సుఖంగా కన్నుమూయాలని ఉంది. ఇది నా కోరిక'', అన్నారు భార్య కళ్ళల్లోకి చూస్తూ.

''చాల్లెండి మీ మాటలు. నిండినింట్లో కూర్చుని శుక్రవారంపూటా ఈ అపభ్రంశపు మాటలు ఆడకండి,'' అంటూ పైటచాటు నుంచి మంగళసూత్రాలు తీసి కళ్ళకద్దుకుంది కామేశ్వరమ్మ.

పైకి అయితే అలా అంది కానీ ''భగవంతుడా! ఏమిటీయన ధోరణి. నేను ఒకలా జరగాలని కోరుకుంటుంటే ఈయన మరోలా అంటున్నారు. అంతా చల్లగా ఉండేలా దీవించు తండ్రీ,'' అంటూ మనసులోనే దణ్ణం పెట్టుకుంది కామేశ్వరమ్మ.

* * *

''అమ్మాయి త్వరగా తెమలండే, అవతల మగవాళ్ళు భోజనాలకి వచ్చేస్తున్నారు. ఆ పీట లిలావేసి అరటి ఆకులు కడిగి తీసుకురండి,'' అంటూ హడావుడి పడిపోతోంది కామేశ్వరమ్మ.

పండక్కి పిల్లలంతా రావటంతో ఆవిడ ఆనందానికి అంతులేకుండా ఉంది.

## తగ్గిన బంగారం మోజు!

పశ్చిమ జర్మనీలో ప్రతి యేటా 25 లక్షల వజ్రాలు ఆభరణాలు అమ్ముడు పోతున్నాయి. వజ్రాల ఆభరణాల వాణిజ్యంలో పశ్చిమ జర్మనీకి తృతీయ స్థానం లభిస్తున్నది. మొదటి రెండు స్థానాలు అమెరికా, జపానుకు చెందుతున్నాయి. అయితే, ఇటీవల బంగారంపై ప్రజల మోజు తగ్గింది. బంగారానికి బదులు ప్లాటినమ్‌ని ఆభరణాల తయారీకి ఉపయోగిస్తున్నారు. 1976లో 40 కిలోల ప్లాటినమ్‌ను మాత్రమే ఆభరణాల కోసం వినియోగించారు. ఇది 1983 నాటికి 1.2 టన్నులకు పెరిగింది. వివాహాల సందర్భంగా బహుమతి ఉంగరాలు, చేతి కఫ్ లింకులు ప్లాటినమ్‌తో తయారుచేసినవే ఎక్కువగా అమ్ముడు పోతున్నాయి.

అందరి భోజనాలు పూర్తి అయినాయి. అంతా హాల్లో చేరి కబుర్లు చెప్పుకుంటున్నారు. పిల్లలు గోల చేస్తున్నారు. మాటల మధ్యలో కొడుకు తమను పదే పదే, హైదరాబాద్ వచ్చి తన దగ్గర ఉండమని చెప్పటంతో గర్వంగా భర్త వంక చూసింది కామేశ్వరమ్మ.

మరో అరగంటకల్లా అంతా భుక్తాయాసంతో మధ్యాహ్నం నిద్రకు పడ్డారు. కూతుళ్ళతో కబుర్లు చెబుతూనే తనూ ఓ పక్కకి ఒదిగి పోయింది కామేశ్వరమ్మ.

నిద్ర మధ్యలో నాలుక పిడచకట్టి దాహం అన్పించటంతో మెలకువ వచ్చింది.

లేచి వంటింట్లోకి నడిచి మంచినీళ్ళు త్రాగుతుంటే పెరట్లో పిట్టగోడ దగ్గర ఏవో మాటలు విన్పించినట్లయి ఎవరా అని కిటికీ లోంచి తొంగి చూసింది కామేశ్వరమ్మ.

తన కోడలు రాధ, పార్వతమ్మ కోడలు సుశీల కబుర్లు చెప్పుకుంటున్నారు. ''ఒక ఊరి వాళ్ళు, పైగా చిన్ననాటి స్నేహం కూడాను,'' అనుకుని వెనుతిరగపోయిన ఆవిడకి వాళ్ళ మాటల మధ్య తను ప్రసక్తి రావటంతో అప్రయత్నంగా అక్కడ ఆగిపోయింది.

''మీ అత్తగారు మామగారు రిటైరవగానే మీ దగ్గరకే వచ్చేస్తారటగా,'' అంటోంది సుశీల.

''ఎవరు చెప్పారు, అలా అని?'' సన్నగా అంటోంది రాధ.

''మీ ఆయన ఉత్తరం రాశాట్ట, అలా అని మీ అత్తగారు అందరికీ చెబుతోందిలే. అయినా అప్పుడే నీ కెందుకీ చింత. హాయిగా ఇద్దరూ చిలాకాగోరింకల్లా సుఖంగా ఉండక. పెళ్ళాం వచ్చిన మావతో మా పాట్లు చూస్తున్నావుగా చెయ్యలేక చస్తున్నాం. నువ్వయినా సుఖపడు తల్లీ. ఓసారి అంటించుకుంటే ఇంక వదులుతారా?''

కామేశ్వరమ్మకి సుశీల మాటలు కోపం తెప్పించినాయి. ''అయినా ఆ మాటలు తనకు లెక్కేమిటి. తన కోడలు మంచిది. ఎదుటి వాళ్ళకి బుద్ధి వచ్చేలా జవాబు చెబుతుంది,'' అనుకుంది గర్వంగా.

''ఆయన అలాగే రాస్తారులే. అదంతా నేను సాగనిస్తానా ఏవిటి? అసలే వాళ్ళకు ఖర్చు లెక్కువ. ఇక్కడిలా సుష్టుగా తినాలన్నా, ఖర్చు చెయ్యాలన్నా అక్కడ కుదురుతుందా? మా జీతాలు మాకే చాలటంలేదు, రేపు పిల్లాజెల్లా పుడితే చెప్పక్కర్లా. ఈ లంపటాన్ని ఎవరు



# ఇ'వేమన'పద్యాలు




రోగియైనవాడు రోగి నెఱుంగును
రోగి నరపిచూచి రూఢిగాను
రోగి కిడినవాని రాగి బంగారౌను
విశ్వదాభిరామ వినుర వేమ.

## పుణ్య మరణం

నెత్తిన పెట్టుకుంటారు బాబూ,'' అంటోంది విసుగ్గా రాధ.

''ఆ మాత్రం తెలివి ఉంటే చాలు. ఎలా అయినా మీ ఆయన మనసు మార్చెయ్యి. ఈ రోజుల్లో ఇంకా అమ్మా నాన్నా అనేవాడిని ఇతన్ని ఒక్కణ్ణే చూశాం.''

''చూస్తూరుగా ఎలా మారుస్తానో. ఆయన నామాట జవదాటరు. మా మావగారు రిటైరైతే మాత్రం ఇక్కడేం ఊరు లేదా? ఇల్లు లేదా? ఇప్పుడే ఎందుకు నా నెత్తిన ఎక్కటానికి. ఒకరుపోతే ఇంకొకరు వంట మనిషి, తోటమాలో ఎలాగూ తప్పరు మా ప్రాణానికి. అయినా మీ బాధలు చూస్తుంటే నాకూ మా మావగారు పోతేనే నయం అన్పిస్తోంది సుమా,'' అంటున్న కోడలి చివరి మాటలు విన్న కామేశ్వరమ్మ అవాక్కయి పోయింది.

ఐదు నిముషాల తర్వాత తేరుకుని ''ఎంత మాట అంది కోడలు. నేను కోరుకునేది ఒకటైతే కోడలి కోరిక వేరొకటా? భగవంతుడా ఇదా వీళ్ళ అంతర్యం.''

ఎలాగో వెళ్ళి దేముడిగదిలో కూర్చుండి పోయింది మౌనంగా.

*　　*　　*

ఇన్నాళ్ళూ నేను పునిస్త్రీగా భర్త సన్నిధిలో పోవాలని ఎంత తెలివితక్కువగా కోరుకున్నాను. నేనంటే పంచప్రాణాలు పెట్టే ఆయన్ని, నాకు ఏకాస్త నలతగా ఉన్నా కలతచెందే ఆయన్ని, దేవుడిలాంటి ఆయన్ని ఇలాంటి వాళ్ళకి వదిలి నేను పసుపు కుంకుమలతో పుణ్య మరణం పొందాలని ఎంత అవివేకంగా ఆలోచించాను. భర్త సేవలుచేస్తూ, ఆయన కష్టసుఖాల్లో పాలు పంచుకుంటూ ఇన్నాళ్ళూ బ్రతుకుబాటలో కల్సి ప్రయాణంచేస్తున్నా నా సంగతి నేను చూసు కున్నానేతప్ప నా తర్వాత ఆయన సంగతి ఏమిటి అన్న ఆలోచనే నాకు రాలేదు. ఒకవేళ నేనే ముందు పోతే ఆయన ఇలాంటి కోడలిదగ్గర అష్టకష్టాలు పడుతూ శేషయ్యగారిలా చీదరింప బడుతూ నికృష్టంగా బ్రతకాల్సిందేనా? అమ్మో... దేవుడిలాంటి ఆయనకి కష్టాలా? ఉహూ... వద్దు... వద్దు...

నిజంగా భర్తను ప్రేమించి, భర్త సుఖాన్ని కాంక్షించే ఏ ఆడది అయినా అతనికంటే ముందుగా చనిపోవాలని కోరుకోదేమో. భర్తను అన్ని విధాలా సుఖపెట్టి బ్రతుకులో, చావులో కడదాకా అతనికి సేవలుచేసి కడతేరుస్తుందేమో? కానీ నేను ఏం కోరుకున్నాను? ఎంత పిచ్చి దాన్ని. పుట్టిన ప్రతి జీవికి చావు తప్పదు. కాస్త ముందూ వెనకా అంతే. ఎటూ చావు తప్పనపుడు అది ఎలాంటిదైతేనేం? పునిస్త్రీగా పోతే ఊరివాళ్ళ ప్రశంసలందుకోవటమేగా. చచ్చిన జీవికి పాపపుణ్య విచక్షణతో శిక్ష ఎటూ తప్పదు. అది ఎలాంటిదో ఎవరికీ తెలియదు. మిడి మిడి జ్ఞానంతో తలోరకంగా ఊహించుకోవటం తప్ప మిగిలిన ఆడవాళ్ళసంగతి ఎలా ఉన్నా ఇది నా అంతర్యంలో ఉన్న నిజం. ఇది కేవలం నా కోరిక.

కోడలి మనస్సేమిటో ఇప్పుడు పూర్తిగా తెల్సిపోయింది. అత్తమామల్ని తోటమాలి వంట మనుష్యులతో పోల్చిందిగా. రేపు ఆగతి పట్టించినా ఆశ్చర్యంలేదు.

''భగవంతుడా! నేను మనస్ఫూర్తిగా నా భర్త సుఖ సంతోషాలే కోరుకుంటున్నాను. ఇంకెప్పుడూ నేను పునిస్త్రీగా పోవాలనుకునే ఆ పుణ్య మరణం నాకు నేనుగా కావాలని కోరుకోను. నా ముఖాన బ్రహ్మలిఖితం ఎలా ఉందో అలాగే జరగనీ,'' కన్నీళ్ళతో దేవుణ్ణి వేడుకుంది కామేశ్వరమ్మ. ★

సీరియల్

# కర్మయోగి

డా॥ కె.వి. కృష్ణకుమారి

(గత సంచిక తరువాయి)

పద్మిని వంకే మౌనంగా చూస్తున్నాడు కృష్ణారావు.

అంత అందమైన లేత మొహం వాడినా అదొక అందంతో వింతగా మెరుస్తోంది. బంగారుతీగెలా వున్న పద్మిని మొహాన్ని విచారం ఆందోళనా మబ్బుతెరల్లా కప్పేస్తూనేవుంది. ఆ యవ్వనపు పొంగూ పరిపూర్ణ లావణ్యం, ముగ్ధమోహన సౌందర్యం ఎదుటివాళ్ళను పిచ్చివాళ్ళను చెయ్యగల అర్హతను స్వంతం చేసుకున్నా — కొత్త పెళ్ళికొడుకుగా — ప్రథమ సమాగమం రాత్రి — అంత అందాల బొమ్మకి అంత చేరువగా వున్న కృష్ణారావు దృష్టికి పద్మిని మరోరకంగా కన్పిస్తోంది. ఆ అందమైన సొగకళ్ళల్లో పసిపాపల నిర్మలత్వం తేటతెల్లంగా వుంది. నునుపైన చెక్కిళ్ళ నిగారింపులో పసివాళ్ళ పాలబుగ్గలే మెరుస్తున్నాయి. ఆ లాస్యంలో — పడుతున్న భంగిమలో, ఆ ముగ్ధ మోహన ఆకృతిలో మృదుమధుర లాస్యంలో — చూసినకొద్దీ ఒక అద్భుత ఆకృతి లీలగా కన్పిస్తోంది. సౌందర్యపు ముద్దలా వున్న పద్మినిలో — తన కారాధ్యనీయమైన ప్రతిమ లెన్నో విచిత్ర కాంతులతో కళ్ళముందు దర్శన మిస్తున్నాయి. తన హృదయంలో పులకింత. హృదయ కుహరంలో గగుర్పాటు... దైవనిర్మిత మైనమనసులో చిరుగంటల ప్రతిధ్వనులు ... తన్మయతతో కళ్ళు మూసుకున్నాడు కృష్ణారావు. మనసులో పద్మినిమూర్తి. ఆత్రంగా కళ్ళు తెరిచాడు. పద్మినిలో శ్రీకృష్ణుని ఛాయలు.

"భగవాన్ !!! —

ప్రతీవారిలోనూ — ప్రతీ అణువులోనూ — నిర్వచింపలేని శూన్యంలోనూ — నిక్షిప్తమైన అగాధాలలోనూ — అనంతమైన ప్రకృతి అణువణువునా — నీ ప్రతిరూపాలే ఐన జీవుల బింబ ప్రతిబింబాలలోనూ — అంతర్లీనమై దృగ్గోచరం కాని అనంత ఆత్మలోనూ— నువ్వే— నీ దివ్యరూపమే—నీ కాంతిపుంజ సముదాయాలే— నీ అఖండజ్యోతి తాలూకు అనంతమైన వెలుగే— కన్పిస్తోంది. ఆత్మీయతతో దరిచేరమని ఆదేశిస్తోంది — ఆప్యాయతతో ఆలింగనం చేసుకోమని ఆహ్వానిస్తోంది — కృష్ణా!!! — ఈ భావనెందుకింత మధురంగా వుంది ? —ఎందుకింత అద్వితీయంగా అనిర్వచనీయంగా వుంది ? — క్షణక్షణానికీ నా మనసు ప్రేమపూరితమూ అనురాగమయమూ ఐపోతోందెందుకని — రాగ ద్వేషాలకూ, కామక్రోధాలకూ—మోహభ్రమలకు — దూరమై — అతిప్రశాంతపూరిత మైపోతోం దెందుకు ? —

ఎందుకు ??? —

కృష్ణారావు కళ్ళలో నీటి తెరల చాటులో— అమృతం వర్షించే భావనలో అనురాగపూరితమైన దృక్కులలో— పద్మిని తాలూకు భావన అతి విచిత్రంగా వుంది.

పాలబుగ్గల పసిపాపలా — తన చేయూత నాసించే పసి వయసే కన్పిస్తోంది.

మూర్తీభవించిన ఆ ప్రశాంత వదనంలో కన్నతల్లిని చూస్తున్నానన్న భావనే పరమ పునీతంగా వుంది.

పద్మిని అద్భుతమైన స్త్రీ మూర్తిలాగే వుంది. ఐతే ఆ మూర్తిలో తనకు కన్పిస్తున్న ప్రతిరూపాలు వేరు. తనకు అనుభవ మౌతున్న అనుభూతులు వేరు. తన మనసును స్పందింప జేస్తున్న భావనలే వేరు.

పద్మినిని దగ్గరకు తీసుకోవాలనే వుంది.

కానీ భార్యగా కాదు.

ఆ భావనలో ఉద్రేకం లేదు.

పద్మిని వడిలో విశ్రాంతి తీసుకోవాలన్పిస్తోంది. కానీ భార్యా భర్తలన్న భావన మచ్చుకకు కూడా లేదు. తనే పసిపిల్లాడినన్న భావన కలుగుతోందెందుకు ? ఆ వడిలో మాతృత్వపు అనుభూతిని మాత్రమే అందుకోవాలన్పిస్తోం దెందుకు ?

ఎందుకని ? ? ?

"పద్మినీ..."

కృష్ణారావు కంఠం తనకే విచిత్రంగా అన్పించింది.

చూసినకొద్దీ విచిత్రంగా కన్పిస్తున్న భర్తని రెప్పవెయ్యకుండా చూస్తోంది పద్మిని.

"ఇప్పుడెలా వుంది?... వొళ్ళునొప్పులు..."

"సర్దుకున్నాయి."

తను సర్దుకోబోతూ సిగ్గుపడింది పద్మిని.

"పడుకో...పడుకో..."

ఆప్యాయంగా పడుకోపెడుతున్న భర్తలో ఎటువంటి వికారమూ కన్పించటంలేదు.

చల్లని ఆ స్పర్శలో తనలో గూడు కట్టుకున్న బాధలూ, వ్యథలూ దూది పింజల్లా ఎగిరిపోతున్నాయి.

ఏమిటీ విచిత్రం ???

తనెంత భయపడుతూ వచ్చింది ?

భార్యగా అతను దగ్గరకు తీయడనుకుంది. తను విన్న వైరాగ్యాన్నే ప్రదర్శిస్తాడనుకుంది. అత్తయ్య ఆశలు ఏ విధంగానైనా తీరేవికావనే దృఢ నిశ్చయంతోనే వచ్చింది. కారణం తన అనారోగ్యం ఒకటి. రెండవది భర్త వైఖరి...

కృష్ణారావు మెడదాకా దుప్పటి కప్పుతుంటే—ఆలోచించే వోపికలేనట్టు కళ్ళు మూసుకుంది పద్మిని. గుండె వేగంగా కొట్టుకుంటుంది. రోజుకన్నా కూడా...ఇంకా ఎంతో వేగంగా—తనకతి పరిచితమైన హృదయ స్పందన వింత శబ్దంచేస్తూ విచిత్రంగా విన్పిస్తోంది. గుండె చిక్కబట్టినట్టై బాధ భరించలేనట్టు అందమైన కనుబొమ్మలు విచిత్రంగా ముళ్ళు పడ్డాయి.

"పద్మినీ...ఏమిటీ బాధ !!!"

పద్మిని కళ్ళల్లో చివ్వున నీళ్ళు తిరిగాయి.

ఆత్రంగా తనవంకే చూస్తున్నాడు కృష్ణారావు.

**జరిగిన కథ — 11 :** తులశమ్మగారు గత జీవితాన్ని శ్రీహరిగారితో చెప్పి హృదయభారాన్ని తగ్గించుకొంటారు. కృష్ణారావు తల్లి ఆవేదనని చూసి చలిస్తాడు. తల్లి కోరిక ప్రకారం పెళ్లి చేసుకొనుటకు అంగీకరిస్తాడు కృష్ణ. కృష్ణ పెళ్లి పద్మినితో నిశ్చయమవుతుంది. కృష్ణారావు, పద్మినిల వివాహం జరిగిన కొద్దిగంటలకే పద్మిని తల్లి యశోదమ్మ మరణిస్తుంది. యశోదమ్మ కర్మకాండ అనంతరం పద్మినితో కూడ కృష్ణప్రియను తమ దగ్గరకే పంపమని రామచంద్ర రావుకి చెప్పి తులశమ్మ కృష్ణారావుతో కలిసి తమ ఊరు వెళ్లిపోతారు. పద్మిని, కృష్ణప్రియల రాకతో తులశమ్మగారి ఇంట్లో చైతన్యం వస్తుంది. కృష్ణారావు చర్యలకు అందరూ ఆకర్షితు లవుతారు. శోభనం నాటి రాత్రి మూర్ఛవచ్చి పడిపోయిన పద్మినికి సేవలు చేసి అనునయిస్తాడు కృష్ణ.



అంత ఆపేక్షగా—అంత సన్నిహితంగా, అంత చేరువుగా తన భర్త...తన సర్వస్వం... తనకోసం ... కేవలం తనకోసం బాధ పడు తున్నారు. కానీ—తను తనేం చేస్తోంది ?

ఏం చెయ్య గలుగుతుంది ???

ఏం చెయ్యగలదు !!! — అసలు విషయం ఎలా చెప్పగలదు ???. దిండులో తలదించుకుని ఏడుస్తోంది పద్మిని.

ఆత్మీయుల సన్నిధిలో ఆవేదన అదుపులు తప్పుతుంది.

నిక్షిప్తమైన వేదన కార్చిచ్చులా వేధిస్తూ వుంటుంది.

తన వారున్నారన్న భావన బేలతనాన్ని అధికం చేస్తుంది. అందుకే ? — అందుకేనా ఇంత బాధ?? —

ఎందుకీ బాధ ???

''పద్మినీ...మన మధ్య ఎటువంటి అరమరికలూ వుండకూడదు ... నా ప్రవర్తనను బట్టి అర్ధం చేసుకున్నావనే అనుకుంటున్నాను... ఎంతో కాలం దైవపరమైన ఆలోచనలతో—దైవంతోనే గూడు కట్టుకుని వున్న మనసుతో—దైవం కోసమే స్పదించే హృదయంతో నా తృప్తి కోసం బ్రతికాను. కానీ—దైవం నా కళ్ళు తెరిపించాడు. ఆ పంథాలో నడవటానికి నాకనుమతి నివ్వటానికి నిరాకరించాడు. సంకుచిత మనుకుంటున్న ఎందరి మనసులనో నాకు ఆదర్శంగా చూపించాడు. సర్వవ్యాప్తమైన తన ఉనికిని అద్దంపెట్టి చూపించాడు. నా పరిధిలో నీకు చేతనైనంతలో—నా శక్తి మేరకు తనే నిండి వున్న ప్రాణులకు న్యాయం చెయ్యమని ఆదేశించాడు. అందుకే ... పద్మినీ — అమ్మలో కృష్ణయ్యని చూశాను. అమ్మ కన్నీళ్ళను చూడ లేకపోయాను. వదినలోనూ ఆయన్నే చూశాను. అందుకే ఆవిడ బాధను భరించలేకపోయాను. ఫలితంగా మన వివాహం జరిగింది ... పద్మినీ — నువ్వు ఎవ్వరివల్లా ఏ రకమైన బాధనూ అనుభవించటం నేను సహించలేను. ఆ బాధ నావల్లే కలిగిందైతే — అంతకుమించిన భగవదపచారం మరొకటి వుండదు. నువ్వు— నాలో నిన్ను చూసుకో— నీ కష్టాలూ— బాధలూ నీతో చెప్పు కున్నట్టే నాతో చెప్పుకో— తీర్చటానికి ప్రయత్నిస్తాను. కాదు కాదు— తీవ్రంగా కృషి చేస్తాను— ఆ తృప్తి నాకు దక్కనియ్యి పద్మినీ —''

కృష్ణారావు కళ్ళల్లో మెరుస్తున్న ఆర్ద్రతకీ —

ఆ కంఠంలో వినిపిస్తున్న దైన్యానికీ —

ఆ మూర్తిలో కనిపిస్తున్న పవిత్రతకీ — నిశ్చేష్టురాలైంది పద్మిని.

ఒక అర్ధరాత్రి మెలుకువ వచ్చి చివ్వున లేచి కూర్చుంది పద్మిని.

గదంతా చీకటి అలముకున్నా చిరుదీపం ప్రశాంతంగా వెలుగుతోంది. రాత్రి జరిగిన సంఘటన గుర్తుకు వచ్చి ఆత్రంగా చూసింది.

గది ఖాళీగా వుంది - బోసిగా వుంది.

మరి !!!—

హడావుడిగా బాల్కనీలోకి వచ్చింది — శిలా ప్రతిమలా నిలబడిపోయింది— బల్లమీద దిండు కూడా లేకుండా నిశ్చలంగా నిద్రపోతున్నాడు కృష్ణారావు.

వెన్నెల్లో స్ఫటికంలా మెరుస్తున్న భర్తని చూస్తూ —

ఆ వర్చస్సుకి ముగ్ధురాలౌతూ—కృష్ణారావు కాళ్ళ దగ్గరే కూర్చుండిపోయింది.

జడలో అరవిచ్చిన మల్లెలు మత్తుగా నవ్వుతున్నాయి.

జాజుల సువాసన గాలితో కలిసి అల్లరి పెడుతోంది, మాలతీ లతలు మధురంగా పలకరిస్తుంటే. మత్తెక్కించే సువాసనలు కలగా పులగంగా కమ్ముకుంటుంటే — పద్మిని పెదాలు మ ధు ర ం గా విచ్చుకున్నాయి. మరుక్షణంలో బాధతో ముకుళించుకు పోయాయి.

గుండెను పట్టినొక్కే బాధ—

చిరపరిచితమైన వోర్చుకోలేని బాధ.

తన వశంలో లేక చిత్రహింసలు పెట్టే బాధ... గుండె అరచేతో రుద్దుకుంటూ బల్ల మీద తల వాల్చుకుంది పద్మిని.

అలికిడికి మెలకువ వచ్చింది కృష్ణారావుకి పరిసరాలన్నీ క్షణం కొత్తగానే అనిపించాయి

# క ర్మ యో గి



ఇటీవల ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ (న్యూఢిల్లీ)వారి తెలుగు సంఘం 'చైతన్యలహరి' రక్తాక్షి ఉగాది ఉత్సవం జరుపుకొన్న సందర్భంలో శ్రీ ఇచ్ఛాపురం జగన్నాథరావు ప్రసంగిస్తున్న దృశ్యం. శ్రీ గౌరీశంకర్, శ్రీ ఎవ్. విజయ గోపాల్‌గార్లని కూడా చిత్రంలో చూడవచ్చు.

ఏదో గుర్తుకు తెచ్చుకుంటున్నట్టు దిక్కులు చూస్తూ — పద్మినిని చూసి ఛివాలున లేచాడు.

''పద్మినీ ... ఏమిటిది ? — ఇక్కడికొచ్చావెందుకు...''

బాధతో మెలికలు తిరుగుతున్న పద్మిని జవాబు చెప్పలేకపోయింది.

''బాధ . గుండెల్లో నెప్పి... దాహం...''

అంత చలిలోనూ విపరీతంగా చెమటలు పట్టి మెలికలు తిరుగుతూ బాధ అణుచుకొనటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్న పద్మినిని అమాంతం ఎత్తుకుని మంచం దగ్గరకు తీసుకు వెళ్లాడు.

దిళ్ళు సర్ది దుప్పటి కప్పుతూ దీనంగా చూస్తున్న పద్మినివంక వోదార్పుగా చూశాడు.

''ఆఁ... ఆఁ అమ—''

మంచినీళ్ళు రెండు గుటకలు మ్రింగి ఇంక చాలన్నట్టు వారించింది.

ఏమైందని అడగటానిక్కూడా నోరు రాలేదు కృష్ణారావుకి.

''నొప్పా ! ఇక్కడా ?''

ఎడమవైపు ఛాతీమీద చెయ్యి పెట్టిన కృష్ణారావుకి ఆశ్చర్యాన్ని అణుచుకోటం కష్టమైంది.

మామూలుగా గుండె కొట్టుకునే ''లబ్—డబ్'' అన్న శబ్దం బదులు విచిత్రమైన శబ్దం అరచేతికి తగులుతోంది. క్షణక్షణానికీ ఆ శబ్దం వికృతంగా విన్పించటం చేతిని స్పర్శించటం గమనించి కృష్ణారావు మొహం వివర్ణమైంది.

''పద్మినీ—''

''...క్షమించండి... నాకు గుండె జబ్బు కూడా— అయితే... అమ్మకీ, కృష్ణకీ ఇది అంత ప్రమాదం కాదని చెప్పించాను... కానీ... కానీ నేను...... నేను దాంపత్య జీవితానికి అర్హురాల్ని కాను... అమ్మ తృప్తికోసం... మిమ్మల్ని మోసం చేశాను... అత్తయ్యని మోసం చేస్తున్నాను...''

రెండు చేతులో తల దాచుకుని పసిపాపలా వెక్కిళ్ళు పెడుతున్న పద్మినిని నిశ్చేష్టుడై చూస్తూ వుండిపోయాడు కృష్ణారావు.

*   *   *

పద్మిని గది బైటకు వచ్చాక తలపై కెత్త లేకపోయింది.

నలిగిన పువ్వులూ— ప్రయత్నపూర్వకంగా సర్దుకున్నట్టున్న చీరె కట్టడం నిద్రలేనట్టు ఎర్రబారిన అందమైన కళ్ళూ— తడబడుతున్న నడకా— తల వంచుకున్న వైఖరీ ఇంటిల్లపాదికీ— కొత్త అర్థాలు చెప్పి... సరికొత్త ఊహాగానాలకు తావిచ్చినట్టైంది.

ఆత్రంగా తనవంక చూస్తున్న అత్తగారికి సమాధానం చెప్పలేనట్టు తలవాల్చుకుంది.

ఎగతాళి పట్టించబోతున్న లక్ష్మినుంచి మృదువుగా తప్పించుకుంది.

తెల్లవార్లూ నిద్రలేక మథనపడిన కృష్ణప్రియ పద్మినివంక ఆవేదనగా చూసింది. బుజాలు పట్టుకు కళ్లతోనే ప్రశ్నించింది.

ఆ కన్నీటిపొరల అర్థాలు తెల్సు పద్మినికి.

ఆ మూగవేదన తాలూకు అంతర్గతమైన ఘోష తెల్సు.

ప్రాణాలు చిక్కబెట్టుకు చూస్తున్న ఆ లేత హృదయపు లోతులు తెల్సు తనకి.

అందుకే చిన్నగా నవ్వింది.

నిజంగా నవ్వింది.

ఐనా కన్నీళ్ళు తొణికాయి. అర్థరహితమైన అక్క కళ్ళవంక గుచ్చి గుచ్చి చూస్తూనే వుంది కృష్ణ.

"బావగారు మానవమాత్రుడుకాడు కృష్ణా.. దైవం.. మన పాలిట దైవం. నిజంగా అదృష్టమంతా మనది —"

అటుగా వెడుతున్న తులశమ్మకి పద్మిని మాటలు స్పష్టంగా విన్పించాయి. ఏదో అడగాలని ఆరాటపడుతున్న ఆవిడ హృదయం — భరించలేనంత సంతోషంతో నిండిపోయింది.

* * *

ఆ రోజు రాత్రి చెప్పకుండానే పెందరాళే వస్తున్న కొడుకునిచూసి ఏనుగెక్కినంత సంబరపడిపోయింది తులశమ్మ.

కృష్ణారావు మొహం ప్రశాంతంగా వుంది. స్వచ్ఛంగా వుంది. నిర్మలంగా వుంది. తను భయపడ్డ భావాలేవీ కన్పించకపోవటంతో—మనసులోనే దేముడికి దణ్ణాలు పెట్టుకుందావిడ.

"ఇవాళకూడా ఎందుకక్కా —"

వోపికగా పూలజడి వేస్తున్న తనని యధాలాపంగానే అందని ఎంత సరిపెట్టుకుందామన్నా, మధ్యాహ్నంనుంచీ సమాధానపడలేకపోతోంది లక్ష్మి.

ఎంతో సన్నిహితంగా వుండే తన దగ్గర కూడా ఏదో దాచాలని ప్రయత్నించటం కనిపెట్టకపోలేదు.

"భగవంతుడా కృష్ణకు వారసత్వపు లక్షణాలు రాకూడదు. పద్మినికీ నా దురదృష్టం రాకూడదు."

మనసులోనే మథన పడుతున్నా పైకి ఎంతమాత్రం తేలలేదు లక్ష్మి.

అపరంజిలా అడుగుపెడుతున్న పద్మినికి ఆదరంగా ఎదురు వెళ్ళాడు కృష్ణారావు.

"ఇవాళెలా వుంది ?—"

ఆ ఆదరణని తట్టుకోలేకపోయింది పద్మిని.

తనేదో అన్యాయం చేసినట్టు — అతని జీవితం తనవల్లే నాశనమైపోయినట్టు కేవలం స్వార్థంకోసం నిజాన్నిదాచి అమాయకులతో చెలగాటాలాడుతున్నట్టూ, ఆ పాపం తనని నిలువునా దహించి తీరుతుందనీ...జీవితాంతం అనని శిక్ష భయంకరంగా వెటాండి తీరుతుందనీ లోపల్లోపల కుమిలిపోతూనే వుంది. ఎవ్వరూ చూడలేని—ఎవ్వరూ చూడకూడని కన్నీటిని ఇప్పటిదాకా అతిప్రయత్నం మీద దాచుకుంది. ఇప్పుడా అవసరం లేదు. కన్నీటితో కాళ్ళు కడిగినా నిష్కృతికోసం అర్థించినా — తన బాధంతా చెప్పకోవాలనుకున్నా—బాధతీరే అవకాశమంటూ ఏదైనావున్నా — ఇదే సమయం—ఆ అవకాశం ఈ సన్నిధిలోనే దొరుకుతుంది.

"అలా బాల్కనీలోకి వెడదాంరా—"

తను కోరుకునేది ఈ అవకాశాన్నే.

"ఇవాళ భోజనం చేశావా?—"

పరిశీలనగా తననే చూస్తుంటే—మాటలు కరువైనట్టు తలదించుకుంది.

"లేదు కదూ..."

"........"

"మనసు బావుండకా ?...శరీరం బాగు పడకా???—"

"రెండూ..."

పద్మిని కళ్ళు చివ్వున నీటిని చిమ్ముతున్నాయి.

"మనసు బావుండకపోతే బాగు చెయ్యటానికి నేనున్నాను ... శరీరం బావుండకపోయినా..."

"అవును...అన్నిటికి అన్నివిధాలా నన్నాదుకోటానికి మీరున్నారు. మీరు మానవమాత్రులు కారు..."

ఇబ్బందిగా చూశాడు కృష్ణారావు.

"అంతంత పెద్దమాటలెందుకు పద్మినీ — ఎవరి మనసునూ బాధపెట్టే తత్వం కాదునాది. అలా అని నా మనసునూ బాధపెట్టుకోలేను. కారణం చెప్పానుగా—ఆ భగవంతుడ్ని బాధపెట్టినట్టవుతుందని. ఇది కనీస ధర్మంగా నేనను కుంటున్నాను. ఇందులో పొగడాల్సిన అవసరం వుంటుందా?—"

ఆ పవిత్రమూర్తి వంక ఆరాధనతో చూసింది పద్మిని. తననే సూటిగా చూస్తున్న ఆ కళ్ళ వాడిని తట్టుకోలేకపోయింది.

"...పోనీ మానవధర్మంగా — మీరు మానవుడిగానే వొప్పుకుంటూ—మానవ ధర్మాలను నెరవేర్చాలని నిశ్చయించుకున్నారు. కదూ—"

నిన్నటికీ — ఇవాల్టికీ పద్మినిలో ఎంతో మార్పు కన్పిస్తోంది.

ఒక్కరోజులోనే! ఇంత మార్పు సహజమా? సహజమేనేమో !!

ఆ కళ్ళల్లో బెరుకు స్థానంలో ఆరాధన చోటు చేసుకుంది.

మాటల్లో క్రొత్తదనంపోయి సన్నిహితత్వం ధ్వనిస్తోంది.

ఆ తీరులో లాలిత్యంతోబాటు ఆప్యాయత కన్పిస్తోంది.

ఆ మూర్తిలో ఆత్మ విశ్వాసం అంతర్లీనంగా వుంది... అర్థంలేని భావాలతో అగమ్యంలోకి తొంగిచూస్తోంది.

అనంతమైన హృదయపు లోతు గమనిస్తూ మౌనంగా వున్నాడు కృష్ణారావు.

"సమాధానం చెప్పండి —"

పద్మిని కంఠం జాలిగావుంది.

"అవునేమో !!!"

అనిశ్చయంగా అన్నాడు కృష్ణారావు.

"మరి అటువంటప్పుడు — మానవ సహజమైన కోరికలు దూరంగా పారిపోవుగా...,సిగ్గుతో ఎఱ్ఱబడిన మొహాన్ని దాచుకుంటూ — ఏదో చెప్పబోయి —మరేదో చెప్పానేమోనన్న ఆలోచనలో పడిపోయింది.

తొందరపడ్డానేమోనన్న భావనా —

ఎక్కువ పరిచయంకూడా లేకుండానే — పచ్చిగా అడిగేశానేమోనన్న బాధా —

భార్యగా — అనకూడని మాట అన్నానా అన్న సందేహం —

చుట్టుముట్టి ఉక్కిరి బిక్కిరి చేశాయి పద్మినిని.

అసలు విషయం అర్థమైపోయింది కృష్ణారావుకి.

పద్మినిపడే బాధా, దిగులూ, వ్యథా అంతా స్వార్థంకోసంకాదు.

"తనకోసం "

భర్తకు అన్యాయం చేస్తున్నానేమోనని — తనవల్ల 'తన'కి శారీరకంగా మానసికంగాకూడా సుఖం వుండదేమోనని...

పిచ్చిపిల్ల. ఈ భర్తకి కావల్సిన విజమైన




ఇటీవల నగర కేంద్ర గ్రంథాలయ సంస్థ (హైదరాబాదు)లో మానస ఆర్ట్ థియేటర్స్ ఆంధ్రప్రదేశ్ కార్టూనిస్టుల అసోసియేషన్‌వారి సంయుక్త ఆధ్వర్యంలో క్యాప్షన్‌లెస్ కార్టూన్ల ప్రదర్శన మరియు కవి సమ్మేళనం సందర్భంగా ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీ సముద్రాల జూనియర్ ప్రసంగిస్తున్న దృశ్యం. ప్రక్కనే ఉన్నవారు కార్టూనిస్టు సుధామ. శ్రీ జి.ఎస్.ఆర్. శ్రీ తోపల్లి ఆనంద్, శ్రీ రఘుశ్రీ, శ్రీ కె.వి. భాస్కరరావు (సభాధ్యక్షులు) లను కూడ ఈ చిత్రంలో చూడవచ్చు.

# కర్మ యోగి

సుఖం శరీరపరమైంది కాదనీ — సంసార సుఖం కోసమే వివాహం చేసుకోలేదనీ — ఈ సుఖాలు తననెంత దూరమైతే — అసలైన చిన్మయానందానికీ, భగవన్నామస్మరణకీ తనంత దగ్గరౌతాననీ — నిజానికి అంతర్గతంగా తను ఆశించేది కూడా అదేననీ పద్మినికి ఏ విధంగా చెప్పాలి ???

ఏవిధంగానైనాసరే చెప్పాలి.

ఆవిడ అశాంతిని దూరం చెయ్యాలి.

ప్రశాంతికి మరింత దగ్గరదాన్ని చెయ్యాలి.

తన లక్ష్యం స్పష్టంగా కళ్ళముందు నిల్చింది

మరింత ప్రకాశంగా వెలుగుతున్న భర్త కళ్ళను విస్మయంగా చూస్తోంది పద్మిని.

''పద్మినీ — నేను విన్నంతవరకూ — నిన్ను గమనించినంతవరకూ — నువ్వు విద్యాధికురాలివీ— భగవద్గీతను క్షుణ్ణంగా చదివినదానివే అవునా?''

అవుననీ కాదనీ చెప్పలేక పోయింది పద్మిని

''మనం భార్యా భర్తలంగా కాదు. అంతకన్నా సన్నిహితమైన ఆత్మపరమైన అనుబంధంతో మాట్లాడుకుందాము— అమ్మకి నేనంటే మమకారం ఎక్కువ అందుకే అందర్లా నేనూ పెళ్ళి చేసుకోవాలనీ— తను మనవల్ని ఎత్తుకోవాలనీ—ఈ వంశం నిలవాలనీ— ఎంతో కలవరించింది...''

''అవునవును... మన పెళ్ళి అయేదాకా జరిగిన విషయాలన్నీ నాకు తెల్సు... అత్తయ్యగారూ— అక్కయ్యా— క్షుణ్ణంగా నాకు చెప్పేశారు.''

పద్మిని కంఠం గద్గదంగా వుంది.

గీతాన్ని వినలేదనీ—విని ఆ బాధను తట్టుకోలేదనీ— చెప్పినందువల్ల— ఆ లేత మనసు తనేదో చెయ్యలేదన్న బాధ పడటం తప్ప— తను ఆశించే ప్రయోజనం నెరవేరదనీ— ఇంక ముందు చెయ్యగలిగిందీ చెయ్యాల్సిందీ మాత్రమే విడమర్చి మాట్లాడటం, ఓదార్పు నందించి ఆ కన్నీళ్ళను శాశ్వతంగా తుడవటాన్ని మించిన కర్తవ్యంలేదని నిశ్చయించుకోటానికి ఎక్కువసేపు పట్టలేదు కృష్ణారావుకి

''పద్మినీ, ఏ క్షణాన ఏం జరుగుతుందో ఏ క్షణం ఎవరికి ఏ విధంగా నిర్దేశింపబడిందో— ఏ క్షణం మన జీవితాన్ని అనూహ్యమైన మలుపు తిప్పుతుందో ఆ జగన్నాటక సూత్రధారి ముందే నిర్ణయించి వుంటాడు. ఆ నిర్ణయం ప్రకారమే మనం నిర్ణయాలు తీసుకోనటం జరుగుతుంది ఆయన చూపించిన పంథానే మనం అనుసరించటం జరుగుతుంది. మొదట్నుంచీ వివాహమంటే విముఖత్వం వున్న నన్ను వివాహం చేసుకోమని ఆదేశించిందీ ఆయనే— నాతిగల బ్రహ్మచర్యం గడపవల్సిందిగా పరిస్థితులు కల్పించిందీ ఆయనే— ఇందులో బాధపడే అంశంగానీ, బాధపడాల్సిన అగత్యంగానీ వుండదు— వుండకూడదు. అన్ని యోగాల్లోకీ కర్మయోగం అత్యంత సులభమనీ— సర్వులకూ ఆచరణయోగ్యమనీ— ఆ ప్రయోజనాన్ని నావల్ల తన వాళ్ళకి అందజెయ్యాలనీ ఆయన సంకల్పం కావచ్చు. అందుకే నా మనసు నాకే విచిత్రమన్పించే విధంగా మారిపోయింది. తన అభీష్టం, నా అభీష్టం కూడా తీరాలనే ఇటువంటి పరిస్థితిని కల్పించివుంటాడు. జరిగేదానికీ, జరగబోయేదానికీ— మనం కర్తలం కాము. నీ మనస్సు ప్రశాంతంగా హాయిగా వుంచుకుంటే— అదే నీ పరంగా నువ్వు చేసే మహోపకారం. అప్పుడే నీ విధిని నువ్వు సక్రమంగా నెరవేర్చిన దానివి అవుతావు.''

## ధర్మపథం

-బుడసు వెంకట రమణయ్య



## సదభిప్రాయం

**త**న్ను పొగడినవాళ్లను మెచ్చుకోవడం, నిందించినవాళ్లను తిట్టుకోవడం సాధారణంగా మానవుల స్వభావం. కొందరు ఇతరుల నిందలను పట్టించుకోక తమ్ము గూర్చిన ప్రశంసలనే నలుగురుకీ చెప్పుకుంటారు. కవుల సంగతీ, రచయితల సంగతికూడా యింతే! తమ రచన బాగా ఉన్నదని చెప్పేవాళ్లని పొగడడం, బాగులేదన్నవాళ్లను తిట్టడం సామాన్య రచయితల లక్షణం. ప్రఖ్యాత విద్వత్కవులు తమ పుస్తకాలపై సదభిప్రాయాలిస్తే, తమ రచనకు శోభ కలుగగలదని, వారిని ప్రార్థించి సదభిప్రాయాలను సంపాదించి గ్రంథాదిని ఘనంగా అచ్చు వేయించుకోవడం తరచు కానవస్తుంది. పుస్తకం ఎలాగున్నా సదభిప్రాయం లభించవచ్చును. "రచన బాగా లేకపోయినా మీరు ప్రశంశిస్తూనే అభిప్రాయమిచ్చారే!" అని అభిప్రాయ ప్రదాతను అడిగితే" ఏం చెయ్యమంటారు? సదభిప్రాయం కోసం రచయిత పదిసార్లు తిరిగాడు. ఇయ్యక తప్పిందికాదు." అని సమాధానం యివ్వడం పరిపాటియే! కొందరు విద్వాంసులు స్థాలీపులాక న్యాయంగా చూచేమనీ, బాగానే వుందనీ ఎటూకాకుండా అభిప్రాయం ఇస్తారు. కొన్ని పుస్తకాలలో సగం పేజీలు సదభిప్రాయాలే కానవస్తాయి.

గ్రంథం విలువ సదభిప్రాయాలమీదనే ఆధారపడి ఉండదు. స్వయంగా విలువలేని దానికి సదభిప్రాయాలు విలువను చేకూర్చలేవు. విలువలేని వాటిపై మంచిగాజేస్తే అభిప్రాయపు దాతల గౌరవానికే లోటు. రచయిత సదభిప్రాయాలపై ఆశ పెట్టుకోక తానే తన రచనకు విలువను చేకూర్చుకోవాలి. స్వయంగా విలువ ఉన్న రచనను అందరూ మెచ్చుకుంటారు. సదభిప్రాయం చేర్చకపోతే తమ రచనకు విలువ ఉండదని రచయిత భ్రాంతి పడకూడదు. విద్వాంసుల అభిప్రాయాలను ఆశించక రచయిత శ్రమించి విలువైన రచన చెయ్యడానికే ప్రయత్నించాలి. దానివల్ల ఇతరులను ఆశ్రయించే శ్రమ తగ్గుతుంది. ముద్రణ వ్యయంకూడా కొంత తగ్గుతుంది. ఉత్తమ రచన ఎప్పుడూ సదభిప్రాయాన్ని యాచించకూడదు. 

భర్తవంకే కన్నార్పకుండా చూస్తోంది పద్మిని.

కన్నీళ్ళు ముత్యాల్లా బుగ్గలమీద జారుతూనే వున్నాయి.

"...ఏమిటిది ? ఈ కన్నీళ్లేమిటి చిన్నపిల్లలా."

చిన్నపిల్లని బుజ్జగిస్తున్నట్టే వుంది.

"...నేను నిజంగా అదృష్టవంతురాల్ని — కళ్లీ, తండ్రీ, దైవం..."

"చాలు—చాలు"

చిన్నగా నవ్వుతూ లేచాడు కృష్ణారావు.

"...మీరు, మీరెక్కడ పడుకుంటారు ... మీరే ఇక్కడ పడుకోండి...నేనే..."

ఎంతచెప్పినా దుఃఖాన్ని అదుపులో పెట్టుకోలేకపోతున్న పద్మినిని జాలిగా చూశాడు కృష్ణారావు.

"నీ ఆరోగ్యం సరైంది కాదు — నీకన్ని శుశ్రూషలూ చెయ్యాల్సిన బాధ్యత నామీదుంది. మన సంసార రహస్యం నీ మనసులోనే వుంచుకుని అమ్మకు మనశ్శాంతి నందించటం — అన్నివిధాలా నీ ఆరోగ్యాన్ని కాపాడుకోటం నీ చేతుల్లో వుంది. ఇంక పడుకుంటావా ?"

ఆ కళ్లలోని తేజస్సు — ఆ మనిషిలోని వర్చస్సు—పద్మినిని మూగదాన్ని చేశాయి.

"పాలు...పాలు తీసుకోండి."

"కృష్ణార్పణం"

ఆ పెదాల విరుపులోని అందాల హరివిల్లును ప్రతిభురాలై చూసింది పద్మిని.

* * *

తెల్లవారుతుండగా మెలకువ వచ్చింది పద్మినికి. బ్రహ్మకాలం దాటుతోందేమో ... గాభరాగా మంచం దిగింది. పడక సర్ది బాల్కనీలోకి వచ్చింది. కృష్ణారావు అప్పటికే యోగాసనంలో నిశ్చలంగా కూర్చుని వున్నాడు.

ఆ అరమోడ్పు కళ్లల్లో చిన్నికృష్ణుని చిద్విలాసాలు దాక్కొని వున్నాయేమో!

ఆ పెదాల చలనంలో పవిత్ర గీతామృతం నిక్షిప్తమై వెలుగొందుతుందేమో!

ఆ పవిత్ర వక్షస్థలంలో జగన్నాథ సూత్రధారుడు స్థిరనివాసియై వెలుగులీనుతున్నాడేమో!

ఆ బ్రహ్మ వర్చస్సుకు చేతులు జోడించింది పద్మిని.

ఎంతో ఉత్సాహంగా కల్పించుకు మరీ పన్లు చేస్తున్న పద్మినిలో తృప్తీ, ఆనందం, ఆహ్లాదం, పోటీలు పడుతున్నాయి.

తనే చూడని సరిక్రొత్త అందాలు అక్కయ్య మొహంలో వింతగా కన్పిస్తుంటే కృష్ణప్రియకి వింతలో వింతలా వుంది.

"అక్కయ్య మామూలుగాకూడా లేదు. ఇంత సంతోషంగా అక్కయ్యని నేనెప్పుడూ చూడలేదు..."

కృష్ణప్రియని ఆప్యాయంగా చూసింది లక్ష్మి.

"పోన్లేమ్మా— నీ దిగులంతా కూడా అక్కయ్య గురించేగా — ఇకనుంచీ నువ్వు పద్మిని లాగే వుండాలి. విచారంగా వుండటానికి వీల్లేదసలు —"

మధురంగా నవ్వింది కృష్ణప్రియ.

"ఈ ఇంట్లో అడుగు పెట్టినప్పుడే — దిగులూ — విచారాలు దూరమవటం మొదలు పెట్టాయి. వెలివెయ్యబడ్డట్టు — కాటేసే మనుష్యుల మధ్య బతికాం ఇన్నాళ్ళూ. కపటం, కాలుష్యం, ఈర్ష్య, ద్వేషం — ఇవే మా చుట్టు ప్రక్కల వుండి — మానసికంగా మమ్మల్ని తినేశాయి. ఇక్కడికొచ్చాకే బాగా తెల్సింది. దేవాలయాల్లాంటి ఇళ్ళూ — దైవత్వాన్ని నింపుకున్న... దైవస్వరూపులూ — రాగద్వేషాల కతీతమైన వాతావరణం..."

"బావుంది మన్లోమనం పొగుడుకోటమే సరిపోతోంది — మనందరిదీ ఒకే మనసు కాబట్టే ఒకేచోటికి జేర్చాడా దేముడు — ఆయన సంకల్పం వల్లే — మళ్ళా ఇల్లు నిండుగా కళకళలాడుతోంది —"

లక్ష్మికి సహాయం చేస్తూన్న అక్కాచెల్లెళ్ళిద్దరూ తృప్తిగా నవ్వుకున్నారు.

"...అప్పుడే పూర్తి కళ ఎప్పుడొచ్చిందే — ఈ నట్టింట్లో పసిపాప నవ్వులు విన్పించాలి... వంశం వృద్ధికావాలి..."

పూజకోసం తులసీదళాలు అందించబోతున్న పద్మిని మొహం క్షణంలో వివర్ణమైంది. అత్తగారి దోసిట్లోకి దళాలు బరువుగా జారాయి.

**( ఇంకా వుంది )**

# ఏలోకాలకో ఎగసిన ఎక్కిరాల పవిత్రాత్మకు శ్రద్ధాంజలి

సూర్యభగవానుడు కనిపించని రోజు ఎలా దుర్దినమని పిలువబడుతుందో, అదే విధంగా ఫాల్గుణ పౌర్ణమి పర్వదినం యావదాంధ్రులకు, దేశ విదేశాలలో వున్న శిష్యకోటికి దుర్దినమై పోయింది.

కులపతి, జగద్గురు పీఠ సంస్థాపకులు, ప్రఖ్యాత హోమియో వైద్యులు మార్చి 17తేది ఉదయం 2 గం. కు పరమపదించారన్న వార్త రేడియోలో విన్న ప్రజలందరూ దిగ్భ్రాంతి చెందారు. విశాఖ వాసుల సంగతి చెప్పనే అక్కర లేదు. వానా, వరదా, భూకంపము, లేకుండా, పిడుగుపాటుకు మహా వటవృక్షం నేల కూలితే, చల్లని నీడలో తలదాచుకుంటున్న పక్షిసంతానాలు ఎలా అలమటిస్తాయో వాళ్లను చూస్తే తెలుస్తుంది. నగరం నగరమంతా రాధామాధవానికి కదలి నడచింది. అశ్రుధారలతో అభిషేకించి, పూలమాలలతో అర్చించి ఆయన భౌతిక దేహాన్ని కడసారి చూచుకొని, దురదృష్టంలోనే అదృష్టాన్ని చూచుకున్నారు.

వారి వైద్యంలో, వారి ఉపదేశ వాక్యాలలో, శారీరిక, మానస, బాధలుపశమింప చేసుకునేవి కొన్ని వేలకుటుంబాలంటే అతిశయోక్తి ఎంత మాత్రం లేదు.

జాతి మత భేదాలు లేకుండా, సర్వులూ, భగవంతుని ప్రతిరూపాలని చాటిచెప్పి, అనేక సార్లు యూరప్ దేశాల్లో పర్యటించి, భారతదేశమెంత ఆధ్యాత్మ విద్యా సంపన్నమో ప్రపంచానికి తెలియజేసిన భారతమాత ముద్దుబిడ్డ కాలమనే కరకు కత్తికి బలి అయ్యారంటే ఆ నష్టం యావద్భారత దేశానిదికాని ఒక ప్రాంతానికి సంబంధించిది మాత్రం కాదు.



వందలకొలదీ జీతాలు తీసుకుంటూ, చదువు చెప్పడం మాని యింటిదగ్గర ప్రైవేట్లు చెప్పకుని ధనమార్జించుకునే ఉపాధ్యాయులందరకూ మార్గదర్శకులుగా ఏ విధమైన ప్రతిఫలాపేక్ష లేకుండా అనేక రంగాల్లో క్లాసులు నడిపి అసంఖ్యాక శిష్యులచే పూజింపబడుతున్న మహానుభావులు, ఆ విద్య తనదగ్గర నిక్షిప్తమై ఉండిపోతుందేమోనన్నట్లుగా ఆఖరిసారిగా, మరణానికి కొద్ది రోజులు ముందు మోతుగూడెంలో యోగాభ్యాసం క్లాసులు నడిపారు. వాక్శుద్ధిగల మహనీయులు ముందుగానే తెలుసుకున్నట్లు ఇంక ఇంతకంటె చెప్పడానికేమీ లేదు. ఇవే హయ్యెస్ట్ క్లాసెస్ అని అన్నారుట. తన ఉపన్యాసాలలోను, తను వ్రాసిన గ్రంథాలలోను, ఉపనిషత్తులసారము, భారత భాగవత పురాణాలలోని అంతరార్థములు, పతంజలి మహర్షి యోగ సూత్రములు, వినిన, చదివిన ప్రతివారికీ సుబోధకమయ్యే విధంగా వేదాంతసారమంతా ఉగ్గుపాలతో రంగరించి పోసినట్లు, పోసి దేశవిదేశీయుల నలరించి మెప్పించిన భాగవతోత్తములు.

చల్లని మాటలతో రోగ బాధలు సగం శమింపజేసి తియ్యని మాత్రలతో బాధలు లేకుండా రోగాలు కూడా నశింపజేసి, బాధా నివారణ కాదు ముఖ్యం రోగ నిర్మూలన అనే ఉపదేశాలతో తనదంటూ ప్రత్యేక వైద్య విధానాన్ని ఆచరించి చూపి ప్రత్యక్షంగా నేర్పిన అపర ధన్వంతరి. ఈనాడు వారి అసంఖ్యాక శిష్యులెంతమంది ఉచిత వైద్యశాలలు నడుపుతూ మానవ సేవే మాధవసేవగా భావించి ఆయన చూపిన మార్గాన నడుస్తున్నారో చెప్పలేము.

తానున్నచోట వెలుగు నిచ్చే దీపంలా కాకుండా, అనేకవేల దీపాలు వెలిగించిన దివ్య జ్యోతి. ప్రతి మనిషిలోనూ వున్న పరమాత్మకు మందిస్తున్నామని భావించండి. అటువంటివాళ్లే నా వద్ద నేర్చుకోడానికి రండి, ధనోపార్జన కొరకు కాదు అని నిర్మోహమాటంగా చెప్పిన ధైర్యశాలి.

తాను వైష్ణవుడైనా ప్రతి పర్వముననూ అఖండ రుద్రాభిషేకములతో శ్రోతల చెవులు తుప్పొదుళ్లగొట్టి, శివ కేశవుల కభేదము ప్రకటించిన మహాజ్ఞాని.

ఇలా ఎన్ని చెప్పినా తరగడంలేదు. కొండ అద్దమందు కొంచెమైనట్లు నేను వ్రాసిన దానికి పదింతలు నూరింతలు వేయింతలుగా వారి సుగుణ సంపద పాఠకులు గ్రహిస్తారుగాక.

జన్మ నిచ్చినతల్లి, జన్మకు కారకుడయిన తండ్రి, ఎంత పూజనీయులో, జన్మకు సార్థకత నిచ్చే విద్యనిచ్చి జీవిత గమనాన్ని నిర్దేశించిన గురువులు గూడా అంత పూజనీయులుగాబట్టే "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" అనే సూక్తి పుట్టింది.

"మీ ఆశీస్సులవలన నా మందులు బాగా పని చేస్తున్నాయి మాష్టారూ" అంటే చాలా సంతోషించి, నీకు దైవబలం వుంటుంది కృషి చేస్తూ ధైర్యంగా మందులిస్తూ వుండమని నాకు ప్రోత్సాహాన్నిచ్చిన గురువర్యులు — భాగీరథీ ప్రవాహంలాగ, వేలాది కుటుంబాలలో ఆరోగ్యపు పంటలు పండించిన మహానుభావులు, చిన్న నీటి చెలమలాగ, కొద్దిమందికి దాహం తీర్చి బాధోపశమనం చేసే శక్తి నాకు ప్రసాదిస్తారని ఆశిస్తున్నాను; నమ్ముతున్నాను.

(పూజ్యులు, పితృతుల్యులు, గురువుగారి దివ్య స్మృతికి సమర్పిస్తున్న చిన్ని కానుక.)

— మండపాక నాగమణి



# బొమ్మా బొరుసు

వెహారా వెంకట సుబ్బారావు

మెడికల్ చెకప్‌కోసం హాస్పటల్‌కు వెళ్ళి నడచి వచ్చి వీధి అరుగు మీదనే చతికిలపడి ఆయాసపడుతున్న నిండుగర్భిణిలా— ఆ ఎక్స్‌ప్రెస్ ట్రైన్ యింజను వాల్తేరు స్టేషన్ చేరి హమ్మయ్య అనుకొంది. నిట్టూర్చింది కాబోలు! పెద్దగా శబ్దం చేస్తూ స్టీమ్‌ని బయటకు వదలింది.

ట్రైన్ ప్లాట్‌ఫారం మీదకురాగానే ప్రయాణీకుల్లో అలజడి రేగింది. దెబ్బతిన్న తేనెపట్టు ఈగల్లా చెల్లా చెదురుగా పరుగెత్తసాగారు. నా అర్ధాంగి పార్వతిలోకూడా కంగారెక్కువైంది.

"మన పెట్టె ఎక్కడుందో చూడండి!" నన్నుకూడా కంగారు పెడుతోంది. సామాన్లు పోతాయేమోనన్న బెంగతో పిల్లలవైపూ వారి చేతుల్లో వున్న సామాన్లవైపూ చూస్తున్నా. పెద్దబ్బాయికీ పెద్దమ్మాయికీ చెరో రెండు సామాన్లూ, నాకు పెట్టె ఒక సంచీ అప్పగించింది పార్వతి. తానొక ప్లాస్టిక్ వైర్‌బేగ్‌ను తీసుకొంది. తిరిగి యిల్లు చేరేవరకూ ఎవరి సామానులను వారు జాగ్రత్తగా చూసుకోవాలని చెప్పింది. అంతా తమ తమ సామాన్లను పట్టుకొని లేచి నిలబడి వున్నారు.

"ఏవిటలా నీళ్లు నములుతూ చూస్తున్నారు? మన కంపార్టుమెంటెక్కడుందో చూడండి!" తొందర చేయసాగింది పార్వతి.

"ఎందుకమ్మా కంగారు? మన బెర్తులు రిజర్వు అయాయిగా! కంపార్టుమెంటు ఎక్కడుందో చూసుకోవాలి!" నిదానంగా చెప్పాడు ఇంటర్ చదువుతున్న మా పెద్దబ్బాయి రమేష్.

"ట్రైన్ ఇక్కడ అరగంటకి పైనే ఆగుతుంది! కంగారు పడకు!" నిదానంగా చెప్పింది పెద్దమ్మాయి.

సామాన్లు జాగ్రత్తగా చూసుకోమని చెప్పి మా బోగీ ఎక్కడుందో చూడ్డానికి వెళ్లా. బోగీ దొరికింది. సామాన్లు తీసుకొని బయలుదేరాం. ముందుగా రమేష్ వాడి వెనుక పార్వతి పెట్టెలో జొరబడ్డారు. వారి వెనుక తక్కిన ముగ్గురుపిల్లలూ నేనూ ఎక్కాం—మావిమొత్తం ఆరు బెర్తులు. వరుసనెంబర్లు. ఆడుగు బల్లల మీద ఎవరో ముగ్గురు స్త్రీలు కూర్చొని వున్నారు.

"ఈ బెర్తులు మావి! దిగండి!" దబాయించాడు రమేష్. వారు వులుకూ పలుకూ లేకుండా మూగవారిలా ప్రవర్తిస్తున్నారు. పార్వతిలో సహనం నశించింది.

"మిమ్మల్నే! చెబితే వినబడదూ? ఖాళీ చేయండి" హుంకరించింది పార్వతి. వారు జవాబు చెప్పలేదు. ప్లాట్‌ఫారం వైపు చూస్తున్నారు.

"చూడండి! మొండితనం! ఖాళీచేయడం లేదు! మీరూ ఒకసారి చెప్పండి!" నాతో ఫిర్యాదు చేసింది. సామాన్లు లెక్కపెట్టు



# బొమ్మా-బొరుసు

కొంటూ వాటిని బల్లలకింద సర్దే ప్రయత్నంలో వున్న నేను ఆ గొడవని అంతగా పట్టించుకోలేదు. పార్వతీ పిల్లలూ అంతా నిలబడే వున్నారు.

"వీళ్లు కాళీచేసేట్టు లేరండీ! బెర్తుకి పది రూపాయలపోసి కొనుక్కొన్నాం! వెళ్లి కండక్టరుకి చెప్పండి!" హుకుం జారీచేసింది.

వాళ్లని పరీక్షగా చూసా! ఒరియా వాళ్లలా వున్నారు. నన్ను చూసి దిగపోతాం అన్నట్టు సైగచేసారు. ఇంతలో ఎవరో యిద్దరు వచ్చి వాళ్లని దింపుకొని వెళ్లారు. ఆ ఆరు బెర్తుల నెంబర్లనీ మరోసారి వెరిఫై చేసాడు రమేష్. ముప్పై నెంబరు నుంచి ముప్పైఅయిదు వరకూ. ఆ బెర్తులవైపు తృప్తిగా చూసింది పార్వతి. ఆ బెర్తులకి తానే మహారాణిని అన్నట్టు మురిసిపోయింది. ఆమె కళ్లలో గర్వం తొణికిసలాడింది. పిల్లలు నలుగురూ తమ తమ బెర్తుల విషయంలో వివాదపడుతున్నారు. మా దురదృష్టం కొద్ది రెండు అప్పర్, రెండు మిడిల్ కూడా దొరికాయ్. అప్పర్ బెర్తులు అందరికీ నచ్చలేదు. అంతాలోయర్ బెర్తులకే ఎగబడుతున్నారు. నేను సర్దిన సామాన్లన్నింటినీ బయటకు తీసి మరోలా సర్దుకొంది పార్వతి తినుబండారాల సంచీనీ, గ్లాసులూ వాటర్ జగ్గు వున్న సంచీని బయటకు తీసిఎదురుగా పెట్టింది. పిల్లలు యింకా వాదించుకొంటున్నారు. అంతా కిటికీదగ్గరే కూర్చోడానికి చూస్తున్నారు.

"ఏవిటండి ఎక్కడికొచ్చినా గొడవ! చూసిన వాళ్లు నవ్వుతారు! వాళ్లని కేకలెయ్యండి" నామీద కేకలు వేసింది పార్వతి. బెర్తులని ఎలాట్ చేసాను. పెద్దమ్మాయి పెద్దబ్బాయి అప్పర్ బెర్తులు తీసుకొంటారు. మిడిల్ బెర్తులు ఇద్దరు చిన్నపిల్లలకే. అడుగునున్నవి నాకూ పార్వతికి. పిల్లలందరూ అసంతృప్తిని వ్యక్తం చేసారు. ఎలాగో సముదాయించాను. ఆఖరి అమ్మాయి దాహం అనడంతో అసలు విషయం గుర్తు కొచ్చింది. వాటర్ కేన్‌ని బయటకుతీసి అందించింది పార్వతి. కేన్‌ని తీసుకొని ప్లాట్‌ఫారం మీదికి వెళ్లా. తిరిగి వచ్చేసరికి యిద్దరు పెద్దమనుషులు మా బెర్తుమీద కూర్చొని వున్నారు. నన్ను చూసి కాళీచేసి ఎటో వెళ్లిపోయారు. పోతూన్నవాళ్లని చూస్తూ అంది పార్వతి —

"మేం రిజర్వు చేసుకొన్నాం! కూర్చోకండి అని చెప్పినా వినలేదు."

"ప్రయాణీకుల మనస్తత్వం అలాంటిది. ఒక్క నిమిషం కూర్చున్నా చాలు అనుకొంటారు! రిజర్వేషన్ కోసం కొన్ని వందలమంది కండక్టర్ల చుట్టూ తిరుగుతున్నారు. కాళీలు లేవుట!" అన్నా.

ట్రైను వాల్తేరు వదిలేసరికి రాత్రి ఎనిమిదిన్నరయింది. కూర్చొందుకు జానెడు కాళీ అయినా దొరుకుతుందేమోనన్న ఆశతో పాసింజర్లు అటూ యిటు తిరుగుతున్నారు. అప్పటికే పాసింజర్లు చాలామంది తను తమ బిచానాలను విప్పి పడుకొన్నారు. జాలిగుణం వున్న పాసింజర్లు తమ పాదాల దగ్గర కూర్చోడానికి కొంతమందికి అనుమతిస్తున్నారు. కొంతమంది పొమ్మంటున్నారు.

ఒక పెద్దమనిషి వచ్చి నా బెర్తుకు దగ్గరగా నిలబడ్డాడు. తలెత్తి అతని వైపు చూసా. అతని చేయి పట్టుకొని అయిదారు సంవత్సరాల అబ్బాయీ, వెనుక రెండేళ్ల అమ్మాయిని భుజాన వేసుకొని నిలబడి వున్న అతని అర్ధాంగీ కనిపించారు. వారి వయస్సు ముప్పైకీ నలభైకి మధ్య వుంటాయి. కూర్చొందుకు కొంచెం జాగా యివ్వమని కళ్లతోనే అర్థించాడా వక్తి. అతని అభ్యర్థనని తెల్సుకొని మొహాన్ని పక్కకు తిప్పకొన్నా... పార్వతి కూడా వాళ్లని గమనించింది.

"మన బెర్తులమీద కనీసం కూర్చోడానికి కూడా ఎవరికీ అనుమతివ్వకండి! తర్వాత పడుకొంటామంటారు." అని అంతకు ముందే పార్వతి హెచ్చరించడం వల్ల అలా ప్రవర్తించక తప్పలేదు. పాపం భుజంమీద పిల్లతో అలా ఎంత సేపని నిలబడి వుంటుంది! ఎంత దూరం వెళ్లాలో ఏమో! జాలి కలిగినా నిర్దయునిగా సంస్కారహీనునిలా ప్రవర్తించాల్సి వచ్చినందుకు బాధపడ్డాను. అతనికి తెలుగురాదు కాబోలు! ఇంగ్లీషులో మాట్లాడాడు!

"దయచేసి మా ఆవిడకు కొంచెం జాగా యిప్పించండి! నేను నిలబడే వుంటా!" ప్రాధేయపడ్డాడు. ఇంగ్లీషు రాకపోయినా విషయం గ్రహించింది పార్వతి.

"మీరేమీ మెత్తబడకండి! ముందు కూర్చొంటామంటారు! తర్వాత పిల్లల్ని పడుకోబెడ్తారు!" వార్నింగిచ్చింది... అతను నా సమాధానం కోసం ఆశగా చూస్తున్నాడు.

"తొమ్మిది గంటలవుతోంది కదండీ! అందరమూ పడుకొంటాం!" అన్నా ఆంగ్లంలోనే.

"మీరు పడుకొండి! మీ పాదాల దగ్గర కూర్చొంటాం! పిల్లనెత్తుకొని నిలబడ్డం కష్టం! దయ చూపండి" బతిమాలాడు.

"పాదాల చెంత చోటు!" ఎంత హీనమైన మాట వాడాడు! సభ్యతా సంస్కారం వున్న వాడెవడైన ఆమెకు వెంటనే జాగా యిచ్చి తీరాలి. జాలి వేసింది. కనుబొమ్మల్ని చిట్లించుకుంటూ వార్నింగ్ సిగ్నల్ యిస్తోంది పార్వతి. ఎటూ చెప్పలేక యిరకాటంలోపడి మౌనం వహించా ... ఆ దంపతులిద్దరూ నా వైపు చూస్తున్నారు ఆశగా.

"మరో చోటుకి వెళ్లమనండి!" అంది పార్వతి.

"క్షమించండి! మరోచోట ప్రయత్నించండి!" అన్నా. అతను కదల్లేదు.

"అన్ని బెర్తులమీద మగవారే వున్నారు సార్! తమరు కనికరించక తప్పదు!" అన్నాడు. అతని అర్ధాంగి రెండడుగులు ముందుకేసి మాకెదురుగా నిలబడింది. భుజంమీద పాప నిద్రపోతోంది. నాగరీకులు! అతను ఉద్యోగస్థునిలా కనిపిస్తున్నాడు. ఖరీదైన బట్టల్ని ధరించారు.

"నువ్ పడుకో! నీ కాళ్ల దగ్గర కూర్చుంటుంది!" అన్నా పార్వతితో! వాళ్లకి తెలుగు రాదు అన్నధీమాతో.

"ముందు కూర్చోనిస్తే తర్వాత నడుం వాలుస్తానంటుంది. ఆమెకి బెర్తునప్పగించి నేను కూర్చోవాల్సిన పరిస్థితి రావచ్చు!" అంది కరక్కశంగా. ఆమె వైపు దీనంగా చూస్తోందా యిల్లాలు. పార్వతిమీద నాక్కూడా కోపం వచ్చింది.

"మీ చెల్లెలే అనుకొండి! దయచేసి అనుమతించండి!" మళ్లీ బతిమాలాడాయన.

"పోనీ కూర్చోనీయమ్మా!" అన్నాడు రమేష్. పార్వతిలో ఏ మూలనో దాగివున్న మానవత్వం మందలించింది కాబోలు! కాళ్లు ముడుచుకొని కూర్చోమన్నట్లు సైగచేసింది అయిష్టంగానే. ఆ యిల్లాలు కళ్లతోనే కృతజ్ఞత చెప్పి పొందిగ్గా కూర్చొంది. పాపను వొళ్లో పడుకోబెట్టుకొంది. ఆమె కూర్చున్నాక అతను పక్కకు వెళ్లి వెంటనే తిరిగి వచ్చాడు. భార్యకెదురుగా నాకు దగ్గరగా నిలబడ్డాడు. నా బల్లమీద ముగ్గురు పిల్లలూ, నేనూ కూర్చున్నాం. ఎదురు బల్లమీద పార్వతీ, పెద్దమ్మాయి, 'ఆమె' కూర్చున్నారు. పార్వతి మరికొంచెం జరిగితే ఆమె ప్రక్కను అతను కూర్చోవచ్చు. కానీ పార్వతి అంగీకరిస్తుందో లేదో! పిల్లలకింకా నిద్రరాలేదు. ప్రయాణ సరదాలో వున్నారు. వెన్నెల బాగావుంది. కిటికీలోంచి బయటకు చూస్తున్నారు.

* * *

కాలేజీలకీ, స్కూలుకీ వేసవి శలవులిచ్చారు. మా ప్రక్కవాటాలో అద్దెకున్న సాంబశివరావు గారు కూడా కేంద్ర ప్రభుత్వోద్యోగే! ఆమధ్య ఆయన ప్రభుత్వం యిచ్చిన లీవ్ ట్రావెల్ కన్సి

**చిరునామాలు : మనవి**

పత్రికలోపడ్డ రచయితుల చిరునామాలు కావాలని రాయవద్దని మనవి. మీరు వారికి రాసే ఉత్తరాలు కేరాఫ్ ఎడిటర్, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ — 3 అని రాసినట్లయితే— మా కార్యాలయం వాటిని "రీ డైరెక్టు" చేయడానికి ప్రయత్నిస్తుంది. కనుక రిప్లయి కార్డులు రాయవద్దని మనవి.

— సం॥

షన్‌మీద దక్షిణదేశ యాత్రలు చేసివచ్చారు. అప్పటినుంచీ మావాళ్ళు కూడా తిరుపతీ మద్రాసూ వెళ్ళాలని కూర్చున్నారు. వాళ్ళ మావయ్య అంటే నా బావమరిదికి సంవత్సరం క్రితం మద్రాసు ట్రాన్స్‌ఫరైంది. అప్పటి నుంచీ మమ్మల్ని మదరాసు రమ్మని ఆహ్వానిస్తున్నాడు. రైలుఖర్చులు పెట్టుకొని పిల్లల్తో వెళ్లడం అంటే మాటలా? మాకు తిరుపతి మొక్కు వుంది. ఆఖరి అబ్బాయికి జబ్బు చేసినప్పుడు సకుటుంబంగా తిరుపతి వచ్చి దర్శనం చేసుకొంటామని మూడు సంవత్సరాల క్రితం మొక్కుకుంది పార్వతి. వెళ్ళాలి! మొక్కు తీర్చుకోవాలి! రానూపోనూ రైలుఖర్చులు ప్రభుత్వం భరిస్తుంది. పైఖర్చులు పెట్టుకోవాలి! తెగించి ఆ నెలజీతం పట్టుకొని బయలుదేరాను. మూడు వారాల క్రితమే ఆరుబెర్తులని రిజర్వు చేయించాను తిరుపతికి. తిరుపతిలో మా రెండో బావమరిది తోడల్లుడున్నాడు. అతను నాక్కూడా దగ్గర బంధువే. తిరుపతి వచ్చినప్పుడు తన యింటికి రమ్మంటున్నాడు. అంటే తిరుపతిలోనూ మద్రాసులోనూ కాటేజీలకీ, లాడ్జీలకూ ఖర్చులు వుండవు. పైగా మంచి గైడెన్సు వుంటుంది. ఇబ్బందులూ బోల్తాలూపడే ప్రమాదం వుండదు. ఎలాగైతేనేం తెగించి బయలుదేరా దైవదర్శనం కోసం.

రైలు రెండు స్టేషన్లు దాటింది ఆగకుండా. అతనలాగే నిలబడి వున్నాడు. వాళ్ళ బ్బాంబు మాత్రం కాస్త చొరవ తీసుకొని నా పక్కనే వున్న జాగాలో యిమిడిపోయాడు. అతను కూడా తన భార్య ప్రక్కనున్న ఆ కాస్త జాగాలోనో, లేదా నా ప్రక్కనో కూర్చోవచ్చు! కానీ పర్మిషన్ లేకుండా కూర్చోడం సభ్యత కాదని కాబోలు! నిలబడే వున్నాడు. కూర్చోమనడం సంస్కారవంతుల లక్షణం. మరి నాలో ఆ సంస్కారం వుందా? వుంది! కానీ ఏంలాభం? ఏమైతే అయిందని తెగించా. మా పెద్దబ్బాయిని వాళ్ల అమ్మ ప్రక్కను కూర్చోమని అతన్ని ఆ జాగలో కూర్చోమన్నా. నాకు శతకోటి ధన్యవాదాలు అర్పించి కూర్చున్నాడాయన. పార్వతి చూస్తూ వూరుకుందే తప్ప నోరు మెదపలేదు. పై బెర్తులు నాలుగూ కాళీగా వున్నాయ్. పడుకొనేటప్పుడు మాత్రమే తప్ప మధ్యనున్న బెర్తుని వాల్చడానికి వీలులేదు.

"ఎక్కడికి వెళ్తారు?" అడిగా అతన్ని ఇంగ్లీషులో. అతను తన వివరాలన్నింటినీ పూసగుచ్చినట్లు చెప్పాడు.

అతని పేరు బిశ్వనాథ్ చటర్జీ. ఆమె పేరు ప్రఫుల్ల. ముగ్గురు సంతానం. బెంగాలీ వారు. హౌరాలో రైల్వే వుద్యోగి. ఒక తమ్ముడు వైజాగ్ పోర్టులోనూ, మరో తమ్ముడు మద్రాసు సెంట్రల్ రైల్వేస్టేషనులోనూ వుద్యోగాలు చేస్తున్నారు. తండ్రి పోయాడుట. తల్లీ, ఆఖరి తమ్ముడూ విశాఖపట్నంలో వుంటున్నార్ట! ఆఖరి తమ్ముడు వాల్తేరులో యింజనీరింగ్ చదువుతున్నాట! ఎప్పట్నించో తల్లి లాలాజీ దర్శనం చేసుకొంటానని అంటోందిట! అందుకని తల్లికీ తనపై ఆధారపడి వున్న తమ్మునికీ కూడా రైల్వే పాసు తీసుకొని రెండు రోజుల క్రితం హౌరాలో బయలుదేరి వైజాగ్‌లో దిగాడుట. తల్లినీ తమ్ముణ్ణీ తీసుకొని తిరుపతి వెళ్తున్నారట. అక్కణ్ణుంచి మద్రాసు వెళ్తారట! వాల్తేరులో ఆ ట్రైన్‌కి రిజర్వేషన్ దొరకడం చాలా కష్టం అయిందట! తనకు తెల్సిన మరో రైల్వే ఉద్యోగి ద్వారా ప్రయత్నిస్తే ఒకే ఒక బెర్తు లభ్యం అయిందట. ఆ బెర్తు మీద ఆస్మాపేషంటు అయిన తల్లిని పడుకోబెట్టాడట. ఆమెదగ్గర తమ్ముణ్ణీ, పెద్దకొడుకునీ వుంచాడట! విజయవాడలో రిజర్వేషన్ యిప్పిస్తానని హామీ యిచ్చాడుట కండక్టరు.

ఈ విషయం అంతా పార్వతితో చెప్పా. ఆమె చీకాకుపడింది. నా తొందరపాటుకి నన్ను నిందించింది.

"అయితే బెజవాడ వరకూ వీళ్ళు మనల్ని వదలరన్న మాట! నేనూ పిల్లలూ పడుకొంటాం మీబెర్తుని వాళ్ళకి దానంచేసి తెల్లవార్లూ నిలబడి వుండండి!" మూతి ముడుచుకొంది. నాకు నిద్ర పట్టదన్న గ్యారంటీ నాకుంది! పైగా బాధ్యత! సామాన్లు చూసుకోవాలి! పదిగంట దాటింది. గోదావరి బ్రిడ్జి చూడాలన్న ముచ్చట తీరడంతో నిద్ర వస్తోందన్నారు పిల్లలు. అంతలో చటర్జీ గారి తమ్ముడు ఒక కారియర్ అందించివెళ్ళాడు. దానిని ఓపెన్ చేసింది ప్రఫుల్ల! ఆ గిన్నెల్లో రసగుల్లాలూ, గులాబ్‌జాములూ వున్నాయ్. గిన్నెలో వున్న స్పూన్‌తో ఒక్కొక్క రసగుల్లా గులాబ్‌జామ్ పాకంతో మా అందరి చేతుల్లోనూ వుంచింది. మొదట్లో సంకోచించినా పార్వతి కూడా తీసుకొంది. మంచిరుచిగా వున్నాయి. మిగతావి ఆ దంపతులిద్దరూ తిన్నారు.

"హౌరానుంచి తెచ్చాను!" అన్నారు చటర్జీగారు.

"చాలా రుచిగా వున్నాయ్ సార్! మావైపు యింత రుచిగా తయారు చేయలేరు!" కాంప్లిమెంటు పారేసా. పిల్లలందరూ మంచినీళ్ళు తాగారు. ప్రఫుల్లకి పార్వతి నీళ్ళు అందించింది. పిల్లలు నిద్రపోతామనడంతో బెర్తులుసర్దుబాటు చేయాల్సి వచ్చింది. అప్పర్ బెర్తులు రెండింటి మీదా పెద్దపిల్లల నిద్దర్నీ పడుకోమన్నా. ఒక మిడిల్ బెర్తుమీద చిన్నపిల్లల నిద్దర్నీ పడుకోబెట్టా. రెండో మిడిల్ బెర్తు ప్రఫుల్లకి ఎలాట్ చేసాను. పార్వతికి ఎలాగూవుంది సెపరేట్‌గా. నా బెర్తుమీద నేనూ, చటర్జీగారూ. అలా ఎడ్జస్ట్ చేసినందుకు ఎంతగా సంతోషించారో అంతగానూ విసుక్కొంది పార్వతి. అయితే బయటకుమాత్రం ఏమీ అనలేదు. నేనూ చటర్జీగారూ తప్ప అందరూ నిద్రపోయారు.

బెజవాడలో అనుకొన్నట్టుగానే రిజర్వేషన్ సంపాదించుకొన్నారు చటర్జీగారు. మూడు బెర్తులు దొరికాయ్! విశేషం ఏవిటంటే మాకెదురుగా వుండే బెర్తులే దొరికాయ్. బెజవాడ మంచి పగటి ప్రయాణం ప్రారంభం అయింది. దారిలో చటర్జీగారు రకరకాల స్వీట్సు పళ్ళూ కొన్నారు. మా పిల్లలకి కూడా యిచ్చేది ప్రఫుల్ల. పార్వతి తెచ్చిన

# బొమ్మా-బొరుసు

పూరీలూ, జంతికలూ వాళ్లకిచ్చింది. మధ్య స్టేషన్లలో దిగినప్పుడు మాకు కూడా మంచినీరు తెచ్చియిచ్చే వారు చటర్జీగారు.

తిరుపతి చేరుకొనే సరికి బాగా చీకటి పడింది. బాగా మబ్బు వేసివుంది. ఈదురుగాలి. చినుకులు! మేము చేసిన సహాయానికి [?] కృతజ్ఞత ఆఖరిసారిగా చెప్పుకొని వెళ్లారు చటర్జీ దంపతులు. రిక్షాలు చేయించుకొని బండ్లవారి వీధికి వెళ్లాం. రామం యిల్లు తెల్సుకోవడం ఏమంత కష్టం కాలేదు. అయితే పెద్ద యిబ్బందే యెదురైంది. ఆ యింటికి తాళం వేసివుంది. రామం తల్లికి జబ్బుగా వుందని టెలిగ్రాం వస్తే ఆరోజు వుదయమే పెళ్లాం పిల్లలతో అమలాపురం వెళ్లాడట! ఇంటి యజమాని జెప్పాడు. యాత్రాస్థలాల్లో వుండే గృహస్థుల మనస్తత్వాలు అలా వుంటాయి కాబోలు! "సామాన్లు మా యింట్లో వుంచి దైవదర్శనం చేసుకొని రండి!" అని అంటారని ఆశించాను.

"కొండమీద కాటేజీలు దొరుకుతాయ్! పదిగంటలవరకూ కొండమీదికి బస్సులు వెళ్తాయ్! శీఘ్రంగా వెళ్లండి! యాత్రల రోజులు. కాటేజీలు దొరకడం కష్టం!" తొందర చేసారాయన

టైము చూసుకొన్నా! ఎనిమిదిముప్పావయింది.

"ఎనిమిదీ ముక్కాలు! శీఘ్రంగా పొండి!" తొందర చేసిందా గృహిణి. చినుకులు జోరుగా పడుతున్నాయ్. చేసేదిలేక రిక్షాల్లో బస్స్టాండ్ చేరుకొన్నాం. కొండమీదికి బస్ టికెట్లు సంపాదించడం కష్టమే అయింది. ఎలాగైతేనేం ఎగువకొండ చేరుకొన్నాం. వాన పెద్దదైంది. ఎంక్వయరీ ఆఫీసుకెళ్లా కాటేజీ బుక్ చేయడం కోసం. కాటేజీలు ఖాళీలు లేవన్నాడు. పైగా మా అమాయకత్వానికి నవ్వుకొన్నాడు.

"ఇవి యాత్రల రోజులు కదా సార్! అంతా వారం పదిరోజుల ముందుగానే రిజర్వు చేసుకొంటున్నారు. ఇప్పటికిప్పుడు దొరకడం కష్టం! ప్రయివేటు కాటేజీలు కూడా ఖాళీలు లేవని అనుకొంటున్నారు. ప్రయత్నించి చూడండి!" సలహా యిచ్చాడు. నిరాశా నిస్పృహలు అలముకొన్న నాకు నడ్డి విరిగినట్టయింది. అలాగే కౌంటరులో అచేతనంగా వుండిపోయా. అతను చెప్పడం మొదలెట్టాడు మళ్లీ –

"మీరు ఫామిలీతో వచ్చినట్టున్నారు ఈ రాత్రప్పుడు వానలో ఎక్కడకని తిరుగుతారు! అయినా దొరుకుతాయన్న గ్యారంటీ లేదు! బ్రోకర్నుని పట్టుకొంటే నాలుగుచోట్ల మిమ్మల్ని వానలో తిప్పుతారు. కానీ ప్రయోజనం వుండదు. వాళ్ల కమీషన్ వాళ్లకి పారేయక

తప్పదు. రాత్రికిక్కడే వెయిటింగ్ హాల్లో కాలక్షేపం చేయండి !''

ఏంచేయాలో పాలుపోక ఆలోచనలోపడ్డాను. అంతా అయోమయంగా తోస్తోంది. వాన కురుస్తోంది. ఎదురుగా వున్న హోటలు చాలా రద్దీగా వుంది.

''పిల్లలు ఆకలంటున్నారు ! భోజనం పెట్టిస్తే బావుంటుందండి !'' అంది పార్వతి. ''పదిగంటలు దాటితే భోజనం వుండదు'' అని ఎవరో అనుకుంటూ వుంటే విన్నా. టైము సరిగ్గా పదిగంటలైంది. ఆ రోజుల్లో భోజనం లేదు. రాత్రి కూడా లేకపోతే యిబ్బందే. సామాన్లు చేతపుచ్చుకొని ఆ వానలో ఎదురుగా హోటల్లో దూరాం. భోజనంచేసి బయటకు వచ్చాం. వాన పెద్దదైంది. వీధి అరుగుమీద నిలబడి చూస్తున్నాం. వీధిలో జన సంచారం లేదు. గొడుగులు వేసుకొని కొంతమంది తిరుగుతున్నారు. నాకు ముందు రాత్రి నిద్రలేదు. సామాన్లు ఎక్కడ వుంచడం ? తెల్లవార్లూ ఎలా గడపడం ? ఆలోచనలో పడ్డా.

''అటు చూడండి ! చటర్జీగారు కదూ !'' గట్టిగా అంది పార్వతి. అటు చూసా. చటర్జీగారే ! గొడుగు వేసుకొని చేతిలో మరచెంబుతో వెళ్తున్నారు.

''చటర్జీ !'' గట్టిగా కేకవేసా. చటర్జీ వెనక్కి తిరిగి చూసాడు. మా దగ్గరికి వచ్చాడు. మా పరిస్థితిని తెలుసుకొని చాలా విచారించాడు. ''అయిదు నిమిషాల్లో వస్తా ! యిక్కడనే వుండండి !'' అని చెప్పి వెళ్లాడు. మాలో ఆశారేఖ వుదయించింది. పదినిమిషాలు గడిచాయ్. నిమిషమొక యుగంలా గడుస్తోంది. ఒక జీప్ వచ్చి మా ముందు ఆగింది. అందులో చటర్జీ వున్నారు. ''రండి! జీపెక్కండి!'' జీప్‌లోనుండే కేకవేసారు. ఒక్క సెకండుకూడా వృధాచేయకుండా అందరమూ జీపెక్కాం సామాన్లతో. జీపు బయలుదేరింది. దారిలో చెప్పారు చటర్జీగారు. తన సహవుద్యోగి అన్నగారు అక్కడ దేవస్థానంలో అసిస్టెంటు యింజనీరుట ! ముందుగానే ఒక కాటేజీ రిజర్వుచేసి వుంచారుట. తంతే బూరెల గంప మీద పడినట్లయింది మా పని. మమ్మల్ని తన కాటేజీలోకి సాదరంగా ఆహ్వానించింది ప్రఫుల్ల ! వేడి టీ అందించింది.

''తెల్లవారు ఝామునే లేచి వెళ్లి క్యూలో నిలబడదాం ! యాత్రీకుల సంఖ్య చాలా పెద్దదిగా వుంది ! దర్శనానికి ఒక పూట పడుతుందిట !'' అన్నా నా మాటలకి చటర్జీ చిరునవ్వు నవ్వారు.

''క్యూలో నిలబడితే కాళ్లూ, నడుమూ వగైరాలు పీకులు పట్టుకుంటాయ్ ! క్యూలోనే ఆ భగవంతుని దర్శనం అయిపోతుంది. మా యింజనీరుగారు దైవ దర్శనానికి స్పెషల్ యేర్పాట్లు చేస్తారు. ఆ విషయంలో బెంగపడకండి !'' అన్నారు నిదానంగా.

మర్నాడుదయం అనుకున్నట్టుగానే మా కందరికీ అరగంటలో దైవదర్శనం లభించింది. మా అదృష్టానికి మురిసిపోయింది పార్వతి. ఇంజనీరుగారి జీపు మీదనే పాపనాశనం, గోగర్భం, ఆకాశగంగ, మంగాపురంలు తిరిగాం ! ఆ సాయంత్రం మరోసారి దైవదర్శనం చేసుకొన్నాం స్పెషల్‌గా. ఆ రాత్రి కూడా అక్కడనే వుండిపోయాం. మర్నాడుదయం చటర్జీగారు తిన్నగా మద్రాసు వెళ్లిపోయారు. మేము కాళహస్తి, కంచి చూసుకొని రెండోరోజున మద్రాసు చేరుకొన్నాం.

మా బావమరిది యింట్లో మూడురోజులున్నాం. మా అందరకీ మద్రాసు అంతా చూపించాడు. మహాబలిపురం తీసుకొని వెళ్లాడు. ఆ రోజు తిరుగు ప్రయాణం. ఉదయం నేనూ మా బావమరిదీ సెంట్రల్ స్టేషన్‌కివెళ్లి రిజర్వేషన్‌కోసం ప్రయత్నించాం. మూడువారాల వరకూ కాళీలు లేవన్నాడు. హౌరా ఎక్స్‌ప్రెస్‌కి టికెట్లు తీసుకొన్నాం. ట్రైను బయలుదేరడానికి ఒక గంట ముందుగా అంటే ఒంటిగంటకే స్టేషన్ చేరుకొన్నాం. అప్పటికే ట్రైను పూర్తిగా నిండిపోయి వుంది. కాలు పెట్టడానికి కూడా కాళీలేదు. అన్ని జనరల్ కంపార్టుమెంటులూ ఒకేలాగున్నాయ్. చాలాసేపు అటూ యిటూ తిరిగాం. ఆలస్యం చేసినకొద్దీ రద్దీ ఎక్కువౌతోంది. ఇక లాభంలేదని ఒక కంపార్టుమెంటులో చొరబడ్డాం. సామాన్లన్నింటినీ గుమ్మానికి పక్కగా వున్న సందులో పేర్చాం. పెట్టెమీద పార్వతిని కూర్చోమన్నా. కూర్చుంది. గాలిరాదు ! వచ్చేపోయే జనం ఆమెను ఒక్కొక్కతోపు తోస్తున్నారు. వాటికన్నా పెద్ద యిబ్బంది, పక్కనే వుంది మరుగుదొడ్డి. దుర్వాసన వేస్తోంది.

''ఇలా మరుగుదొడ్డి పక్కన కూర్చో ప్రయాణం చేయలేమురా తమ్ముడూ ! మర పెట్టెలోకి పోదాం !'' అంది తమ్మునితో.

''అన్నీ అలాగేవున్నాయ్ అక్కా ! కొం దూరం వెళ్ళాక కాళీలు అవుతాయ్ ! సర్దుక వచ్చు !'' సర్దిచెప్పాడు శంకరం. మాట్లాడలేదు పార్వతి.

మంచినీళ్ళ కోసం వాటర్‌జగ్గు తీసుకొ కొళాయి దగ్గరకెళ్ళా. నన్ను పేరుపెట్టి ఎవరో పిల్చారు. అటుచూసా. చటర్జీగారు కనిపించారు. అతని వెనుక సామానుతో లైసెన్సు కూలీ ప్రఫుల్లా, పిల్లలూ! నాకు ప్రాణం లేచివచ్చింది. తోడు దొరికారనుకొన్నా. అయితే మా కంపార్టుమెంటులో వాళ్ళకి స్థలంలేనందుకు విచారించాను.

''వాల్తేరు వెళ్తున్నారా ?'' అడిగారు చటర్జీగారు.

అవునన్నట్లు తలూపాను.

''రిజర్వేషన్ దొరికిందా ?'' అడిగారు తెల్లమొహం వేసా. ''వర్రీకాకండి! మా అమ్మ గార్కీ తమ్ముడికీ కూడా బెర్తులు రిజర్వు చేయించాను. కాని వాళ్ళు రావడంలేదు ! ఇక్కడే ఒక నెలరోజు లుంటారుట ! మా మొత్తం అర బెర్తులమీదా ఎడ్జస్టు అవుదాం ! నాతోరండి నా కంపార్టుమెంటు చూపిస్తా !'' అన్నారు.

''అవునన్నయ్యగారూ ! వెళ్లేటప్పుడుకూడా అందరం కల్సేవెళ్దాం !'' అంది ప్రఫుల్ల !

''గుడ్ మార్నింగ్ అంకుల్'' పలకరించాడు చటర్జీ పెద్దకొడుకు.

నే చెప్పిన వార్త విని పార్వతి ఎగిరి గంతేసింది. చటర్జీగారి కంపార్టుమెంటులోకి మారిపోయాం.

''పరరాష్ట్రంవాడైనా ఎంత అభిమానం చూపిస్తున్నారో చూడండి !'' అంది పార్వతి. ★

ఇటీవల నెల్లూరులో నెఫ్జా నాటకోత్సవాలలో ఉత్తమ దర్శకునిగా ఎన్నికైన శ్రీ చీకటి వినోద్‌కుమార్‌కు బహుమతి నందిస్తున్న జిల్లాపరిషత్ ఛైర్మెన్ డాక్టరు బాలచెన్నయ్యని, సినీదర్శకుడు కోడిరామకృష్ణని, అభినందిస్తున్న చిత్ర నిర్మాత డాక్టర్ తిరుపతిరెడ్డి, నెఫ్జా అధ్యక్షుడు శ్రీ సుందరరామిరెడ్డిని చిత్రంలో చూడవచ్చు.





## సాహిత్య శిల్ప ఆవిష్కరణ :

ఇటీవల కాంచన్‌బాగ్ రక్షణ శాఖోద్యోగుల కాలనీలో శ్రీ వడలి మందేశ్వరరావు రచించిన సాహిత్య శిల్ప అనే విమర్శ గ్రంథం ఆవిష్కరణ సభ నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య తూమాటి దొణప్ప అధ్యక్షతన జరిగింది ముఖ్యఅతిథిగా వచ్చిన సాంస్కృతిక, సమాచార శాఖా కమీషనర్ శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్ గ్రంథాన్ని ఆవిష్కరించారు. ఇప్పుడు వెలువడుతున్న వందల పుస్తకాలలో ఇలాటి పుస్తకం ఒకటి వచ్చినా ముందు తరాలవారికి మార్గదర్శకం కాగలదని, తెలుగులో విమర్శ పద్ధతుల ప్రమాణీకరణ అవసరమని శ్రీ ప్రసాద్ అన్నారు. శ్రీ మందేశ్వరరావు ప్రాచీనాధునిక సాహిత్యాలను బాగా అధ్యయనం చేసిన భావుక విద్వాంసులని, ఈ గ్రంథంలోని విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీల సాహిత్య వ్యక్తిత్వాలను ఎంతో ప్రతిభావంతంగా ఆవిష్కరించారని, పాశ్చాత్య విమర్శను, సంప్రదాయ విద్వత్తతో అనువర్తితం చేశారని ఆచార్య డాక్టర్ దొణప్ప అన్నారు డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, శ్రీ మందేశ్వరరావు విమర్శలోని లోతులను ప్రశంసించారు. సమదర్శిని సాహిత్య సంస్థను స్థాపించి శ్రీ మందేశ్వరరావు తమను చైతన్యవంతులను చేశారని సమదర్శిని సంస్థవారు ఆయనను శాలువతో సన్మానించారు. సన్మానాన్ని శ్రీ భగీరథరావు నిర్వహించారు.

# హైదరాబాదు నోటుబుక్

## కృష్ణాపత్రిక పునఃప్రారంభం :

1902లో ప్రారంభమయిన కృష్ణాపత్రికను శ్రీ ముట్నూరు కృష్ణారావు చేపట్టి ఉన్నత ప్రమాణాలతో స్వాతంత్ర్య సమర కాలంలో నిర్వహించారు. ఆయన గాంధీ భాష్యకారుడుగా విఖ్యాతి కెక్కారు. ఆయన తర్వాత శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు, శ్రీ వేమూరి యోగానంద లక్ష్మీనరసింహరావు. శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ నిర్వహించారు. దానినిప్పుడు శ్రీ పిరాట్ల వేంకటేశ్వర్లు పునరుద్ధరిస్తాను కున్నారు. ఈ ప్రారంభోత్సవం రక్తాక్షి ఉగాది నాడు బర్కత్‌పురాలోని కృష్ణాపత్రిక నూతన కార్యాలయంలో జరిగింది. అధ్యక్షత వహించిన డాక్టర్ బిరుదురాజు రామరాజు, ప్రారంభకులు శ్రీ జి. పుల్లారెడ్డి, ముఖ్యఅతిథి భాసస్సమ్రాట్ శ్రీ కె. వి. భాస్కరరావు, ఉపన్యాసకులు శ్రీ యుతులు నీలంరాజు వెంకటశేషయ్య, ఎన్. వి. గోపాలశాస్త్రి, డాక్టర్ ముదిగొండ శివప్రసాద్, పొత్తూరి వేంకటేశ్వరరావు కృష్ణాపత్రికతో తమకుగల సంబంధం వివరిస్తూ, కృష్ణారావుగారు పెట్టిన ప్రమాణాలతో పత్రికను నిర్వహించాలని సలహా ఇచ్చారు. శ్రీ ఎన్. వి. గోపాలశాస్త్రి ఆదర్శం వాణిజ్యం రెండూ కలపా లన్నారు. శ్రీ వెంకట శేషయ్య తమ అర్ధశతాబ్ద పత్రికా రచనానుభవం నుండి పెక్కు అమూల్య రత్నాలు కుమ్మరించారు. శ్రీ పిరాట్ల తమ ప్రసంగంలో యథాశక్తి కృష్ణా పత్రిక ప్రమాణాలను పాటిస్తా నన్నారు. శ్రీ గోపాల కృష్ణయ్య వందన సమర్పణతో కార్యక్రమం సమాప్తమయింది.

## తెలుగు విజ్ఞానపీఠం :

తెలుగు విజ్ఞానపీఠం అనే నూతన విశ్వవిద్యాలయం రక్తాక్షి ఉగాది నాడు వెలిసింది. దీనికి మాజీ రాష్ట్రపతి డాక్టర్ నీలం సంజీవరెడ్డి ప్రారంభోత్సవం జరిపారు. ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు అధ్యక్షత వహించారు. తెలుగు జాతి సర్వతోముఖాభివృద్ధికి ఈ విజ్ఞానపీఠం కృషి చేస్తుందని ముఖ్యమంత్రి అన్నారు. విజ్ఞానపీఠం ప్రతిష్ఠాపనకు సూచనలు చేయడానికి నియమించిన సంఘం అధ్యక్షులు, లోకాయుక్త శ్రీ ఆవుల సాంబశివరావు తెలుగు సంస్కృతి రక్షణకు ప్రతి తెలుగువాడూ పాటు పడాలన్నారు. శ్రీ సంజీవరెడ్డి తమ ప్రసంగంలో తెలుగు వికాసానికి ప్రత్యేక విశ్వవిద్యాలయ స్థాపనను హర్షిస్తూ, పండిట్ జవాహర్‌లాల్ నెహ్రూ హయాంలో రూపొందిన త్రిభాషా సూత్రం తప్పని సరిగా అనుసరణీయమన్నారు. మాతృభాషకు — తెలుగుకు సరైన స్థానం దేశంలో లేకపోతే, తెలుగు వాడికీ స్థానం వుండదని, దానితోపాటు సంధాన భాషల అవసరమూ వుందని ఆయన అన్నారు. ప్రారంభంలో సాంస్కృతికశాఖ కమీషనర్ శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ స్వాగతం చెప్పారు. ప్రారంభోత్సవం గంట మాత్రమే ఆలస్యంగా ప్రారంభమయింది.

## ఉపశ్రుతి :

ఏమిటి చిత్రకారమహాశయా మీరూ ఉన్నారా ఈ సన్మానంలో ?— మాకు అందిన మొదటి జాబితాలో మీ పేరు లేదే !— అనడిగాను తెలుగు వెలుగు సన్మానానికి వచ్చిన ఒక చిత్రకార మిత్రుణ్ని. రెండో లిస్టులో వచ్చాను లెండి — అన్నారు ఆయన. ఏ లిస్టులో వుంటే నేమండీ, వడ్డించేవాడు మనవాడయితే— అన్నారు పక్కన వున్న మూడవ లిస్టు ఆసామీ.

— తిరుమల రామచంద్ర★

'సాహిత్య – శిల్ప' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్. ఆయనకు ఎడమవైపున రచయిత శ్రీ వడలి మందేశ్వరరావు, కుడివైపున డా. తూమాటి దొణప్ప, డా. ఇరివెంటి కృష్ణమూర్తిగార్లని చిత్రంలో చూడవచ్చు.



Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor: S Radhakrishna, Phones · P. B X : 61247, 61248 & 75667.